Acc. No: 25077



# లలితా త్రిశతీ భాష్యమ్

# LALITHA TRISATEE BHASHYAM

(శ్రీమచ్ఛంకర భగవత్పూజ్యపాద విరచిత భాష్యమునకు-
ఆంధ్రీకరణము)

గరికిపాటి కృష్ణమూర్తి,
అడ్వకేటు : : విజయవాడ-2.

భువనవిజయం పబ్లికేషన్స్
" సౌందర్యలహరి "
కస్పావారివీధి, గవర్నరుపేట,
విజయవాడ - 2.



చిద్ఘనాయ ప్రసన్నాయ శ్రుత్యాకాశ విహారిణే
అద్వైతామృతవర్షాయ శంకరాయ నమో నమః

అపర శంకరులైన శ్రీ శ్రీ శ్రీ శ్రీ శంకర భగవత్పాదుల వారు మనల నాశీర్వదించి జగత్కల్యాణము కొరకు కొన్ని గ్రంథములను రచియించి, ప్రస్థాన త్రయమునకు భాష్యము నుపదేశించి అద్వైతామృతమును ప్రపంచమున కందించిరి. అందు యీ లలితా త్రిశతీభాష్య మొకటి. ఈ భాష్యమును తెనుగుచేసిన వారు బ్రహ్మశ్రీ గరికపాటి కృష్ణమూర్తిగారు. వారు చిన్న వయసులోనే పరమ పదించినారు. వారు బ్రతికియున్న కాలములో సంస్కృతాంధ్ర భాషాసేవ చేయుటయేకాక విజయవాడ ప్రభుత్వ కళాశాలలో "లా" ఉపాధ్యాయునిగా పనిచేసి ఎంతమందినో నాశాస్త్రమందు తీర్చిదిద్దిన పుణ్యమూర్తి. అటువంటి వారి గ్రంథమును మేమిపుడు పునర్ముద్రించుటకు నవకాశము కల్పించిన శ్రీ పాటిబండ సుందరరావు పంతులు గారికి, మా కృతజ్ఞతలు.

ఈ గ్రంథమును చూచిన వెంటనే మాకు ముద్రణకు కావలసి నార్థిక సహాయము చేసిన మా గురువులు శ్రీ చెవుటూరి తాండవకృష్ణగారికి, వారి సతీమణి శ్రీమతి కుసుమకుమారి గారికి మా హృదయపూర్వక నమస్కారాలు. వారాశీస్సులు మాకు కలకాలము కలుగగలవని భావించుచున్నాము.

మా భువన విజయం పబ్లికేషన్స్ యింతవరకు భగవత్పాదులవారి లక్ష్మీనరసింహకరావలంబ స్తోత్రము, సౌందర్యలహరి, శివానందలహరి, కాశీ సారము, భజగోవింద స్తోత్రము, వ్యాఖ్యానములతో ముద్రించియున్నాము. ఇపుడు మీకు యీ లలితా త్రిశతీ భాష్యము నందించుచున్నాము. పాఠకజనులు దీనిని పఠించి తరించుదురు గాక.

జి. వి. హరనాథ్.



శ్రీ శంకర భగవత్పాదుల రచించిన త్రిశతీ భాష్యమును తెనుగు చేసినది గరికిపాటి కృష్ణమూర్తిగారు వీరు, జగత్ప్రఖ్యాతమైన 'తర్కసంగ్రహ' మును రచించిన గరికిపాటి అన్నంభట్టుగారి సంతతివారు. వీరి మాతామహులు మంత్ర శాస్త్రవేత్తలు. కృష్ణమూర్తిగారికి చిన్నప్పటినుండి సంస్కృత భాషయందు ప్రవేశము కలదు స్వయముగా వ్యాకరణ శాస్త్రమును, మహాభాష్యమును అధ్యయనము చేసిరి వేదాంత శాస్త్రమును శ్రీ బెల్లంకొండ రామరాయ కవిగారి గ్రంథముల ద్వారా పఠించిరి. ఇటు మంత్రశాస్త్రము, అటు వేదాంత శాస్త్రము బాగుగా తెలిసిన కృష్ణమూర్తిగారు త్రిశతీ భాష్యమును తెనుగు చేయుటకు సమర్థులు. వీరు సంస్కృతములో గూడా గ్రంథములను వ్రాసిరి. ఇండియన్ కాన్స్టిట్యూషనును సంస్కృతములోనికి వ్రాసిరి శ్రీ రామకృష్ణ పరమహంస బోధలను రామకృష్ణ కర్ణామృతమను గ్రంథ రూపముగా వ్రాసిరి. అహల్యా వృత్తాంతము, నహు చరిత్ర అను కావ్యములను రచించిరి. శ్రీ బెల్లంకొండ రామరాయ కవిగా 'హయవదన శతక'మునకు తెనుగు అర్థమును తాత్పర్యమును రచించిరి 'భా విశేషములు' అని తెలుగు గ్రంథమును వ్రాసి ప్రచురించిరి వీరి సంస్కృ రచనలు కొన్ని అయోధ్యలోని 'సంస్కృత' వారపత్రికలో ప్రచురింపబడెను పూరీ గోవర్ధన పీఠాధిపతులైన శ్రీ జగద్గురు శంకరాచార్యుల వారు, కృష్ణమూ గారికి 'విద్యారత్న' యని బిరుదును ప్రసాదించిరి.

కృష్ణమూర్తిగారు వృత్తిరీత్యా న్యాయవాది. ఎస్. ఆర్. ఆర్. కాలేజీలో 'లా' లెక్చెరరుగా కొన్ని సంవత్సరములు పనిచేసిరి. కృష్ణమూర్తిగారికి ఇంగ్లీషులో పాండిత్యమేగాక ఫ్రెంచిభాషలో గూడా ప్రవేశము గలదు. వీరు పిన్నవయసులోనే, కాలం చేసిరి.

ఈ లలితా త్రిశతీ భాష్య పునర్ముద్రణము తలవని తలంపుగా తటస్థించినది. కృష్ణమూర్తిగారి వద్ద కాలేజీలో 'లా' చదివిన శ్రీ చెవుటూరి తాండవ కృష్ణగారీ గ్రంథమును చూచిన వెంటనే రెండవసారి ముద్రింపించవలసినదని, అందులకయ్యే ద్రవ్యము నిచ్చెదనని చెప్పిరి. శ్రీ తాండవ కృష్ణగారికి కృష్ణమూర్తి గారిపై గల గురుభక్తికి, తాండవకృష్ణగారి ధర్మపత్నికి పరదేవతపై గల భక్తి దోహదమిచ్చి ఈ సత్సంకల్పమును కలుగచేసెను. కావున ఈ దంపతులు ప్రశంసనీయులు. 'అడిగిన నిచ్చుకంటెను నయాచితుగాగ నెరింగి యిచ్చుటెక్కుడు ఫలమిచ్చు'నని పెద్దలు చెప్పిరి. ఈ గ్రంథ ముద్రణకు సహాయ మొనర్చి ఇహపర శ్రేయస్సును సంపాదించుకొనుటయేగాక లోకోపకారము కూడా చేసినందుకు, ధన్యులు.

విజయవాడ - 2

24 - 11 - '86.

పాటిబండ సుందరరావు.



చెవుటూరి తాండవకృష్ణ గారు
F.C.A.



శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి

చెవుటూరి చారిటీస్ ద్రవ్యసహాయముతో ఈ గ్రంథము
ముద్రింప బడినది.

శ్రీ ః

# త్రిశతి

సదాశివసమారమ్భాం శంకరాచార్యమధ్యమామ్
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్॥

నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తిం చ తత్పుత్ర పరాశరం చ
వ్యాసం శుకం గౌడపదం మహాంతం గోవిందయోగీంద్ర మథాఽస్య శిష్యమ్।
శ్రీశంకరాచార్యమథాస్య పద్మపాదం చ హస్తామలకం చ శిష్యం
తంత్రోటకం వార్తికకార మన్యానస్మద్గురూన్ సంతతమానతోఽస్మి ॥

ఈ శ్లోకములు మంత్రశాస్త్రమందు గురుసంప్రదాయమును తెలియజేయుచు అందు శ్రీశంకరభగవత్పాదులకున్న స్థానమును చాటుచున్నవి. అనగ పరమాద్వైతవాదియగు శంకరులు మంత్రశాస్త్ర ప్రవక్తలలో నొకరుగ నున్నట్లు దీనివలన తెలియుచున్నది. మంత్రమనగ ద్వైత భాగములోనిదే; ఇందు ధ్యాత, ధ్యానము, ధ్యేయము అను త్రిపుటి ఉన్నది. కావున శంకరులెట్లు మంత్రశాస్త్రమున గురుపీఠమలంకరించిరని ప్రశ్నించిన, మంత్రముద్వారా అద్వైతము సిద్ధించునని చెప్పవలసి వచ్చుచున్నది. మంత్రమును చిరకాలము మనన మొనరించినపుడు ఈ త్రిపుటి నశించి అభేదము సిద్ధించునని మంత్రశాస్త్రజ్ఞులు చెప్పుదురు,

## మంత్రములు

వైదికములు. తాంత్రికములు, అపభ్రంశము అని మంత్రములందు మూడు విభాగములు కలవు వేదోక్తములగునవి వైదికములు. జ్ఞానప్రధానములైనవి వైదికములని, కామ్యప్రధానములైనవి తాంత్రికములని కొందరు చెప్పుదురు. 'వైదికాః ప్రణవైర్యుతాః, ప్రణవేన విహీనాస్తు తాంత్రికా ఏవప్రకీర్తితాః' ప్రణవసహితములైనవి వైదికములని ప్రణవహీనములు తాంత్రికములని మరియొక విభాగమున్నది

సంస్కృతమునుండి అపభ్రష్టములైన దేశభాషలలోగల మంత్రములు అపభ్రంశ మంత్రములు: మళయాళ మంత్రములు తెలుగు తమిళ హిందీమంత్రములు (పాము – తేలు - మంత్రములు) మొదలైనవి అపభ్రంశమంత్రములు లోకమున ప్రసిద్ధముగ నున్నవి. మంత్రములలో కొన్ని స్త్రీ మంత్రములు; కొన్ని నపుంసక మంత్రములు; కొన్ని పుంమంత్రములు. 'నమః' అని అంతమున నున్నవి నపుంసక మంత్రములు; స్వాహా అని అంతముననున్నవి స్త్రీ మంత్రములు' 'హుం ఫట్' అని అంతమున కలవి పుంమంత్రములు. పురుషదైవత్యములు మంత్రములని స్త్రీ దైవత్యములు విద్యలని మరియొక విభాగము కలదు ఏకాక్షరములుగు మంత్రములు పిండములని, మూడు అక్షరములు కలవి కర్తరులని మూడు మొదలుకొని తొమ్మిది అక్షరములు కలవి బీజకములని, పదిమొదలుకొని ఇరువది అక్షరములు కలవి మంత్రములని ఆపైన నున్నవి మూలామంత్రములని మరియొక విభాగము కలదు. ఇంకను అనేక విభాగములున్నట్లు (అముద్రిత) గీర్వాణేంద్ర విరచిత ప్రపంచ సార సంగ్రహమునందు కనబడుచున్నవి. వైదిక మంత్రములు సమయాచారమునకు సంబంధించినవి. వామాచారమునకు సంబంధించినవి తాంత్రికమంత్రములు. 'జపో నామ విధివదుపదిష్ట వేదావిరుద్ధ మంత్రాభ్యాసః' అను శాండిల్యోపనిషద్వాక్యముచే వేదమునకు విరుద్ధముగాని మంత్రములను జపింపవలెను. కావున సప్తకోటి మంత్రములలో ప్రధానమైనవి వైదికమంత్రములే.

## గాయత్రీ మంత్రము

మంత్రశాస్త్రమనిన కొందరకు భయముకలదు; మంత్రములను జపింప కూడదని, అవి ఒక్కొక్కప్పుడు మంత్రజాపికి భయమును కలిగించి మతిస్థిమితము లేకుండచేయునని భయముకలదు. కాని ఈవిధముగ మంత్రమునుచూచి భయ మొందువారు గాయత్రీమంత్రమునుచూచి భయమొందరు; ఎందుకనగ, ఈమంత్రము మంత్రశాస్త్రభాగములోనిది కాదని వారియూహ. కాని, నిక్కముగ గాయత్రీ మంత్రము మంత్రశాస్త్రములోనదగు మంత్రరాజము. 'కుండలిన్యాం సముద్భూతా గాయత్రీ ప్రాణధారిణీ' అని యోగచూడామణ్యుపనిషత్తు. సర్వమంత్రములు కుండలినియందు కలిగినవి, అందే గాయత్రికూడ కలిగినది. కావున వైదికమంత్ర భాగములలో ప్రధానమైనది గాయత్రి. గాయత్రీమంత్రముచే ప్రతిపాదింపబడునది స్త్రీత్వవిశిష్టమగు దేవత; ఈమెయే చిచ్ఛక్తి, అనగ పరాశక్తి అనగ బ్రహ్మము;

కావున గాయత్రి బ్రహ్మప్రతిపాదకమగు మంత్రము; బ్రహ్మము సర్వాత్మకము, కావున సర్వపదార్థజాతము ఈ మంత్రముచే ప్రతిపాదింపబడుచున్నది. సాధారణముగ ద్విజులుచ్చరించు గాయత్రీమంత్రమునందు మూడుపాదములు కలవు; కుండలినీ శక్తి 24 తత్త్వములలో జగత్తును సృజించును కావున గాయత్రి 24 అక్షరములను కలిగియున్నది. అని శంకరులు ప్రపంచ సారమున వ్రాసిరి. 'పరోరజసి సావదోమ్' అని చతుర్థపాదముకూడ గాయత్రికి కలదు; చతుష్పద అయినపుడు నిర్గుణ బ్రహ్మమును సూచించును, త్రిపద అయినపుడు సగుణ బ్రహ్మమును సూచించును గాయత్ర్యుపాసన బహుశ్రేష్ఠమైనదని దేవీభాగవతాదులందు చెప్పబడినది. వసిష్ఠ విశ్వామిత్రుల మహిమకు కారణము గాయత్రీమంత్రజపమేనని పురాణములందు చెప్పబడినది. విద్యారణ్యులు ఈ మంత్రమును జపించియే ఉత్తీర్ణులైరని ప్రసిద్ధి కావున గాయత్రీరూపమున బ్రహ్మవిశిష్టమగు శక్త్యుపాసన సర్వబ్రాహ్మణులకు విధింపబడినది.

## శ్రీవిద్య

బ్రహ్మాండపురాణమందు లలితాత్రిశతీ నామములున్నవి. ఇవి పంచదశీ మంత్రమునకు సంబంధించినవి. మంత్రములోని ఒక్కొక్క ఖండములోని ఒక్కొక్క అక్షరమునకు ఇరువది నామములు చొప్పున మొత్తము 300 నామములున్నవి. ఈ మంత్రమునకు శ్రీమహాత్రిపురసుందరీ విద్య అనిపేరు. మంత్రములోని మొదటి ఖండమందలి అయిదు అక్షరములు వాగ్భవ ఖండము; రెండవ ఖండమందలి ఆరు అక్షరములు కామరాజఖండము; చివరి నాలుగు అక్షరములు శక్తిఖండము. ఈ ఖండములు క్రమముగ వహ్నిసూర్య సోమ ఖండములని ప్రపంచ సార సంగ్రహము నందున్నది. ఈ మంత్రమునకు 'శ్రీ' అను బీజమును చేర్చినపుడు శ్రీ రాజరాజేశ్వరి అను పేరు కలిగిన షోడశాక్షరీమంత్రమగుచున్నది. శ్రీబీజము ఈ విద్యయందు ప్రధానమైనదగుటచే ఈ విద్యకు శ్రీవిద అనుపేరు కలిగినది. 'సప్తవర్ణా మనుర్బాలః, కుమార్యష్టాక్షరః స్మృతః, షోడశార్ణయుతః ప్రౌఢః', సప్తవర్ణములు కలిగిన మనువు (మంత్రము) బాల అనుపేరుకలది, అష్టాక్షరములు కలది కుమారి, షోడశవర్ణములు కలది ప్రౌఢ కావున రాజరాజేశ్వరీ మహాషోడశాక్షరీ మంత్రము ప్రౌఢమైనది. గాయత్రినుండి పంచదశీమంత్రము ఉద్ధృతమైనట్లు త్రిపురతాపిన్యుపనిషత్తునందు చూపింపబడినది. గాయత్రి ద్విజుల

కేర్పడినది; పంచదశి చాతుర్వర్ణ్య మనకును ఉపాస్యమని అగస్త్యకృత శ్రీవిద్యా దీపిక యందున్నది. మాయను నివర్తింపజేసి అపరోక్షమగు బ్రహ్మమును ప్రకాశింపచేయుము-అని ఈ మంత్రమునకు అర్థము. అనగ పరాశక్తిని కొలచిన బ్రహ్మ సాక్షాత్కారము కలుగును. సాక్షాత్కార మగునట్టిది జగత్కారణమును మాయా శబళిత (చిత్రిత - సహిత) మునకు బ్రహ్మమేనని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. చంద్రునకు చంద్రిక యున్నట్లు, పావకునకు ఉష్ణత్వమున్నట్లు, సూర్యునకు కిరణము లున్నట్లు బ్రహ్మమునకు, (శివునకు) శక్తి (మాయ) సహజముగ నుండును. కావున కేవలమగు బ్రహ్మమును ఉపాసించుటగాని, కేవలమగు శక్తిని ఉపాసించుట గాని కుదరదు; మాయ మిథ్య అని వేదాంతులు చెప్పుదురు; అనగ మాయకు బ్రహ్మము అధిష్ఠానముగ నున్నది; బ్రహ్మము లేనిది మాయలేదు కావున కేవల మగు మాయ ఉపాస్యముకాదు; శక్తి ప్రాదుర్భావముపలననే బ్రహ్మముయొక్క ఆస్తిత్వము మనకు తెలియుచున్నది 'శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం, నచే దేవం దేవోనఖలు కుశలః స్పందితుమపి'; శక్తిలేనిది శివునకు స్పందనమే లేదని శంకరులు సౌందర్యలహరి యందు వ్రాసిరి. కేవలమగు శివుడు శక్తివిహీనుడు; కావున ఉపాసింపవలయునది శివాశక్త్యాత్మక మగు పరాశక్తియే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఒక్కొక్క గుణమును కలవారు; పరాశక్తి గుణ సామ్య మొంది వీరికి పూర రూపమై యున్నది. అందుచే మాయాశక్తియను పేరు గలిగిన బ్రహ్మరూపభగవత్యుపాసనమే ముఖ్యమని దేవీభాగవతమందును, నీల కంఠీయ వ్యాఖ్యాన మందును స్పష్టముగ నున్నది. 'సచ్ఛబ్దవాచ్యం బ్రహ్మఽవిద్యా శబలం భవతి' సత్ అను శబ్దముచే చెప్పబడు బ్రహ్మము అవిద్యా శబలితము అని మహానారాయణోపనిషత్తు. బ్రహ్మసాక్షాత్కార మనునది విద్వదనుభవములో నున్నదని శంకర విద్యారణ్యాది మహానుభావులు చెప్పిరి. ఇట్టి అనుభవము మంత్ర మహిమచే తనకు కలిగినదని ఈ శతాబ్దమునకు చెందిన బెల్లంకొండ రామరాయ కవి వ్రాసెను. కావున ఇట్టి అనుభవము కలుగుటకు మంత్రమావశ్యకమని తెలియు చున్నది. సాధన శక్తిచే మంత్రశక్తి ఉద్బుదమైన సిమ్మట మంత్రదేవతా సాక్షాత్కారము కలుగును మననము వలన రక్షించునది కావున మంత్రము. మంత్రమననముచే మన శ్శుద్ధికలుగును మనశ్శుద్ధికి ఆహారశుద్ధి ముఖ్యము. 'అన్నమయం హి సోమ్య మనః' మనస్సు అన్నముయొక్క వికారమని శ్రుతి. కావున మనశ్శుద్ధి కోరువానికి ఆహారశుద్ధి, సత్ప్రవర్తనము అవశ్యకము. 'హేతుద్వయంచ చిత్తస్య

వాసనా చ సమీరణః, తయోర్వినష్ట ఏకస్మిన్ ద్వావపి వినశ్యతః । తయోరాజా సమీరస్య జయం కుర్యాత్' వాసనలు (సంస్కారములు) ప్రాణవాయువు ఈరెండును చిత్తమును కలుగజేయును. ఈ రెండును వినష్టములైనపుడు చిత్తము వినష్టమగును; చిత్తమును జయించుటకై మొదట ప్రాణధారణ మొనరింపవలయును, అని యోగకుండల్యుపనిషత్తు. చిత్తము యొక్కయు ఆత్మ యొక్కయు కలయిక సమాధి యందురు ఆత్మ మనసోరైక్యం సమాధి రితి కథ్యతే' అని వరాహోపనిషత్తు అనగ చిత్తము నాశమొందినపుడు సమాధి కలుగును. చిత్తనాశము సరూపమని అరూపమని రెండు విధములుగనున్నది; జీవన్ముక్తునకు సరూప చిత్తనాశము కలుగునని, దేహాంతమున ముక్తినొందువానికి అరూప చిత్తనాశము కలుగునని ముక్తికోపనిషత్తు. కావున చిత్తమును నాశమొందించిన యోగికి బ్రహ్మసాక్షాత్కారము కలుగును కొందరకు మంత్రమనిన భయమెందులకు కలుగుచున్నదనిన, ద్వైతమున్నపుడు భయమే కలుగును; 'ద్వితీయాద్వై భయం భవతి' తనకంటె భిన్నమగునది ఉన్నదని భావించినపుడు భయము కలుగును. అర్జునునకు విశ్వరూప సందర్శనమైనప్పుడు భయము కలిగెను అదియే ఆత్మసాక్షాత్కారమైనయెడల భయమనునది కలుగదు. సర్వము ఆత్మకంటె అభిన్నముగనున్నపుడు భయమెట్లు కలుగును ? 'అభయం వై జనక ప్రాప్తోఽసి' నీవు అభయమును పొందితివి అని శ్రుతి; అనగ అద్వయబ్రహ్మమునుపొందినపుడు అభయముకలుగును 'తద్ధైతత్పశ్యన్ ఋషిర్వామదేవః ప్రతిపేదే - అహం మనురభవం సూర్యశ్చ' అనుశ్రుతి వలన బ్రహ్మసాక్షాత్కారమొందినపుడు తానే మనువనని సూర్యుడనని సర్వముతానేనని వామదేవుడను ఋషి గ్రహించెను. కావున ద్వైతమంత్రములవలన, తాంత్రిక మంత్రములవలన భయముండవచ్చును కాని జ్ఞానప్రదములగు అద్వైతమంత్రముల వలన భయముండదు

## సాక్షి

ఆత్మయే సాక్షి. ఈ ఆత్మ లేదని కొందరు, ఉన్నదని కొందరు; ఉనదనువారు ఆస్తికులు ఈ గ్రంథము ఆస్తికుల కేర్పడినది. 'అస్తీత్యేవోపలబ్ధవ్యః' ఉన్నదను భావముతోడనే బ్రహ్మ సాక్షాత్కారమునకై ప్రయత్నింపవలెనని శ్రుతి అనగ ఉన్నదా లేదా అను సందేహముతో వ్యాకులమొందుచున్న కేవల తార్కికునకు ఈ జ్ఞానము కలుగదు. తార్కికచాట భటరాజాః' అని శంకరులు శుష్క-

కలిగినట్లు, భూమి నుండి ఓషదులు కలిగినట్లు పైనచెప్పిన చతుర్విధభూత గ్రామము బ్రహ్మమునుండి కలిగినది. సర్వము బ్రహ్మమయమని సోపానక్రమమున జనులు తెలుసుకొన వలయును.

## దహరాకాశము :

హృదయాకాశమును దహరాకాశమందురు. దహరమనగ అల్పము అల్పమగు హృదయాకాశము సాక్షియొక్క స్థానమని శ్రుతులు చెప్పుచున్నవి. హృది అయం, హృదయమందు సాక్షియుండును కావున హృదయము అని నిర్వచింపబడి నది. 'అంగుష్ఠమాత్రః పురుషోంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః అని శ్రుతి. అంగుష్ట ప్రమాణము కలిగిన హృదయమందు సాక్షియుండుటచే వానికిగూడ అంగుష్ఠమాత్ర పురుషుడని ప్రతీతి, ఇట్టి సాక్షిని ప్రతి మనుజుడును హృదయమున సుషుప్తియ దు పొందుచున్నాడు. (నిదురించునపుడు సాక్షిహృదయ మున నుండునని శ్రుతి ) వాస్త ముగ జీవుడును, ఈశ్వరుడును చైతన్యస్వరూ పులే జీవుడు 'జాగ్రత్' అను ధామమును స్వమాయచే కల్పించి అన్నపానాది భోగముల నొందుచున్నాడు, స్వప్నావస్థయందు బాహ్యేంద్రియములు ఉపరతము లగును. కాని స్వాప్నపదార్థాకారమున పరిణామమొందిన అంతఃకరణ ముండును, ఈ అవసయందు స్వనిర్మితములగు సుఖదుఃఖాదులను జీవుడు పొందును: సుషుప్తి (స్వప్నవిహీనమగు గాఢనిద్ర) యందు, అంతఃకరణముకూడ విలయమొందుటచే జీవుడు స్వస్వరూప మహానందము నొందును. కాని ఈ ఆనందము అజ్ఞానముచే అవృతమైనది; నిక్కమగు ఆనందము సమాధియందు కలుగును. సమాధియందు జీవుడు మూఖమందుండును. సుషుప్తినుండి లేచి ప్రతిమనుజుడు 'నేను సుఖనిద్ర నొందితిని' అని చెప్పుటకు కారణము సాక్షీరూప చైతన్యము సర్వావస్థలయందు భాసించుచుండుటయే. జాగ్రత్ స్వప్నసుషుప్త్యాది పురత్రయము పురుషునియొక్క భోగమునకై నిర్మింపబడినది. భోగమునకు నిర్మింపబడినవి సుఖదాయకములగును గదా! జాగ్రదవస్థాభిమానియగు సాక్షివిశ్వుడను సంజ్ఞకలవాడై నేత్రములందుండి శబ్దస్పర్శాది విషయభోగముల నొందును. స్వప్నావస్థాభిమానియగు సాక్షి తైజసు డను పేరుకలవాడై కంఠమందుండి తనచే అవిద్యవలన కల్పింపబడిన అసాధారణ విషయములను అనుభవించును. సుషుప్త్యాభిమానియగు సాక్షి ప్రాజ్ఞుడను పేరు కలవాడై హృదయమందుండి ఆనందము ననుభవించును. సాక్షి కేవలసుఖలక్షణుడు.

తార్కికవాదము చేయువారిని ఆక్షేపించెను. సాక్షియొక్క అస్తిత్వమును గురించి ఉపనిషత్తులయందు సూతసంహితయందు ఈ క్రిందివిధముగ నున్నది.

సర్వేంద్రియములను మనస్సు ప్రేరేపించుచున్నట్లు మనకు భాసించు చున్నది; కాని నిక్కముగ మాయచే మనస్సునందు ఇంద్రియ ప్రవర్తకత్వము కల్పింపబడుచున్నది. ఆత్మయందు మనస్సు ఆరోపింపబడి (అధ్యస్తమై) యుండు టచే ఇట్లు భాసించుచున్నది; అగ్నిచే కాల్చబడిన అయఃపిండము దహించుచున్నది' అని చెప్పినపుడు దహించుచున్నది అగ్నియే, ఇనుము కాదు; అట్లే ఆత్మయందు అధ్యస్తమైన మనస్సు ప్రేరణశక్తి కలిగియున్నట్లు కనుపించుచున్నదే గాని, నిక్క ముగ అది అచేతనము; చేతనమగు ఆత్మయొక్క సన్నిధియందుండుటచే సచేతన ముగ కనబడుచున్నది. ఇంద్రియములచే, మనస్సుచే బ్రహ్మము తెలియబడదు స్వాత్మభూతమగు బ్రహ్మము మనస్సునకు అవిషయీకృతమైనపుడు బ్రహ్మజ్ఞానము కలిగెనని చెప్పవచ్చును పరాంచిఖాని వ్యతృణత్ స్వయంభూః' అను శ్రుతిచే బాహ్యవిషయములను గ్రహించునట్లుగ ఇంద్రియము లేర్పరుపబడినవని చెప్ప బడినది; కావున ఇంద్రియములు అంతరమగు విషయమును గ్రహింపవు. శ్రవణ మననాదులవలన కలిగిన బ్రహ్మవిషయకజ్ఞానమునందు, చక్షువు మొదలైన ఇంద్రి యములవలన కలిగిన వ్యావహారికసత్యజ్ఞానమునందు, రజతమని శుక్తికయందు కలి గిన భ్రాంతి జ్ఞానమునందు, సర్వవృత్తిజ్ఞానమునందు స్వాత్మభూతమును చిదేక రసమునగు బ్రహ్మము అవిక్రియముగ నుండి సాక్షిరూపమున భాసించుచున్నది; అనగ సర్వవిధములగు జ్ఞానములకు చైతన్యరూపమగు ఆత్మయే ఆధారము అని అర్థము. సాక్షిస్వరూపమును ప్రత్యగాత్మ అందురు; ఇందు అవిద్య (మాయ) అధ్యస్తము (ఆరోపితము). ప్రత్యగాత్మయే సర్వబుద్ధి వృత్తులతో అవ్యభిచారముగ ప్రకాశించుచుండును. ఘటమునకు కులాలుడు నిమిత్తకారణము, మట్టి ఉపాదాన కారణము; మట్టి మొదలైనవి అచేతనములగుటచే కులాలుడను నిమిత్తకారణము కావలసియున్నది కాని బ్రహ్మము శుద్ధచైతన్యస్వరూపము కావున ఇతరకారణాపేక్ష లేకుండ జగత్తునకు నిమిత్తోపాదాన కారణమగుచున్నది సృష్టికి పూర్వము సత్ప దార్థ మొక్కటేయుండెను; అట్టిది పూర్వకల్ప ప్రపంచమువలన కలిగిన సంస్కార ముచే, కాలకర్మవిపాకముచే సత్త్వవృత్తి నాశ్రయించి జగత్కారణ హేతుభూతమై పంచభూతములను సృజించెను. అందుండి అండజ స్వేదజ జరాయుజ - ఉద్భిజ్జ ములు కలిగినవి; సాలెపురుగునుండి దారముకలిగినట్లు శరీరమునుండి కేశనఖాదులు

కలిగినట్లు, భూమి నుండి ఓషధులు కలిగినట్లు పైనచెప్పిన చతుర్విధభూత గ్రామము బ్రహ్మమునుండి కలిగినది. సర్వము బ్రహ్మమయమని సోపానక్రమమున జనులు తెలుసుకొన వలయును.

## దహరాకాశము:

హృదయాకాశమును దహరాకాశమందురు. దహరమనగ అల్పము అల్పమగు హృదయాకాశము సాక్షియొక్క స్థానమని శ్రుతులు చెప్పుచున్నవి. హృది అయం, హృదయమందు సాక్షియుండును కావున హృదయము అని నిర్వచింపబడినది. 'అంగుష్ఠమాత్రః పురుషోంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః అని శ్రుతి. అంగుష్ఠ ప్రమాణము కలిగిన హృదయమందు సాక్షియుండుటచే వానికిగూడ అంగుష్ఠమాత్ర పురుషుడని ప్రతీతి, ఇట్టి సాక్షిని ప్రతి మనుజుడును హృదయమున సుషుప్తియందు పొందుచున్నాడు. (నిదురించునపుడు సాక్షిహృదయమున నుండునని శ్రుతి) వాస్తముగ జీవుడును, ఈశ్వరుడును చైతన్యస్వరూపులే జీవుడు 'జాగ్రత్' అను ధామమును స్వమాయచే కల్పించి అన్నపానాది భోగముల నొందుచున్నాడు, స్వప్నావస్థయందు బాహ్యేంద్రియములు ఉపరతములగును. కాని స్వాప్నపదార్థాకారమున పరిణామమొందిన అంతఃకరణ ముండును, ఈ అవసయందు స్వనిర్మితములగు సుఖదుఃఖాదులను జీవుడు పొందును: సుషుప్తి (స్వప్న విహీనమగు గాఢనిద్ర) యందు, అంతఃకరణముకూడ విలయమొందుటచే జీవుడు స్వస్వరూప మహానందము నొందును. కాని ఈ ఆనందము అజ్ఞానముచే అవృతమైనది; నిక్కమగు ఆనందము సమాధియందు కలుగును. సమాధియందు జీవుడు మూఖమందుండును. సుషుప్తినుండి లేచి ప్రతిమనుజుడు 'నేను సుఖనిద్ర నొందితిని' అని చెప్పుటకు కారణము సాక్షీరూప చైతన్యము సర్వావస్థలయందు భాసించుచుండుటయే. జాగ్రత్ స్వప్నసుషుప్త్యాది పురత్రయము పురుషునియొక్క భోగమునకై నిర్మింపబడినది. భోగమునకు నిర్మింపబడినవి సుఖదాయకములగును గదా! జాగ్రదవస్థాభిమానియగు సాక్షివిశ్వుడను సంజ్ఞకలవాడై నేత్రములందుండి శబ్దస్పర్శాది విషయభోగముల నొందును. స్వప్నావస్థాభిమానియగు సాక్షి తైజసుడను పేరుకలవాడై కంఠమందుండి తనచే అవిద్యవలన కల్పింపబడిన అసాధారణ విషయములను అనుభవించును. సుషుప్త్యభిమానియగు సాక్షి ప్రాజ్ఞుడను పేరు కలవాడై హృదయమందుండి ఆనందము ననుభవించును. సాక్షి కేవలసుఖలక్షణుడు.

త్రిధామములందును భోజ్యమగునట్టియు, భోక్తయగునదియు, బ్రహ్మమే. కావున త్రిధామములందును సాక్షియగు బ్రహ్మము సుఖరూపుడై యున్నాడు. భోక్తృ భోగ్యాత్మకమగు ప్రపంచమంతయు మాయావశముచే కలుగుచున్నది. పరమార్థముగ నున్నది సుఖ స్వరూపుడగు సాక్షి యొక్కడే.

## శ్రీ మహా త్రిపురసుందరి

త్రిపురములనగ జాగ్రత్స్వప్న సుషుప్తులు; ఇవి సాక్షియందే లయ మొందుచున్నవి. అనగ పురత్రయమును వ్యాపించియున్న ఆత్మయే శ్రీ మహా త్రిపురసుందరి. పంచదశీ మంత్రమందలి మూడు ఖండములు జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలకు సంబంధినవి. 'సైషాపరాశక్తిః - సైవపురత్రయం శరీరత్రయం వ్యాప్య బహిరంతరవ భాసయంతీ దేశకాలవస్త్వంతరాసంగాన్మహా త్రిపురసుందరీ వై ప్రత్యక్చితిః, సైవాఽఽత్మా, తతోఽన్యదసత్యమ్' పురత్రయమును వ్యాపించియుండి దేశకాలాదిభేదములు లేకుండ ఉన్నట్టి ప్రత్యగాత్మయే మహాత్రిపురసుందరి అని బహ్వృచోపనిషత్తు. మాయ నొందినపుడు ఈశ్వరుడని, అవిద్య నొందినపుడు జీవుడని బ్రహ్మమునకే వ్యవహారము కలుగుచున్నది. చైతన్యాఽవిశేషమున జీవేశ్వరులకభేదము. జీవుడు సుఖస్వరూపుడగుటచేతనే ఆనందరూపు డగుచున్నాడు. అనగ ఆత్మానందమునకై ఐ మనుజులకు ఇతరములగు వస్తువులు ప్రియములగు చున్నవి; పతి భార్యాపుత్రవిత్తాదులు ప్రియములగు చున్నవి. కావున ప్రియతమ మగునట్టిది ఆత్మయే. ఆత్మ ఇంతటి ప్రియమగునట్టిదగుటచేతనే సుందరి, త్రిపుర సుందరి, లలిత అని వ్యవహరింపబడుచున్నది. 'సర్వం మహాత్రిపురసుందరీ, సత మేకం లలితాఽఽఖ్యంవస్తు'. తత్త్వమస్యాది మహావాక్యములచే చెప్పబడున ఆత్మయే షోడశియగు శ్రీవిద్యచేతను, పంచదశాక్షరియగు శ్రీ మహాత్రిపురసుంద మంత్రముచేతను, బాలాంబికా బగళీ మాతంగీ ఇత్యాది విద్యలచేతను గాయత్ర్యాది మంత్రములచేతను చెప్పబడుచున్నదని బహ్వృచోపనిషత్తు.

నిర్వికల్పకమగు పదమునందు దృష్టి విశ్రమించినపుడు ముక్తికలుగును; సంసార విచ్ఛిత్తి కలుగును. సర్వజనులందు అంతరముగనున్న సాక్షిని ప్రత్యగాత్మ అందురు; దీనినే సంపూర్ణముగను అపరిచ్ఛిన్నముగ నున్నప్పుడు బ్రహ్మమందురు. అచేతనములగు శరీరాదులందు ప్రాణాపానాది వ్యవహారము, సత్తాస్ఫురణలు ప్రత్య

గాత్మవలననే కలుగుచున్నవి. అయస్కాంతము యొక్క సన్నిధియందు లోహమునకు చలనాదులు కలిగినట్లు అచేతనములగు శరీరాదులకు ప్రత్యగాత్మ సన్నిధివశమున చేతనత్వము కలుగుచున్నది దృశ్యమును షట్కోశసహితమునగు స్థూల శరీరము ఆత్మకాదు; ప్రాణాపానాదిపంచవాయువులను దశ జ్ఞాన కర్మేంద్రియములను, బుద్ధి మనస్సులను కలిగి దృశ్యమైయున్న సూక్ష్మశరీరము ఆత్మకాదు; ద్రష్టయగునట్టిదే ఆత్మ; దృగ్రూపమగునట్టిదియే ఆత్మ; బుద్ధివృత్తి మొదలైనవానిని ప్రకాశింపచేయునట్టి స్వప్రకాశ చైతన్యమే ఆత్మ. తదితరమైనట్టిది మిథ్యయే. సకల వస్తుజాలము పృధివియందు ఓతప్రోతమై ఉన్నది; జలమునందు పృధివి, వాయువునందు జలము, అంతరిక్షమునందు వాయువు, లోకములందు అంతరిక్షము ఓతప్రోతములై యున్నవి; బ్రహ్మ విష్ణు రుద్రాదిలోకములు బ్రహ్మమునందు ఓతప్రోతములై, అధ్యస్తములై యున్నవి. బ్రహ్మము సర్వాధిష్ఠానము, సర్వాంతర్యామి అధిష్ఠానము సత్యవదార్థము; అధిష్ఠానమందు అధ్యస్తములైనవి మిధ్యాభూతములు. సర్వాంతర్యామియైన ప్రత్యగాత్మ దృగ్రూపుడు, కావున దృష్టికి విషయముకాదు, జ్ఞానరూపుడు కావున బుద్ధికివిషయముకాడు, ప్రకాశస్వరూపుడై అతడుభావాభావాత్మకమగు సర్వమును తెలుసుకొనును దృశ్యమగు పదార్థమే నశించును. పాము తన కుబుసమునందు దేహమను భావము నొందదు, అట్లే విద్వాంసుడు నిజదేహమందు ఆత్మభావమును పొందక ధ్రువమగు పదార్థమును కనుగొనుటకు ప్రయత్నింపవలెను. బ్రహ్మమును గుర్తెరుగుటకు వేదానుసారముగ ప్రవర్తింపవలెను. శాంతుడై దాంతుడై శ్రవణమనననిదిధ్యాసనల నొనరింపవలెను. గురువు నాశ్రయించి మంత్రదీక్ష నొందవలెను. మంత్రశాస్త్రమున గురువునకు విశిష్ఠమగు స్థానమున్నది. గురువే పరశివుడు. గురుకృప లేనిది బ్రహ్మసాక్షాత్కారము లభ్యముకాదు. 'స హి విద్యాతస్తం జనయతి, తచ్ఛ్రేష్ఠం జన్మ, శరీర మేవ మాతా పితరౌజనయతః' అని సూతసంహిత. మాతాపితరులు శరీరమును మాత్రమే కల్పింతురు. గురువు శ్రేష్ఠమగు జన్మము విద్యవలన కలిగించును. కావున గురు కృపాపాంగావలోకనము చేతనే శిష్యునకు జ్ఞానము కలుగును.

XII

# శక్తిపాతము :

పరమేశ్వరానుగ్రహమువలనను, దీక్షాసంస్కారవశమునను, కర్మక్షయమై ధర్మాఽధర్మ సామ్యస్థితి ఏర్పడినపుడు శక్తిపాతము కలుగును. శక్తిపాతమైనపుడు శిష్యుని ఆత్మయందున్న మాయ నశించును. 'ప్రసన్నా సా మహాదేవీ మహాకారుణికో త్తమా శిష్యస్యాత్మని చిద్రూపే స్వయం పతతి నిర్మలా' అని సూత సంహిత మహాదేవి కరుణించి చిద్రూపమగు ఆత్మనుండి తొలగును; అదియే శక్తిపాతము. శక్తిపాతమైనపుడు శిష్యుని దేహము క్రిందపడును అపుడు శంకరుడు ప్రసన్నుడగును. శంకరుడు ప్రసన్నుడైనపుడు ఆ విద్య అంతయు నశించును. 'దేహపాత స్తథా కంపః పరమానందహర్షజే । స్వేదరోమాంచ ఇత్యేతత్ శక్తిపాతస్య లక్షణమ్' అని ఆగమములందున్నదని విద్యారణ్యులు వ్రాసిరి. మాయాశక్తి తొలగినపుడు సంతోషముచే శరీరము క్రిందపడును. స్వేదము, రోమాంచము కలుగును. శక్తిపాతము కలిగినపుడు శక్తి నిక్కముగ క్రిందపడదు; ఎందుకనగ. పరమేశ్వర స్వరూపభూతయు, సర్వగతయు, సచ్చిద్రూపిణియునగు పరాశక్తికి పతనము సంభవింపదు; కాని శిష్యుని ఆత్మయందు పాశజాలముతో ఆవరించియుండి కనుపడకుండ ఉండియున్న పరాశక్తి దీక్షావశముచే అభివ్యక్తమగును; దీనినే లక్షణచే, పతనమని వ్యవహరింతురు. ఇది రహస్యార్థమని విద్యారణ్యులు తమ వ్యాఖ్యలో వ్రాసిరి. ఆగమములలోకూడ నిట్లే యున్నది. వ్యాపినీ పరమాశక్తిః పతితేత్యుచ్యతే కథం । ఊర్ధ్వాఽధోగతిః పాతోమూర్తస్యాఽసర్వగస్యచ । సత్యా సా వ్యాపినీ నిత్యా సహజా వస్థితాసతీ॥ కింత్వియం మలకర్మాది పాశబంధేషు సంవృతా ! పక్వపాకేషు సువ్యక్తా పతితేత్యుప చర్యతే' సర్వవ్యాపినియగు పరాశక్తికి పడుట ఎట్లు సంభవించును ? మూర్తమగునది సర్వవ్యాపిని కాకుండ ఉన్నదియు పైనుండి క్రిందకుపడును; కాని ఈ శక్తి సర్వవ్యాపినియై సహజముగనుండి యున్నది కావున మలపాశ బంధములందు సంవృతయై యుండి, ఈ బంధములు తొలగినపుడు సువ్యక్తయైన వృత్తియై యుండును; ఈ స్థితి కలిగినపుడు పతితయైనదని లక్షణచే చెప్పబడినది;

XIII

# జీవేశ్వరులు

జీవేశ్వరులు హృదయాకాశమందు ఆతపము ఛాయవలె నున్నారు. ఆత్మేంద్రియయుక్తుడగు జీవుడు భోక్త. విజ్ఞానము నొంది మనోనిగ్రహము కలిగిన వానికి ఇంద్రియములు వశ్యములగును. ఇంద్రియములచే పొందగోరబడిన విషయములు ఇంద్రియములకంటె శ్రేష్ఠములు; వీనికంటె సర్వారంభకమగు మనస్సు శ్రేష్ఠమైనది; మనస్సుకంటె నిశ్చయాత్మకమగు బుద్ధి శ్రేష్ఠమైనది; అంతకంటె మహత్తు; మహత్తుకంటె మాయ; (అవ్యక్తము); అంతకంటె శ్రేష్ఠమైనది పురుషుడు. పురుషుడనగ సంపూర్ణుడును, సత్యజ్ఞానానంతాది లక్షణుడగు పరశివుడు. ఇట్టి పరశివుడే సర్వభూతములందు గూఢాత్మగనుండి ప్రకాశమొందుటలేదు; కాని సూక్ష్మదర్శులగువారు వానిని కనుగొనకలుగుచున్నారు. ఇంద్రియములను మనస్సునందు ఉపసంహరించి, మనస్సును బుద్ధి అను పేరు కలిగిన ప్రకాశరూపమగు ఆత్మయందు ఉపసంహరించి, బుద్ధిని మహత్తు అను పేరు కలిగిన హిరణ్యగర్భోపాధియందు ఉపసంహరించి, పిమ్మట దీనిని సాక్షిరూపమగు ముఖ్యాత్మయందు లయమొందించి పరిపూర్ణ స్వప్రకాశ చిదాత్మను అనుసంధాన మొనర్పవలెను. పురత్రయమునందు చైతన్యమాత్రుడగు శివుడే యుండునని గ్రహించినవాడు బ్రహ్మజ్ఞాని. ఏకమగు అగ్ని, కాష్ఠాది రూపభేదములందుండి ప్రతిరూపము నొందినట్లుగ, ఏకమగు బ్రహ్మము మనుష్యాది శరీరములందు ప్రవేశించి ఆయా ప్రతిరూపములను పొందెను కాని, సూర్యుడు చూపరుల చాక్షుషదోషములచే లిప్తుడు కానట్లు లోకదుఃఖముచే బ్రహ్మము లిప్తముకాదు. బ్రహ్మము ననుసరించియే చంద్రానలతారకాదులు భాసించుచున్నవి సంసారమనెడు అశ్వత్థవృక్షము ఊర్ధ్వమూలముకలది; అనగ నిరస్త సమస్తోపాధికమగు బ్రహ్మము మూలముగ కలది. అవ్యక్తాదిస్థావరాంతమగు సంసారవృక్షమునకు స్వర్గనరకాదులు శాఖలుగ నున్నవి. ఈ వృక్షమునకు మూలకారణమగు బ్రహ్మమే అమృతము, శుక్రము. బ్రహ్మము యొక్క భయముచేతనే సూర్యచంద్రాదులు తమతమ విధులను నిర్వర్తించుచున్నారు. నిర్మలమగు అద్దమునందు స్వస్వరూపమును చూడగలిగినట్లు మానుషశరీరమునందు (మనస్సునందు) శ్రవణమననాది సాధన కలాపానుష్ఠానముచే బ్రహ్మస్వరూపతత్వమును తెలుసుకొనుటకు వీలగుచున్నది - అనగ మనుష్య శరీరమునందే సాధనానుష్ఠానములకు సంభవము కలుగుచున్నది; కావున మనుష్యజన్మమందే బ్రహ్మజ్ఞానము

లభ్యమగును. కాని బ్రహ్మము నేత్రాది దర్శనలభ్యము కాదు; హృదయమందు మనీషచే లభ్యమగును. మాయాశక్తిసహితమగు చిదాత్మక బ్రహ్మము జగత్కారణము; సత్యాది లక్షణమున, అద్వితీయమునగు బ్రహ్మము సత్త్వరజస్తమో గుణాత్మకమగు మాయాశక్తిచే దమునొందును; మలినసత్త్వ ప్రధానమగు మాయనొందిన బ్రహ్మముయొక్క రూపము జీవుడు అను సంజ్ఞనొందుచున్నది; తమః ప్రధానమగు మాయను పొందినది భోగ్యమగు జగత్తు అయినది; విశుద్ధ సత్త్వ ప్రధాన మాయోపాధికమగు రూపము భోగప్రదమగు ఈశ్వరుడను సంజ్ఞనొందినది. మాయక్షరము; అక్షరుడు జీవుడు. జీవేశ్వరుల భేదము క్షరమగు మాయచే కలుగుచున్నది. జీవేశ్వరుల ఉపాధి పరిత్యాగముచే, తత్త్వమస్యాది మహావాక్య జనిత జ్ఞానముచే, బ్రహ్మాత్మైక్య జ్ఞానము కలుగును హృదయమును అధరారణిగ నొనరించి, ఓంకారమును ఊర్ధ్వారణిగ నొనరించిన నిర్మథించిన, తిలలందు తైలము లభించినట్లు, దధియందు ఘృతము లభించునట్లు, బ్రహ్మము లభించును. బ్రహ్మము ఆత్మవిద్యా తపస్సులచే లభ్యమగును

# అద్వైతము

ఇది అంతయు బ్రహ్మమే, 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని చెప్పుట అద్వైతము కొన్ని ద్వైతశ్రుతులున్నవి. కాని ఆ శ్రుతులు వ్యావహారిక సత్యమునే చెప్పుచున్నవి; సమన్వయమున సర్వశ్రుతులు పారమార్థికమగు బ్రహ్మమునే చెప్పుచున్నట్లు సూతసంహితాది గ్రంథములందున్నది. సూతసంహిత ననుసరించి శంకరులు శారీరక భాష్యమును రచించిరని సూతసంహిత వ్యాఖ్యాత యగు విద్యారణ్యులు వ్రాసినందున సూతసంహిత ఎంతటి ఉద్గ్రంథమో తెలియుచున్నది. పంచదశీమంత్రము అద్వైత పరము కామకళావిలాస పరివస్యారహస్యాది గ్రంథములందున్నది. సర్వము బ్రహ్మమను జ్ఞానము బ్రహ్మ ప్రాప్తికి సాధనమగును. చిత్తము పరిపక్వ మొందినపుడు సర్వబ్రహ్మ దర్శనము సాధ్యమగును. ఆత్మయొక్క అద్వైతమును శ్రుతి చెప్పినది. శ్రుతులలో వేదశిరముగు ఉపనిషత్తులు ప్రధానములైనవి; ఇవి వేదాంతమును (జ్ఞానమును) చెప్పునట్టివి కావున ప్రధానములు; ఇతరములగు వేదభాగములు కర్మములను చెప్పునట్టి భాగములు; అవి అవిద్యావద్విషయములని శంకరులు సూత్రభాష్యములో వ్రాసిరి 'చతుర్ణామపి వేదానాం యథోపనిషదశ్శిరః' నాలుగు వేదములలో ఉపనిషత్తులు (ప్రధానము

శైనట్లు), అని శుకరహస్యోపనిషత్తు. కావున జ్ఞానమార్గ దర్శకములగు ఉపనిషత్తులు మిగిలిన వేదభాగము కంటె ముఖ్యమైనవి.

ఇంద్రియములచే ఆత్మ అగోచరము. అతీంద్రియమగు అర్థమునందు శ్రుతియే ప్రమాణము లోకదృష్టమగు దృష్టాంతములపై ఆధారపడియుండు తర్కము అలౌకికమగు బ్రహ్మవిషయములో నిరుపయోగకరము. శ్రుతి శంకర ప్రణీతమని నైయాయికులు; శంకరునినుండి స్వయముగ అభివ్యక్తమైనదని మీమాంసకులు ఈ పక్షములలో దేని నవలంబించినను వేదము దోషరహితమగు ప్రమాణమగుచున్నది. పరమార్థమున వేదము అనాది; శివుడు వేదము నభివ్యక్త మొనరించును. కావున వేదము శివ ప్రణీతమని వ్యవహారము కలిగినది. శివుడు చిత్స్వరూపుడు, జగత్తుచేత్యము. దుర్ఘటకారిణియగు మాయచే జగత్తు నిర్మింపబడినట్లు కనబడుచున్నది; కాని వాస్తవముగనున్నది అద్వయమేనని వేదము చెప్పుచున్నది. కేవలమగు శబ్దము జడము, కావున శివప్రదీప్తమగు వేదము ప్రమాణమని సూతసంహిత చెప్పుచున్నది

అద్వయమగు బ్రహ్మము సృష్ట్యున్ముఖుడైనపుడు మాయాసహితుడై ఈక్షణపూర్వకుడై తనకును మాయకును భేదము కల్పించి మాయయొక్క గుణ భేదముచే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను కల్పించును. పూర్వకల్పమందు వలెనే జగములను సృజించును; దేవతలను సృజించును; సమిష్టినుండి వ్యష్టికలిగినది; సమిష్టిరూపమగు అంతఃకరణమున కలిగినవానికి హిరణ్యగర్భుడని పేరు. సమిష్టి రూపమగు ప్రాణమునుండి కల్పినవానికి సూత్రాత్మ అని పేరు. వ్యష్టిభూతములగు ఇంద్రియములకు సమిష్టిభూతములగు దేవతలు నియామకులు. వాయుదేవుడు త్వగింద్రియము అధిష్ఠానముగ కలవాడు; దిక్కు కర్ణదేవత; సూర్యుడు నేత్రాభిమాని: జలాధ్యక్షుడగు వరుణుడు జిహ్వాభిమాని; పృథివి ఘ్రాణాభిమానిని; అగ్ని వాగభిమాని; ఉపస్థమునకు ప్రజాపతి; పాయువునకు మిత్రుడు; పాదమునకు త్రివిక్రముడు; హస్తమునకు ఇంద్రుడు నియామకులు. ఈ విధముగ సూక్ష్మభూతములకు తత్కార్యములకు సమిష్టివ్యష్టిభావము కలదు. మనో బుద్ధి—అహంకార చిత్తములను భేదములను అంతఃకరణము కలిగియున్నది; వీనికి క్రమముగ చంద్ర వాచస్పతి కాలాగ్నిరుద్రశివులు అధిదేవతలు సూక్ష్మ భూతములనుండి ఆకాశాది స్థూలభూతములు కలిగినవి; పిమ్మట అండభేదములు, లోకభేదములు కలిగినవి.

ఈ సృష్టి అంతయు బ్రహ్మమునందు మాయచే అధ్యస్తమైయుండి దానియొక్క పారమైశ్వర్యముచే భిన్నముగ కన్పించుచున్నదేగాని, నిక్కముగ కారణమగు బ్రహ్మముకంటె కార్యమగు జగత్తు అభిన్నము బ్రహ్మమే కార్యమగు జగత్తువలె వివర్తమొందినది కావున అద్వైతమే సిద్ధాంతము 'ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైతవాసనా' ఈ అద్వైతవాసన ఈశ్వరానుగ్రహము లేనిది రాదు. ఈశ్వరానుగ్రహమునకు భక్తి యుండవలెను. 'భక్త్యా వినా బ్రహ్మజ్ఞానం న కదాఽపి జాయతే' భక్తి లేనిది బ్రహ్మజ్ఞానము కలుగదు, అని మహానారాయణోపనిషత్తు. భక్తి నిరధిష్ఠానముగ సంభవింపదు కావున సగుణోపాసన నవలంబింపవలెను. 'అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమాః పరికల్పితాః' అజ్ఞులు భావనకొరకు విగ్రహములు కల్పింపబడినవి' అని దర్శనోపనిషత్తు. కావున సగుణోపాసన సోపానక్రమమున ముక్తిని కలుగజేయును.

## అహమ్

స్వవిషయములో అందరు 'అహం' అను శబ్దమును ప్రయోగింతురు. 'ఇదం' (ఇది) అను శబ్దమును ప్రయోగింతురు కావున అహమర్థములో ఆత్మత్వము ఇదమర్థములో అనాత్మత్వము లోకమున వ్యవస్థితమై యున్నది. స్వశరీర విషయములో అహంబుద్ధి కలుగును, కాని, ఆలోచింపగ శరీరము ఆలంబనముగ కలిగినది 'ఇదంబుద్ధి' యని చిదాత్మ ఆలంబనముగ కలిగినది. అహంబుద్ధి యని తెలియుచున్నది. కావున శరీరమునందు అహంబుద్ధి కలుగుట భ్రాంతియే. శరీరము నందు అహంబుద్ధి కలుగుట భ్రాంతియే. శరీరము, మనస్సు, ఇంద్రియములు అచిద్రూపములు, అందుచే అహంబుద్ధి ఆలంబనములు కావు నిశ్చయాత్మకమగు బుద్ధికి కూడ ఉత్పత్తినాశములు కలుగుచున్నందున బుద్ధికూడ చిద్రూపము కాదు. అహంకారము సర్వప్రత్యయములయొక్క పరిణామరూపము; పరిణామము నొందునది చిద్రూపము కాదు మనస్సు మొదలైనవి చిద్రూపముచే భాసింపజేయబడుచున్నవి. అందుచే చిద్రూపమే అహంబుద్ధికి ఆలంబనమని చెప్పవలెను; ఈ చిద్రూపమే ప్రత్యగాత్మ బుద్ధివృత్తియందు ప్రతిఫలించిన చిద్రూపముచే ఘటాద్యచేతన వస్తువులజ్ఞానము కలుగును ప్రత్యగాత్మ స్వప్రకాశుడైనందున బుద్ధివృత్తి జ్ఞానము వలన తెలియబడడు; అనగ స్వయంప్రకాశముగ, సాక్షిరూపముగ, జ్ఞానరూపముగ

నున్న వస్తువునకు బుద్ధివృత్తియొక్క ఆపేక్షలేదు. ప్రత్యగాత్మతో సంబంధము కలిగియుండుటచేతనే ప్రత్యయములు (బుద్ధి) భాసించుచున్నవి. స్వయంప్రకాశమగు సాక్షి చైతన్యముచే దీప్తమై అహంకారము ప్రకాశించుచు తానే ప్రత్యయి (ప్రత్యయములు కలదాని) వలె, అనగ ఆత్మవలె కనబడును. కర్తృత్వ భోక్తృత్వాదికములు కలిగియున్నది కాని పరమార్థముగ ప్రత్యయి ఆత్మయే; కావున సర్వగోవులందు గోత్వమొక్కటైనట్లు సర్వజనులందున్న అహంశబ్దార్థ మొక్కటే, అంతఃకరణ భేదముచే వ్యక్తిభేదములు కనబడుచున్నవి. శరీరమంతయు దేవతామయము. చిచ్ఛక్తి మూలాధారమున నున్నది; సత్త్వరజస్తమోగుణాత్మికయగు మాయాశక్తి బ్రహ్మరంధ్రము క్రిందుగ లలాటముయొక్క అగ్రభాగమున నున్నది; నాదరూపమగు పరాశక్తి లలాటమధ్యభాగమున నున్నది; బిందురూపిణియగు శక్తి భ్రూమధ్యమున నున్నది; బిందుమధ్యమున సూక్ష్మరూపమున, హృదయమున స్థూలరూపమున బిందు హృదయముల మధ్యన మధ్యరూపమున జీవుడుండునని సూతసంహితయందు చెప్పబడినది. సమ్యగ్జ్ఞానము కలవారికి దేహమునందలి దేవతలందరు ప్రత్యగాత్మరూపమునను దేవతారూపమునను ప్రకాశింతురు. వేదమార్గనిష్ఠులైనవారికే ఇట్టి సమ్యగ్జ్ఞానము కలుగును; తాంత్రికులకు బుద్ధిశుద్ధి యుండదు. కావున వారికా దేవతలు ప్రకాశింపరని సూతసంహిత

## సాక్షాత్కారము

'అస్తి బ్రహ్మేతి చేద్వేద పరోక్షజ్ఞానమేవ తత్ । అహం బ్రహ్మేతి చేద్వేద సాక్షాత్కారస్స ఉచ్యతే ॥ బ్రహ్మము ఉన్నదని తెలుసుకొనినవానికి పరోక్షజ్ఞానము కలదు; నేనే బ్రహ్మమునని తెలుసుకొనినవానికి సాక్షాత్కారము కలదు' అని వరాహోపనిషత్తు. ఇట్టి సాక్షాత్కారము తమకు కలదని ప్రాచీనులు అర్వాచీనులుకూడ చెప్పుచున్నారు. చిత్తప్రసాదము నొందినవారికి సాక్షాత్కారము లభ్యమగును; అనగ చిత్తముయొక్క వ్యాపారము నశించి పరిశుద్ధమై అద్దమువలె నున్నపుడు సమాధికలుగును. అట్టి సమాధియందు కలుగు సుఖమును వర్ణింపశక్యము కాదు; 'సమాధినిర్ధూతమలస్య చేతసో నివేశితస్యాఽఽత్మని యత్సుఖం భవేత్, న శక్యతే వర్ణయితుంగిరా' అని మైత్రాయణ్యుపనిషత్తు. 'తపసా ప్రాప్యతే సత్త్వం, సత్త్వాత్ సంప్రాప్యతే మనః, మనసా

ప్రాప్యతేహ్యాత్మా ఉపత్యా నివర్తతే॥ తపస్సుచే సత్త్వగుణము కలుగును; సత్త్వముచే మనస్సు పరిశుద్ధమగును; మనస్సుచే ఆత్మ లభ్యమగును, అపుడు మనస్సు మరలిపోవును. అని మైత్రేయుపనిషత్. బ్రహ్మము ప్రకాశాంశమని శక్తివిమర్శాంశమని మంత్రశాస్త్రజ్ఞులు చెప్పుదురు అర్థసృష్టియందు ప్రకాశాంశకు, శబ్దసృష్టియందు విమర్శాంశకు జనకత్వము కలదని వరివస్యారహస్యమునందు చెప్పబడినది. బిందువు ప్రకాశమని, విసర్గ విమర్శయని మాతృకాచక్ర వివేకము 'ఆకాశోహవై బ్రహ్మ' బ్రహ్మము ఆకాశము, ఆకాశము శబ్దగుణకము; అజపాది మంత్రములను జపింపగ చిణీ మొదలగు నాదములు ఉత్పన్నమగునని, ఈ నాదములు మనస్సు ఉండునంతవరకు వినుపించునని, పరబ్రహ్మము నిశ్శబ్దమని, అది నాదాంతమున మనోన్మనీస్థానమును తెలియబడునని నాదబిందూపనిషత్తు నందున్నది నాదము శుద్ధ చైతన్యము యొక్క స్థూల రూపమని చిచ్ఛక్తి శుద్ధచైతన్యాత్మకమని అగస్త్యకృత శ్రీవిద్యాదీపికయందున్నది. కావున విమర్శాంశము నాదరూపమున సాక్షాత్కారమగునని తెలియుచున్నది. 'నాదరూపం భ్రువోర్మధ్యే మనసో మండలం విదుః' భ్రూమధ్యమున నున్న మనోమండలము నాదరూపము, అని యోగశిఖోపనిషత్తు ప్రకాశమనగ తేజస్సు. 'శుక్లతేజో మయం బ్రహ్మేతి సిద్ధమ్,' బ్రహ్మము శుక్లతేజోమయమని అద్వయతారకోపనిషత్తు; విద్యుల్లేఖేవ భాస్వరా' అనియు శ్రుతి చెప్పుచున్నది. అభ్యాసమువలన అఖండమండలాకార జ్యోతి కనబడునని అదియే సచ్చిదానందరూపమగు బ్రహ్మమని మండల బ్రాహ్మణోపనిషత్తు- 'తదభ్యాసాదఖండ మండలాకార జ్యోతిర్దృశ్యతే, తదేవ సచ్చిదానందం బ్రహ్మభవతి ' శరీరమందు మూలాధారము మొదలుకొని ఆజ్ఞాచక్రాంతము వరకు శక్తిస్థానము; కంఠమునుండి మూర్ధాంతమువరకు శాంభవస్థానము. శాంభవస్థానమున తేజోరూపమున సాక్షాత్కారము కలుగునని తెలియుచున్నది. మూర్ధమున జ్యోతిస్సు కలదని, దానిని దర్శించినపుడు సిద్ధదర్శనమగునని పాతంజల యోగ సూత్రమున నున్నది - మూర్ధజ్యోతిషి సిద్ధ దర్శనమ్.'

సహస్రారము బైదవస్థానము, సాక్షిస్థానము. ఈ సాక్షియే ఆత్మ, ధ్రువకళ, షోడశకళ; ఇదియే సుధాబిందుస్థానము. ఇందు డి అమృతము స్రవించుచుండును ఆత్మ చైతన్యరూపము కావున సూర్యాది తేజోరూపములతో ఉపమింపబడినదని 'అత ఏవ చోపమా సూర్యకాదివత్' ఇత్యాది బ్రహ్మసూత్రములందు చెప్పబడినది. నిర్విశేషమగు ఆత్మానుభవము కలిగినపుడు దృక్ దృశ్య భేదము

ఉండదు; కాని తదితరస్థితులందు, ఉపాసనాసమయమందు, జ్యోతీరూపమున ఆత్మ ప్రకాశించునని శాస్త్రమునుబట్టి చెప్పవచ్చును. ఆధారహృదయ భ్రూమధ్యములందు పంచదశీ మంత్రమందలి వహ్ని సూర్యసోమాత్మక ఖండత్రియమును విన్యసించి బ్రహ్మరంధ్రమున తుర్యఖండమును చంద్రకళాఖండమునగు శ్రీబీజమును విన్యసింప వలెనని ప్రపంచసారసంగ్రహమునందున్నది ధ్యానమున పౌర్ణమీదృష్టి మంత్రశాస్త్రమున విధింపబడినది. కావున జ్యోతీ రూపమున చిత్తశుద్ధికలవానికి ఆత్మ భాసించునని తెలియుచున్నది ఆంధ్రదేశములో మంత్రశాస్త్రములో అగ్రగణ్యులగు శ్రీ చెరుకుపల్లి నరసింహశాస్త్రిగారు తాము సంస్కృతములో రచించిన స్వానుభవానుబోధినిలో తాము సగుణోపాసన చేసినసమయములో తమకు తటిత్సన్నిభమగు భగవతీరూపము కనబడుటయు, పిమ్మట గురుకృతదీక్షావశముచే శక్తిపాతముకలిగి పూర్ణాత్మభావము తాముపొందుటయు తమకు జీవన్ముక్తిదశ ఇక్కడనే కలుగుటయును వ్రాసిరి. 'ఇత్థం శక్తినిపాతమేత్య సపది శ్రీదేశికేంద్రాత్పరం ॥ విస్మృత్యాఖిలబాహ్యకృత్య మనిశం పూర్ణాత్మభావేస్థితం। జ్ఞాత్వామాం విగతభ్రమంచ రుదతీ మాయాగతా శీఘ్రత। త్వేతావత్సుకృతం పురాకృతమహోర్యద్యస్తినో వేద్మ్యహమ్॥ వీరిగురువులగు జంధ్యాల దక్షిణామూర్తి శాస్త్రిగారు తామురచించిన చిత్కళాభుజంగమను స్తోత్రమునందు తాము సాక్షాత్కారమునొందిన విషయమునిట్లు వ్రాసిరి: 'అహం బద్ధపద్మాసనే సూపవిష్టః । పిధాయాంఽఘ్రిణాఽపానదేశం బలేన॥ హృదిస్థాప్య వాయుం భ్రుకుట్యాం చ చిత్తం। సమాధాయ పశ్యామి చిద్రూప దీపమ్ ॥ యదష్టాంగయోగప్రయాసేన లభ్యం । యదేకాంతతః పంచముద్రాదిలక్ష్యం । యదీడ్యంచ పంచాగ్నిమధ్యే తపోభి, స్తదేకం పరంధామ సాక్షాదర్శనమ్ ॥ ఈ విధముగ ఈ కాలమునాటివారి అనుభవముకూడ 'వేదాఽహమేతం పురుషం మహాంతం' అని చెప్పిన ఉపనిషత్తు కాలము నాటి వారి అనుభవమువలె నున్నట్లు కనబడుచున్నది.

## ప్రపంచసారము

మంత్రములన్నియు అక్షరాత్మకములు, అనగ శబ్దాత్మకములు, సంస్కృతము 'దైవీవాక్' 'దైవీం వాచమజనయంత దేవాః' అని శ్రుతి. వాక్కు దైవవినిర్మితము కావున నక్షరములందు మహిమకలదు, కావుననే మంత్రములందు

మహిమకలదు. శంకరులు ప్రపంచసారమను మంత్రశాస్త్ర గ్రంథమును వ్రాసిరి. అందు సమస్తమంత్రములు వానియొక్క దీక్షావిధానము, అనుష్ఠానక్రమము, హోమము, తర్పణము, ఇత్యాదులు సంపూర్ణముగ వ్రాయబడినవి. ఈ గ్రంథము నకు వ్యాఖ్యానము వ్రాసిన వారిశిష్యులగు పద్మపాదాచార్యులు. ఈ గ్రంథము ననుసరించి ఈక్రింది విషయములు వ్రాయబడినవి :

## సృష్టి

ప్రళయావసానమున త్రిగుణస్వరూపములును, మంత్రస్వరూపులు నగు బ్రహ్మ విష్ణురుద్రు లావిర్భవించిరి. ఎందుండి జనించినది, ఎందుకొరకై జనించినది వారికి తెలియక పాలసముద్రమునందు శయనించియున్న శ్రీమన్నారాయణుని వారు నుతించిరి. అంతట అతడు వారికి తన విశ్వమోహనరూపమును చూపించి త్రిమూర్తులు అక్షర (పరావాక్) సంభూతులని, సృష్టి స్థితి లయముల నొనరించుట వారి పని యని వారికి చెప్పెను; మూలవర్ణమును (హ్రీంకారమును) దాని వికృతులను, స్వరాదులతో యుక్తములగు మంత్రములను వారికి చెప్పెను. ప్రకృతి, పురుషుడు అనునవి నిత్యములైనవి; కాలముగూడ నట్టిదే; ప్రకృతి సర్వశక్తివంతమైనది. ఇది ఆకాశమువలె, సర్వవ్యాపకమై యున్నను దీనిని గుర్తెరుగుట సాధ్యముకాదు. పుంనపుంసకులందు ప్రకృతి తుల్యముగ నుండి స్త్రీలయందు (వానియందున్న ప్రసవ ధర్మము ననుసరించి) విశేషముగ నుండును; దీనినే ప్రధానమందురు. ఇది త్రిమూర్తులనే గాక నారాయణునిగూడ వ్యాపించి యుండును. చరాచరమగు జగత్తు ప్రళయమున, దీనియందు వ్యాప్తమై యుండును. ప్రకృతిని ప్రకృతి తప్ప ఇతరు లెరుగరు. నారాయణుడు మాత్రము ప్రకృతిని కాలరూపముగ నెరిగియున్నాడు.

## కాలము

కాలవిభాగ మిట్లున్నది. పద్మదళములను ఒకదానిక్రింద నొకటిపెట్టి ఒక సూదితో గ్రుచ్చిన ఒక్కొక్కదళములో సూది దిగునంతకాలము లవము; 30 లవములు ఒక త్రుటి; 30 త్రుటులొక కళ; 30 కళలొక కాష్ఠ; 30 కాష్ఠములొక నిమేషము (ఒకచిటిక వేసినంత కాలము); 8 నిమేషములొక మాత్ర (అనగ ఒక శ్వాస పీల్చినంతకాలము); 360 మాత్రలొక నాడిక; రెండునాడిక లొక ముహూ

ర్తము; 30 ముహూర్తము లొక దినము; 30 దినము లొక నెల; 12 నెలలొక మానుష సంవత్సరము; ఆపైన యుగము, కల్పము, మహాకల్పము, పదార్థమని కాలభేదమున్నవి. ఒక్క మానుషసంవత్సరము. దేవతల కొక్కదినము; దేవ మానము కంటె బ్రహ్మమాన మధికము. బ్రహ్మయొక్క జీవితానంతరము మహా ప్రళయము కలుగును. పైన చెప్పిన పంచదశభేదములు కలిగిన కాలము ఆత్మ స్వరూపము. 1

## శబ్దబ్రహ్మము

సర్వజ్ఞమగు కాలము ప్రకృతికి వికృతిని కలుగజేయును. తత్త్వసంజ్ఞ కలిగిన ప్రకృతి జ్యోతిస్సుయొక్క సంనిధానమున ఘనీభవించి బిందువగును; ఈ బిందువు కాలముచే స్థూల సూక్ష్మపరా అని మూడువిధములుగ విభక్తమగును; వీనికి బీజ నాద బిందువులని పేరు. బీజము శక్త్యాత్మకము, నాదము శివశక్త్యాత్మకము, బిందువు శివాత్మకమని శారదాతంత్రము. బిందువునుండి అవ్యక్తమను పేరు కలిగిన రవము కలిగినది. ఇదియే శబ్దబ్రహ్మము. దీనినుండి మహత్తత్త్వము (బుద్ధి కలిగినది, మహత్తత్త్వమునుండి అహంకారము; సత్త్వాది గుణయుక్తమై రస యుక్తమైన అహంకారమునుండి శక్తివలన శబ్దము మొదలైనవి స్పష్టములైనవి. శబ్దమునుండి ఆకాశము స్పర్శనుండి వాయువు - ఇట్లు పంచతన్మాత్రలు, పంచ భూతములు కలిగినవి; అహంకారమునుండి కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములు కలిగినవి; ఇట్లు 24 తత్త్వములనుండి ప్రపంచోత్పత్తి కలిగినది. ఈ ప్రపంచము సత్వ రజస్తమోగుణములచేతను, వాని వికృతులచేతను ఆవరింపబడియున్నది. శబ్దబ్రహ్మము నుపదేశింప శక్యముకాదు; అది స్వసంవేద్య రూపము. జనించిన భూతగ్రామమందు వైఖరీరూపమున శబ్దబ్రహ్మము ఆవిర్భవించును.

(1) ప్రకృతి పురుష కాలములు ఓంకారములోని అకార ఉకార మకారాత్మక ములని, హ్రీంకారములోని హకార రేఫ ఈకారాత్మకయులని మూలా ధారము మొదలుకొని ద్వాదశాంతమువరకు కాలభేదములను క్రమముగ చింతించి చివరకు ఉపసంహరించి ఉన్మని యందుండవలెనని పద్మపాదా చార్యులు, కాలస్వరూపమగు ఆత్మకు 15 భేదములుండుట పంచదశీ మంత్రమున 15 అక్షరములుండుట గమనింపవలెను.

## XXII

# భూతగ్రామము

కాలచోదితములైన ప్రకృతివలన చతుర్విధములగు దేహములు కలుగును. (1) ఔద్భిదములు (భూమినుండి పుట్టునవి) చెట్లు మొదలగునవి (2) స్వేదజలములు (చెమటవలన కలుగునవి) పంచభూతముల సంపర్కమున కలుగునట్టి నల్లులు మొదలైనవి. (3) అండజములు (గ్రుడ్లవలన కలుగునవి (4) జరాయుజములు గ్రామ్యక్రియవలన చతుర్వింశంతి తత్త్వసంయుక్తములగు మనుష్యాది శరీరములు. శుక్ర శోణితములు వాయుప్రేరితములై గర్భాశయమునందు కలియును శోణితమునకు మాయీయమలమని, శుక్రమునకు కార్మణమలమని పేర్లు. సంయుక్తమగు మలద్వయమునకు ఆణవమలమని, పేరు; ఇందు సూక్ష్మరూపములగు చతుర్వింశతి తత్త్వములందును గర్భాశయ మందలి మారుతము ఆణవమలమును పోషించును శోణితాధిక్యమున స్త్రీయును; శుక్రాధిక్యమున పురుషుడును, ఉభయము సమఃద్ధముగ నున్నపుడు నపుంసకుడగును. ఆణవము మరుదినమున బుద్బుదాకార మగును. 15 రోజులలో చతురస్రాకారము నొంది మాతృభుక్తాన్నరసము నుండి పోషణము నొందును. ఆ సోమాత్మకమునగు ఈ మలద్వయమునుండి కొంతకాలమునకు వాయుప్రేరణమున దీప్తిమగు నాడియొకటి వెడలును. ఇదియే అగ్నిషోమాత్మకమగు సుషుమ్న. ఇది అధోముఖముగ నుండును. దీనికి ఎడమ వైపున ఇడ కుడివైపున పింగళ అను నాడులుండును. ఇడానాడి వామముష్కము నుండి బయలుదేరి సుషుమ్నతో కలిసి దక్షిణ భుజమునుచేరి, ధనువువలె వంకర తిరిగి హృదయమునందుండి వామభుజమునుచేరి దక్షిణనాసికను చేరును. పింగళ నాళి దక్షిణముష్కమున బయలుదేరి వామనాసికచేరును 1

ఈ రెండునుగాక ప్రధానమైన నాడులు ఏడు కలవు, అవి - గాంధారీ. హస్తిజిహ్వా, పూషా, ఆలంబుసా, యశస్వినీశంఖినీ కుహూ-అనునవి. గాంధారీ హస్తిజిహ్వలు నేత్రద్వయమును పొందును; పూషాఽలంబుసలు శ్రోత్రద్వయమును పొందును. కంఠకూపమునందు ఉద్భవించిన శంఖిని అధోముఖియైయుండి అన్నసారమును మూర్ధమునకు తీసికొనిపోవును. మాతృభుక్తాన్నరసమును బహిర్వర్త్రిము కలిగిన యొకనాడి గ్రహించి గర్భస్థపిండమును పోషించును. రసము పక్వమై మాతృగర్భమునుండి నాడీద్వారమున శిశుశరీరమును పొందును; అపుడు సుషుమ్నా ద్వారా గర్భస్థ పిండము యొక్క ప్రాణము పోషింపబడునని గర్భో

పనిషత్తు ఇట్లు పోషించు నాళికి (బొడ్డునకు) ఆప్యాయినీనాడి అని పేరు స్కాంద పురాణమున నున్నట్లు గరుడపురాణ వ్యాఖ్యాత వ్రాసెను. పుష్టిచెందుతున్న ప్రాణమునకు పరంజ్యోతియొక్క కళ (అంశము) కలిగినపుడు క్షేత్రజ్ఞుడను సంజ్ఞ కలుగును. ఏడవనెలలో ప్రాణము జీవసంయుక్తమగునని గర్భోపనిషత్తు నందున్నది. గుణయుక్తమును, క్షేత్రజ్ఞమనగు అణవమలము అపుడు జంతువనబడును. 2

## జంతువులు

సుషుమ్న యొక్క అయిదు కణుపులనుండి 3,50,000 నాడులు బయల్వెడలనని శారీరార్థ విశారదులు చెప్పుదురు ఈనాడీ సమూహము ద్వారా శరీరమునందు వాయువు సంచరించును దేహమునందు మూలాధారమునుండి వాయువు బయలుదేరి చివరకు నాసికారంధ్రములద్వారా ప్రసరించి నాసికనుండి 12 అంగుళములలో అస్తమొందును. సూర్యనాడి అనగ సుషుమ్న చంద్రనాడి అనగ ఇడ. సూర్యచంద్రనాడులయొక్క ఊర్ధ్వాధః ప్రాణసంచారముచే అహోరాత్రములు, ఉత్తరాయణ దక్షిణాయనములు కలుగుచున్నవి.

క్షేత్రజ్ఞుడు చేతనత్వము నొందుటను గురించి మతభేదములున్నవి శుక్రశోణిత సంయోగమున చేతనత్వము కలుగుచున్నదని కొందరు (పంచాధికరణులు); మాతృభుక్తాహారము వలన కలుగుచున్నదని కొందరు (వార్షగణులు) అపత్యార్థినులయొక్క ఆహారవిహారములవలన కలుగుచున్నదని కొందరు (ఆత్రేయాదులు); పరంధాముని వ్యాప్తివలన కలుగుచున్నదని కొందరు (వింధ్యవాసులు); ఒక దీపమునుండి మరియొక దీపమును వెలిగించునట్లుగ తండ్రియొక్క దేహాత్మల సంబంధమున పరంధామునినుండి శుక్రధాతుద్వారమున చేతనత్వము సంక్రమించునని కొందరు; భౌతికమగు శరీరము కలిగినపుడు దానియందు, ఎక్కడినుండియో జీవాత్మ ప్రవేశించునని కొందరు (బార్హస్పత్యులు) చెప్పుదురు కాని నిక్కమైనదేమనగ - పరమపురుషుని సాన్నిధ్యముచే ప్రకృతి విజృంభించి, త్రిగుణభిన్నమై, కఫ వాత పిత్త త్రిదోషాత్మకమై మహత్త్వము (బుద్ధి) నొందును; పంచభూత మయమగును, సప్త

(1) ఇడా పింగళలనుండి ఎడపెడ శబ్దములు వచ్చియుండవచ్చును.

(2) జీవులు జంతువులు, శివుడు పశుపతి.

ధాతుమయమగును; పంచేంద్రియ విచారిణియు, శ్రోత్రాది జన్య పంచ బుద్ధి ప్రభావినియు నగును. ఈ విధముగ జంతువు మోక్షమొందునంతవరకు ప్రకృతి ప్రవర్తించును.

## అంతఃకరణము

పరంధామునితో సంబద్ధమైన ప్రకృతి అనగ అంతఃకరణము మహాప్రభావము కలది. సంకల్పవికల్పాత్మకమైనపుడు దానిని మనస్సు అందురు; నిశ్చయాత్మకమగునపుడు బుద్ధియందురు; నేనే జ్ఞాతనని (అవివేకముచే) గ్రహించునపుడు అహంకారమందురు. అంతర్లీనమగునపుడు చిత్తమందురు. వెనుక చెప్పిన శబ్ద బ్రహ్మము పరా పశ్యంతి మధ్యమాదిక్రమముగ ప్రయత్న విశేషములచే వైఖరీస్థూల భావమున వ్యక్తమగును.

## వాయ్వాదులు

క్షేత్రజ్ఞుడు ప్రవేశించిన పిమ్మట గర్భము వృద్ధిచెందును. సర్వావయవము లేర్పడును. జంతువు తల్లియొక్క గర్భమునందు మలదూషితమై తలక్రిందుగనుండి, సంవృత్తమైన సుషుమ్నకలదై పురాకృత పాపములను స్మరించుచు మోక్షమును కోరును. అంతకుముందు ప్రాణాదివాయువులు జంతుశరీరమునందు స్థావరము లేర్పరచుకొని యుండును. ప్రాణ మూర్ధ్వగతి కలిగియుండును; అపానము దానిని క్రిందకు లాగును. ఇట్లు పరస్పర విరోధ మున్నంతకాలము ప్రాణముండునని ప్రాణాపానములకు ఏకభావము కుదిరినపుడు రెండును కలిసి దేహమును విడిచిపోవునని పూర్ణానందస్వామి విరచిత షట్చక్ర నిరూపణమునందున్నది; సమానవాయువు జీర్ణముకొరకై కాయాగ్నిని పీచి భుక్తపదార్థమును జీర్ణ మొందించును. వ్యాన వాయువు అన్నరసమును శరీరమునందు అన్నిపైపులకు పంపును; ఉదానము ప్రాణముతో నుండి నిమేషోన్మేషమును కలుగించును; నాగము ఉద్గార (త్రేపు) కారకము; కూర్మకము కనురెప్పలను తెరచును; కృకలము తుమ్మునకు కారణము; దేవదత్తము ఆవులింతకు కారణము; శరీరమునందు కలిగెడు బహువిధశబ్దములకు ధనంజయము కారణము, ఇది లౌకికమగు వాయువగుటచే మృతశరీరమునందు కూడ నుండును. ఇట్లు దశవిధవాయువులు శరీరము ననుసరించి యుండును. ఇవిగాక పది అగ్ను

లున్నవి. అందులో ఏడు సప్తధాతువులను (అనగా—త్వక్, అసృక్, మాంస, మేదస్ అస్థి, మజ్జ, శుక్లములను) పొందియున్నవి మూడు-స్వేదము క్లేదము అంత్రము లను పొందియున్నవి. సప్తధాతువులు దూష్యములు, అనగ వాతపిత్తకఫాది త్రిదోష ములచే సంబద్ధమై యుండును. ఆకలిదప్పులు, శోకమోహములు, జరామరణములు- ఇవి షడూర్ములు; ఇవి ప్రాణబుద్ధిదేహధర్మములై యున్నవి. సప్తధాతువుల రసమునందు. శుక్రపాకమున అష్టమధాతువుగ ఓజస్సు కలుగును. దీపమునకు తైల మాశ్రయమైనట్లుగ క్షేత్రజ్ఞునకు ఓజస్సు ఆశ్రయముగ నుండును. అనేక రంధ్ర ములు కలిగిన కుండలోని అగ్నియొక్క జ్వాలలు ఆ రంధ్రములనుండి ప్రసరించు నట్లుగ క్షేత్రజ్ఞుని యొక్క జ్ఞానము ఇంద్రియద్వారమున ప్రకటమగును.

## పరా పశ్యంతి మధ్యమా వైఖరీ

మూలాధారమునుండి మొదట బయలుదేరిన భావమునకు పరా అను పేరు కలదు. అది హృదయమును చేరినప్పుడు దానిని పశ్యం అందురు; బుద్ధియుక్త మైనపుడు మధ్యమా అందురు; చివరకు వక్త్రమునందు వ్యక్తమైనపుడు వైఖరీ అందురు. వాయుప్రేరితములై వక్త్రమునుండి వర్ణములు వెడలును. గర్భస్థ జంతువుయొక్క అక్షరాభివ్యక్తిస్థానములు వికసితములు కానందున వాని వక్త్రము నుండి వర్ణములు ప్రకాశమొందవు. 'నేను జ్ఞాతను' అను భావము కలిగినపుడు జంతువు మనోఽహంకారబుద్ధులను కలిగినవాడగును. ఈ భావములు తల్లిదండ్రు లను చూచిన పిమ్మట క్రమమును వృద్ధిచెందును. మాతృగర్భమునుండి వెడలిన శిశువు పూర్వజ్ఞానమును మరచిపోవును.

మూలాధారమున అవ్యక్తముగ ప్రలపించుచున్న కుండలి ప్రసరించుచు సుషుమ్నయందు త్రి చతుః పంచ షట్ సప్త అష్ట దశ ద్వాదశ భేదమున క్రమ ముగ గుణించుకొనును. త్రిగుణితమైనపుడు కామ (ఈకారము), అగ్ని (రేఫ) నాదములు (హకారము) కలిగి ఆత్మ (బిందువు) రూపమున ప్రతీతమగును; అపుడీశక్తిని తారమందురు. కొందరు దీనినే శక్తియని (హ్రీంకారమని), కొందరు ఆత్మ (ఓంకారమని) అని వ్యవహరింతురు. ఈ శక్తియే సత్వరజస్తమస్సులను త్రిగుణములు. వాతపిత్త శ్లేష్మములను త్రిదోషములు, రక్త కృష్ణ శ్వేతములును త్రివర్ణములు; వేదత్రయము, గురుస్థానమైన అకథాది త్రికోణమండలి త్రిరేఖలు,

త్రిమూర్తులును ఈ శక్తియొక్క అవస్థా విశేషములు; వీనిని తరించుటకిది ఉపాయ భూతమగుటవలన దీనినే తార మందురు; వీనికి ధృతి (ఆలంబనము) అగుటవలన శక్తి అందురు; ఈ శక్తి చతుర్గుణితమైనపుడు పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ అను దశలను. జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయములను అవస్థావిశేషములను, మనోబుద్ధ్యహంకార చిత్తములను కరణరూపములను పొందును; పంచగుణిత మైనపుడు పంచవర్గలు (కవర్గాదులు), పంచవాయువులు (ప్రాణాపానాదులు) మొదలైనవి అగును; షట్ప్రకారమైనపుడు షట్కోశములు, షడూర్మలు, షడ్రసములు మొదలగునవి అగును. సప్తధా యుండునపుడు (ఓంకారము) యొక్కయు, హృల్లేఖము (హ్రీంకారము) యొక్కయు భేదములను కలిగియుండును. అకార ఉకార మకార బిందు నాద శక్తి శాంతలనునవి ప్రణవభేదములు. హకార రేఫ - ఈకార బిందునాదశక్తి శాంతలనునవి హ్రీంకారభేదములు. ఇదియునుగాక సప్తగుణితమైనపుడు సప్తలోకములు, సప్తసింధువులు, సప్తద్రహములు, సప్తస్వరములు సప్తద్వీపములు, సప్తధాతువులు, సప్తర్షులు మొదలగునవి అగును; ఈ శక్తి అష్టాక్షరమగునపుడు అష్టదిశలు, అష్టప్రకృతులు (అనంత వాసుకి తక్షక కర్కోటక పద్మ మహాపద్మ శంఖపాల గుళికలు), అష్టవసువులు (ధర ధ్రువ సోమప అగ్ని వాయు ప్రత్యూష మొదలగునవి), బ్రహ్మాణీ మొదలగు అష్టమాతలు, అష్టమూర్తులు (శర్వ భవ రుద్ర ఉగ్ర భీమ ఈశాన మహాదేవ పశుపతులు) అగును, దశగుణితమగునపుడు దశనాడులు (సుషుమ్న మొదలైనవి), దశమర్మములు (హృదయ గుహ్య వదన ఉదర నేత్ర కంఠ భ్రూమధ్యాదులు) మొదలగునవి అగును; ద్వాదశగుణితమగునపుడు ద్వాదశవర్ణ మంత్రముగ, స్వరములయొక్క రూపమున నుండును; పంచాశద్ (50) గుణితమగునపుడు సుషుమ్నాద్వారనాదముతో సంగతమై పంచాశద్వర్ణ (50) సమమ్నాయ మగును.

# వర్ణములు

వర్ణములు అగ్నీషోమాత్మకములు. చంద్రాగ్నుల కలయికవలన సూర్యుడు కలిగెనని మంత్రశాస్త్రము; కావున వర్ణములలో కొన్ని సౌరాత్మకములు; 16 స్వరములు (అచ్చులు) సోమాత్మకములు; స్పర్శములు (యరలవశషసహళక్ష అను వ్యాపకనామములను విడువగ మిగిలిన 25 హల్లులు) సౌరాత్మకములు. స్వరములు

హ్రస్వదీర్ఘ భేదములను కలిగియున్నవి; బిందువు విసర్గము అంతమున నున్నపుడు ప్పుడు హ్రస్వములు దీర్ఘములగును. అ ఇ ఉ ం అనునవి పుంలింగాక్షరములు; ఆ ఈ ఊ ః అనునవి స్త్రీ లింగాక్షరములు; ఋ ౠ ఌ అనునవి నపుంసకాక్షర ములు. ప్రాణము సుషుమ్నయందున్నప్పుడు నపుంసకాక్షరములవలన అయనల స్థితి కలుగును. ప్రాణము దక్షిణనాసిక నున్నప్పుడు దక్షిణాయనము, ఉత్తరనాసిక నున్నపుడు ఉత్తరాయణము కలుగును; అనగ శ్వాసోచ్ఛ్వాసలు అహోరాత్రాత్మక ములు, పక్షాత్మకములు, అయనాత్మకములు. ప్రాణము దక్షిణనాసిక నున్నపుడు పంచహ్రస్వ స్వరములు కలుగును. ఉత్తరనాసిక నున్నపుడు పంచదీర్ఘస్వరములు కలుగును; బిందువు సూర్యుడు; విసర్గ చంద్రుడు. స్వరములు సుషుప్తిని, స్పర్శలు జాగ్రతను, అంతస్థలు స్వప్నమును, ఊష్మలు తురీయమును. క్షకారము తురీయా తీతమును తెలియజేయునని మాతృకాచక్రవివేకము. సౌరాత్మకములగు స్పర్శములు పంచవర్గములుగ (కవర్గ చవర్గ ఇత్యాదులుగ) నున్నవి. వీనిలో చివరదగు మకారము ఆత్మయు రవియు అగును; మిగిలిన 24 అక్షరములు చతుర్వింశతి తత్త్వాత్మకములు వ్యాపకాక్షరములలో యరలవళ అనునవి ఒకవర్గగాను షహళసక్ష అనునవి ఒక వర్గ గాను ఉన్నవి; ఇవి ఆగ్నేయములు. ఇవి స్వరములను స్పర్శములను వ్యాపించి యుండుటచే చంద్రసూర్యాత్మకములు; వీనినుండి 38 కళలు ఉద్భవించినవి. స్వరమునుండి 16 సౌమ్యకళలు (అమృత, మానద మొదలగునవి). 24 స్పర్శముల నుండి 12 సౌరకలు (తపిని, తాపిని మొదలగునవి). 10 వ్యాపకములనుండి 10 ఆగ్నేయకళలు (ధూమ్ర, అర్చిస్సు మొదలగునవి) కలిగినవి, తారము (ఓంకారము) యొక్క వర్ణముల నుండి పంచభూతభేదమున 50 కళలు ఉత్పన్నమైనవి; వీని నుండి 50 శక్తులు, మూర్తులు, మాతృకలు, ఓషధులు కలిగినవి. వర్ణముల నుండియే చందన, అగురు, కర్పూర ఉశీరాది-ఓషధులు కలిగినవి.

వర్ణములు సుషుమ్నాద్వారమున నిర్గతములై వాయుప్రేరితములై కంఠ తాల్వాది స్థానములందు ఘట్టితములై ముఖద్వారమున, హ్రస్వదీర్ఘప్లుతములను

మాత్రాభేదములను కలిగి వెడలును వాయువు పైకి ప్రసరించినపుడు ఉదాత్తము, క్రిందనున్నప్పుడు అనుదాత్తము, మధ్యనున్నప్పుడు స్వరితము అని స్వరభేదము లున్నవి. ఏ ఓ ఐ ఔ అనునవి రెండు అక్షరముల కలియకవలన కలిగినవి కావున అవి సంధ్యక్షరములు; ఇవి ప్రకృతి పురుష సూచకములగు మంత్రములు ; స్వరార్థ సాధకములు. ఋ వర్ణ ఋ వర్ణములు లకారరేఫలందు బాగుగ వ్యక్తములగును. ఇట్లు విస్తరంగమున తత్త్వసంజ్ఞయు కల ప్రకృతినుండి శబ్దబ్రహ్మము, అందుండి 16 స్వరములు స్వరసంయుక్తములగు కాది వర్గలు 25 అక్షరములు, పంచభూతాత్మకములు తన్మాత్రాత్మకములు నగు 'య' మొదలగు అక్షరములను గలిగెను. చివరకు విశ్వమంతటను వ్యాపించి ప్రకృతి 'హ' సంజ్ఞ నొందెను. అనగ మొదటి అక్షర మగు అకారముతోడను చివర అక్షరమగు హకారము తోడను అక్షరములు అహంరూపము నొందినవి.

# హ్రీంకారము

హకార ఈకార రేఫ బీజములు హ్రీంకారమునందు కలవు. హ్రీంకారము శక్తివాచకము. హృల్లేఖను (హ్రీంకారమును) నాదమని, ప్రాణమని, జీవమని ఘోషయని అందురు. హ్రీంకారమే షడధ్వ విష్టమై జీవులందు వ్యవస్థితమై యున్నది. అధ్వలు, వాచ్యవాచక భేదమున రెండువిధములుగ నున్నవి. వాచకము వర్ణ పద మంత్ర భేదములను కలిగియున్నవి. హం, హిం, హుం ఇత్యాదులు వర్ణములు; ఓం నమః శివాయ, హ్రీం నమః శివాయై అనునవి పదములు; సద్యోజాతాయ-అనునట్టివి మంత్రములు. వాచ్యము, తత్త్వభువనకళలు—అను భేదములను కలిగియున్నది. పృథివ్యాదులు తత్త్వములు; బ్రహ్మలోకాదులు భువనములు; బ్రహ్మాదిమూర్తులు కళలు; వీని నన్నిటిని వ్యాపించి హ్రీంకార మున్నది. ఇందలి రేఫము పుంలింగవాచకము, ఈకారము స్త్రీలింగ వాచకము, బీజము (హకారము) నపుంసకలింగము. సమష్టిన హ్రీంకారము అలింగము. బీజమగు హకారమునుండి ఇతరాక్షర సంయోగమున బ్రహ్మ విష్ణు రుద్రాదులు కలిగిరి.

XXIX

## ఓంకారము

హంకారము పురుషుడు, 'సః' అనునది ప్రకృతి (స్త్రీ). ఈరెంటి కలయికయే అజపా మంత్రము. బిందువు హకారము, అది దక్షిణభాగమనబడును, సకారము వామభాగమనబడును. దక్షిణభాగము పురుషాత్మకము, వామభాగము స్త్ర్యాత్మకము. శివప్రధానమైనది దక్షిణాచారము (సమయాచారము); శక్తి ప్రధానమైనది వామాచారము (కౌళాచారము) వైదికులకు కౌళాచారము నిషిద్ధము హంస మంత్రము పురుషప్రకృత్యాత్మకము, అనగ అర్ధనారీశ్వర దైవత్యము. జగత్తు హంసాత్మకము. ప్రకృతికి తన పురుషరూపము జ్ఞాతమైనపుడు సోఽహంభావము కలిగినది. సోహం అను పదమునందలి సకార హకారములను లోపింపజేసినపుడు ఓం అను అక్షరము మిగులును. ఓంకారమందలి అంతిమాంశమగు మకారమునుండి ఆకాశాదిభూతములు కలిగినవి; మధ్యమాంశమగు ఉకారమునుండి సూర్యుడు మొదలైన తేజోరాసులు కలిగినవి; పూర్వభాగమగు అకారమునుండి సమస్త శబ్దములు కలిగినవి. స్వరములకు సూర్యుడు అధిపతి; కవర్గకు లోహితుడు, చవర్గకు కావ్యుడు. టవర్గకు బుధుడు, తవర్గకు సురగురువు, పవర్గకు శనైశ్చరుడు, యవర్గకు శీతాంశువు అధిపతులు. అక్షరములనుండియే ద్వాదశరాశులు నక్షత్రములు దినతిథ్యాదులు కలిగినవి. కకార షకారముల సంయోగమున క్షకారము కలిగినది, క్షకారము నృసింహ దైవత్యము.

## చక్రములు

వెన్నెముకకు క్రిందుగ మూలాధార చక్రమున్నది. ఇందు నాలుగు పత్రములు కలవు. అవి వ శ ష స అను అక్షరములు కలిగియున్నవి. ఇందు డాకినీ శక్తి కలదు; ఈ చక్రము పృథివీమండలమునకు చెందినది. మూలాధారమునకు పైన స్వాధిష్ఠానమున్నది. ఇందు ఆరుదళములున్నవి. వానిలో బ భ మ య ర ల అను అక్షరములున్నవి. ఈ చక్రమునందు రాకిణీశక్తి కలదు ఇది జలమండలము. నాభిప్రదేశమున దశదళయుక్తమగు మణిపూరచక్ర మున్నది. ఇందు డ ఢ ణ త థ

ద ధ న స ఫ అను అక్షరములున్నవి. ఇది అగ్నిమండలము. ఇందు లాకినీశక్తి కలదు. హృదయప్రదేశమున అనాహతచక్రమున్నది. దీనియొక్క ద్వాదశదళము లందు క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ అను 12 అక్షరములు కలవు. ఇది వాయుమండలము. ఇందు కాకినీశక్తి యున్నది. కంఠమూలమున విశుద్ధచక్రము కలదు. దీనియొక్క షోడశదళములందు షోడశస్వరములుండును. ఇది ఆకాశమండలము. ఇందు సాకినీశక్తి కలదు. భ్రూమధ్యమందు ఆజ్ఞాచక్రము కలదు. ఈ పద్మమందలి రెండుదళములందు హ క్ష అను రెండు అక్షరములున్నవి. ఈ చక్రము మనస్సుయొక్క స్థానమని చెప్పుదురు. ఇందలి శక్తికి హాకినీ అని పేరు. ఇవి షట్చక్రములు. ఏకాగ్రమనస్సును ఆయా చక్రములందు అనుసంధాన మొనర్చినవారికి ఆయాచక్రములందలి తత్త్వములు (అనగ పృథివీతత్త్వము, జలతత్త్వము మొదలైనవి) వశ్యములగును. హృదయమందు దీపకళికాకారము నన్నున్న జీవాత్మను హంసమంత్రముతో మూలాధారమునకు తీసికొనివచ్చి అక్కడనుండి లయక్రమమున కుండలిని జీవాత్మతోకూడ సహస్రారమునకు తీసికొని పోవలెనని షట్చక్ర నిరూపణమునందు కలదు. భ్రూమధ్యమునుండి సహస్రారము వరకును 9 చక్రములు కలవు. అవి (1) చంద్రమండలము (2) అర్ధచంద్రాకారము (3) రోధిని (4) నాదము (5) నాదాంతము (6) శక్తి (7) వ్యాపిక (8) సమనా 9) ఉన్మనా. వీనికి సమష్టిననా నాదము అను పేరుకలదు. బ్రహ్మరంధ్రమునకు క్రిందుగనున్న సహస్ర కమలాంతర్గత చంద్రమండలము సర్వకారణబిందువు; అదియే శివస్వరూపము, తేజోమయము, పరమాత్మ. ఈ విధముగ శరీరము ఊర్ధ్వమూలమును, అధశ్శాఖలను కలిగియున్నది. శరీరమునందున్నట్లే బ్రహ్మాండమునందుకూడ నున్నది.

## ఉపసంహారము

పైన చెప్పినట్లు అక్షరములు సర్వసృష్టిని వ్యాపించియున్నవి. అక్షరములచే మంత్రములు సర్వవ్యాపకములగు అక్షరములను కలిగియున్న మంత్రములకు శక్తి కలదని వేరుగ చెప్పవలెనా ? ఉపనిషత్తులందు అనేకములగు మంత్రములు చెప్ప

బడినవి ఇవి అన్నియు వైదికమంత్రములు -ఔపనిషదులకు వేదాంతశాస్త్ర మెంత శిరోధార్యమో మంత్రశాస్త్రము కూడ అంత శిరోధార్యము. వేదాంతశాస్త్రముచే చెప్ప బడిన అనుభవమును సంపాదించుటకు మంత్రాభ్యాస మావశ్యకము. పంచదశీ మంత్రమునకు సంబంధించిన వ్యాసప్రోక్తము గు త్రిశతికి భాష్యమును వ్రాసిన శంక రుని గురించి లోకమునకు చెప్పవలసిన పనిలేదు. ఈ గ్రంథము బ్రహ్మవిద్యకు సంబంధించినది. బ్రహ్మవిద్యను గుప్తముగ నుంచవలెను దర్మజూడను ఋషి ఇంద్రునివలన బ్రహ్మ విద్యను గ్రహించెను. కాని ఆవిద్యను ఎవరికైన ఉపదేశిం చిన ఋషిశిరము నపహరింతునని ఇం దుడు చెప్పెను. అశ్విన్యాది దేవతలు తమకు బ్రహ్మవిద్యను చెప్పవలయునని ఆ ఋషిని కోరిరి. కాని వజ్రహస్తుడగు ఇంద్రుని భయముచే చెప్పుటకు ఋషి వెనుకాడెను. అపుడు వైద్యులగు అశ్వినీదేవతలు ముందుగ ఋషిశిరమును ఖండించి ఆస్థానమున ఒక అశ్వశిరమును అతికించిరి. అశ్వశిరముతో ఆతడుపదేశింప మొదలిడెను; ఇంతలో ఇంద్రుడువచ్చి ఆ శిరమును హరించెను. పిమ్మట అశ్వినీదేవతలు ఋషి యొక్క నిజశిరమును తెచ్చి ఋషి కంఠముపై అతికించి సమగ్రముగ బ్రహ్మవిద్య నుపదేశమొందిరి. ఉపనిషత్తులలో అడుగడుగునకు 'మూర్ధా తే నిపతిష్యతి' అని బెదురుపెట్టుచునే యుందురు. అట్టి గుప్తమగు బ్రహ్మవిద్యను గురించి అంతర్ముఖులగు సాధకులకే తెలియును, వారే వ్రాయవలెను. కాని సాధకులు వ్రాసిన గుప్తమనునది వెల్లడి అగును; నా వంటి వారు వ్రాసిన అట్టిది జరుగదు; కావున పైన చెప్పిన విభీషి కావాక్యములు నావంటి వానియందు ప్రవర్తింపవు. భాష్యత్రయమును వ్రాసిన తరువాత శంకరులు ఈభాష్య మును వ్రాసినట్లు కనబడుచున్నది. (పుట 67) పరమగంభీరమును సర్వశాస్త్ర సమ న్వయపరమగు ఈ భాష్యమును నేను అనువదించుట సాహసము; కాని తెలుగులో ఇదివరలో ఎవరు వ్రాయనందున నన్ను నామిత్రమగు పాటిబండ సుందరరావుగారు వ్రాయమని ప్రోత్సహించినందున నేను వ్రాయవలసి వచ్చినది. శృంగేరీ పీఠాధి పతుల పర్యవేక్షణమున ముద్రితమగు శ్రీరంగమువారి ప్రతి ననుసరించి నేను అను వదించితిని. శ్రీవిద్యాదీపికను బొంబాయివారి ప్రతి ననుసరించి అనువదించితిని.

## XXXII

మంత్రాన్ వైదికతాంత్రికాన్ బహుగుణా నైశ్వర్యసంపాదకాన్
సర్వానప్యుపదిశ్య తేషు బహుమేనే ద్వైతవిధ్వంసకాన్
సంసారాబ్ధితమోనివర్తనపటూ నధ్యాస మాభాష్య యః
తస్మై శంకరమార్గదర్శక మహాదీపాయ భూమ్నే నమః

—o–o–o—

# శ్రీ విద్యా దీపిక

సకలవిద్యానిధియు, బహువిధశాఖామయ ఋగ్యజుస్సామవేదమూర్తియు, అపరిచ్ఛిన్న చిచ్ఛక్తి కలాసమావేశ తరంగిత హృదయుడును, హయగ్రీవరూపుడు నగు మహావిష్ణువు పరమసచ్చిదానంద ఘన చిచ్ఛక్తి స్వరూపమును తెలియగోరి అడిగినట్టి సర్వజ్ఞాన తపోనిధియగు అగస్త్య మహామునికి శ్రీవిద్య నుపదేశించెను. ఇట్లు శ్రీవిద్య నుపదేశించుటకు కారణమేమనగ :- అనేకవిధశాఖామయములైన ఋగ్యజుస్సామములయొక్కయు అనేకవిధములగు ఉపనిషత్తుల యొక్కయు రహస్యార్థము దురవగాహముగ నున్నది; ఆయర్థములు బోధపడకున్న పరమార్థము ప్రకాశింపదు; అదియునుగాక ఒక్కొక్క మంత్రమునందు ఒక్కొక్క పురుషార్థమే చెప్పబడియున్నది. ఆగమము లనేకవిధములుగ నున్నవి. అందుచే చర్యాక్రియా జ్ఞానయోగములు దురవగాహముగ నున్నవి; ఇవి తెలిసినగాని పరతత్త్వము తెలియదు కావున సకలశ్రుతి స్మృతి పురాణసారభూతమును, సకలాగమోక్త చర్యాక్రియా జ్ఞానయోగ సారభూతమును 'గన్ధద్వారామ్', 'అన న్నామ న్నాదధి', 'చత్వారి వాక్పరిమితా పదాని', చిత్రావసో' ఇత్యాది సూక్తోపనిషన్మంత్రములచే యజుశ్శాఖలచే అత్యంతగూఢముగ ప్రబోధింపబడినదియు 'అపాం రుద్రేభిః' 'పవమాన స్సువర్జనః' ఇత్యాది సూక్తశస్త్ర మంత్రోపనిషత్తులచే ఋక్ శాఖలచే అతిగూఢముగ ప్రకాశితమైనదియు, 'శ్రీర్నిధన హరి శ్రీర్నిధనాభిః' ఇత్యాది సామములచే యజ్ఞాయజ్ఞియ' శ్రాయంతీయ్య బృహద్రథంతర వామదేవ్య ప్రతర్థపురుషవృత జ్యేష్ఠసామాది స్తోభనీయాది విశేషణములచే అత్యంత రహస్యముగ ప్రకాశింపబడినదియు, సకలవేదధారణమైనదియు, సకలవేద మంత్ర బ్రాహ్మణోపనిషత్సారభూతమైనదియు, సచ్చిదానందపరబ్రహ్మ పరప్రకాశమును సాక్షాత్కరింపజేయునట్టిదియు, బ్రహ్మశ్రీ విద్యయు, పంచదశవర్ణములలో ప్రతివర్ణమందును తత్త్వరహస్యార్థమును ప్రకాశింపజేయునట్టిదియు, సకలపురుషార్థసాధనమగుటచే అభిమత సకలపురు

షార్థములను ప్రత్యక్షముగ ప్రకాశింపచేయునట్టిదియు న.ు శ్రీవిద్యను హయగ్రీవుడు అగస్త్యున కుపదేశించెను.

## ప్రథమఖండము-వాగ్భవఖండము (క ఏ ఈ లహ్రీం)

క కనదీప్తౌ అను ధాతువునుండి మంత్రమందలి ప్రథమవర్ణము కలిగినది దీప్తి అనగ ప్రకాశము దీనిని శబ్దార్థజాలము ప్రకాశించుచున్నది, లేక ప్రకాశింప బడుచున్నది. అను అర్థమున 'క' శబ్దము - కన్ ఉణాదిక్విబంతము అవ్యయత్వము, నలోపము. ప్రకృతిభావము - కావున - క అని మంత్రమందలి వాగ్భవఖండము లోని ప్రథమాక్షరము సిద్ధమైనది.

ఏ ఇక్ స్మరణే అను ధాతువునుండి గాని ఇఙ్ అధ్యయనే అనుధాతువు నుండిగాని ఔణాదిక విచ్ ప్రయత్నము వలన ఏ అను మంత్రప్రథమఖండమందలి ద్వితీయాక్షరము కలిగినది. దీనిచేత సర్వవేదశాస్త్రాది కళలు స్మరింపబడుచున్నవని గాని, అధ్యయన మొనరింపబడుచున్నవని గాని అని అర్థము. క + ఏ అనగ మరల మరల ప్రకాశమొందుచున్న బుద్ధి అని అర్థము.

ఈ 'ఈ' వ్యాప్తౌ అను ధాతువునుండి ఈ శబ్ద ముత్పన్నమైనది. ఇది క్విబంతము,. ప్రకృతి భావమొందినది. మరలమరల ప్రకాశమొందుచున్న బుద్ధి యొక్క వ్యాప్తి అని అర్థము.

ల. హ్రీ లహరీ అనునది లహ్రీ అని పరోక్షముగ చెప్పబడినది. 'పరోక్ష ప్రియా హి దేవాః (బృ. హ. ఉ. 4.4.2) దేవతలు పరోక్షప్రియులు కావున లహరీకి లహ్రీ అని చెప్పబడినది. పునఃపునః ప్రకాశమానమగు బుద్ధివ్యాప్తి యొక్క లహరి (ఆధిక్యము) అని అర్థము.

మ్ మాజ్ మానే శబ్దేచ అను ధాతువునుండి క్విబంతముగ 'మ్' అను శబ్దము ఉత్పన్నమైనది. స్వయముగ అపనోధనము చేయునది అని అర్థము. క ఏ ఈ ల హ్రీం అను ఖండముచే ధర్మమును పురుషార్థముయొక్క సాధనముచే కలిగిన బ్రహ్మవర్చస్సు వలన సమ్యక్ బుద్ధి కలుగుట చెప్పబడినది; వాక్ ప్రవృత్తి నిమిత్తమగుటచే ఈఖండమును వాగ్భవ ఖండమందురు. దీనిచే బ్రాహ్మణవర్ణముచే ఉపాసింపబడు గాయత్రీమంత్రముయొక్క సారము చెప్పబడినది. ఇష్టదేవతా ప్రకాశనాత్మకత్వమున ఈఖండము ఋగ్వేదదేవతాత్మకము.

## రెండవఖండము-కామరాజఖండము-హసకహలహ్రీం

హ హన్‌హింసాగత్యోః 'అను ధాతువునుండి హా' శబ్దము నిష్పన్నమైనది; ఔణాదిక క్విబంతము; ఐహికాముష్మిక తాపత్రయావళిని పోగొట్టును అని అర్థము. ఇట్లు శత్రురోగాదిరూపమగు ఐహికబాధా నివృత్తియు, దుష్కృతిజన్య-ఆముష్మిక బాధానివృత్తియు చెప్పబడినది.

స సీయంతే అనగ దీనిచేత సకల ధన కనక వాహన భూమ్యాది సంపత్తులు అనుభవింపబడును కావున 'స' అను శబ్దము, లేక 'స్యతి' 'సనోతి' అను ధాతురూపములనుండి 'స' శబ్దము కలిగినదని చెప్పవచ్చును. ఈ ధాతువులు అవసాదనార్థకములు.

క 'కము' కాంతౌ—అని ధాతువు. దీనిచేత స్రక్చందన వనితాది మదన విషయ భోగములు కామింపబడుచున్నవను అర్థమున 'క' అను శబ్దము నిష్పన్నమైనది. పూర్వఖండమందువలెనే ఈ వర్ణముచే ఐహికాముష్మిక సకలవిషయ భోగము చెప్పబడినది. హ + స + క=హసక.

5) Farm

హ్రా హీయతే - అనగ పొందబడును (హాజ్ ధాతువు) అను అర్థమున కప్రత్యయముచే హ అను శబ్దము కలిగినది. హసక, ల యొక్క హ-హసకహ- అనగ ఉపద్రవ నివృత్తి పూర్వకమైన కామభోగావ్యాప్తి అని అర్థము

లహ్రీం పైన చెప్పిన కామ భోగావ్యాప్తియొక్క లహరి-ఆధిక్యము 'హ్రీ' అను పదములో 'ఈ' అను శబ్దముకూడ నున్నది. ఇది 'ఈ' అను ధాతువు నుండి కలిగినది హ్రీ + ఈ=హ్రీ సవర్ణ దీర్ఘముచే హ్రీ అయినది హసకహల యొక్క నిర్మాణము - హసకహలహ్రీం' అయినది. ఈ ఖండముచే అర్థ కామ పురుషార్థ నిర్మాణము క్షత్రియ వర్ణముచే ఉపాసింపబడు త్రిష్టుప్ఛందస్సాత్వము చెప్పబడినది. అభీష్టములైనవానిని సాధించు కర్మాదులను చెప్పునట్టిది యజుర్వేదము అందుచే ఈ ఖండము యజుర్వేదాత్మకము.

## తృతీయఖండము-శక్తిఖండము-సకల హ్రీం

సకల=కళలచే అనగ అవయవములచే అనగ శివాది తత్త్వములచే సహిత మైనది సకల; లేక చతుష్షష్టి కళలు కలిగినది కావున సకల; లేక, బాగుగ కల యించును గాన సకల. హృఞ్ హరణే అను ధాతువునకు 'ఇ' ప్రత్యయముచే 'హ్రీః' అను శబ్దము - సర్వమంత్రకళలను (జగత్తును) హరించునట్టిది 'హ్రీః' అనగ సంహారశక్తి. ఈయతే అనగ జగమును ప్రకాశింపచేయునట్టిది కావున 'ఈః' అనుశబ్దము, అనగ సృష్టి శక్తి. 'ఇది పరమైశ్వర్యే' అను ధాతువునుండి 'ఈః' శబ్దము నిష్పన్నమైనది. సర్వనియంతృత్వము కలది ఈః. హ్రీః + ఈః=హ్రీః - అనగ సంహృతి సృష్టి శక్తి. లేక, సర్వప్రపంచరూపమున విహరించునట్టిది కావున హ్రీః ఇది విపూర్వక హృ ధాతువునుండి నిష్పన్నమైనది; పరమనియంతృత్వమున వర్తించునట్టిది హ్రీః; లేక 'హ్రీ' అను క్విబంత శబ్దము సకారములేకుండ ఒకటే

ఉన్నది; ఇది ప్రపంచ సంహృతి వాచకము. 'ఈ' అనగ ప్రకాశము, అనగ ఆత్మైక్యగమనము; ఇది 'హ్రీ' యొక్క సకలప్రపంచ దేహేంద్రియాదికములను ద్రవీకరించి అనిర్వచనీయమగు ప్రకాశరూపాత్మైక్యమును కలుగజేయును. 'తస్యాంతే సుషిరం సూక్ష్మం' అని మొదలిడి 'తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః' అను నారాయణోపనిషత్తునందు చెప్పబడిన ప్రకారము హృదయపుండరీక మధ్య సుషి రాంతరమగు దహరాకాశమందున్న మహాకాశాంతర్గతమైన సూక్ష్మతి ప్రకాశాత్మస్థానమపైనున్న దీపశిఖ అని అర్థము. సకలా + హ్రీ=సకలహ్రీ ఇషు ఇచ్ఛాయామ్ అను దాతువునుండి 'ఈ' శబ్దము కలిగినది. విరించి విష్ణువు మొదలుకొని స్తంబ పర్యంతము అభీష్టమైనదిగ చేతనవర్గముచే కోరబడునది కావున 'ఈ', దీనిచే నిరతిశయానంద సత్యానంద నైరంతర్యము చెప్పబడునది. 'ఈ' హిమవతో పాదేషూత్తలేషు' అని శ్రుతి దానియొక్క ప్రమితగ అకారలుప్తమగు మకారము గ్రహింపబడుచున్నది; లేక, మితి అను రూపముగల ధాతువునుండి 'మినోతి' అను రూపముల ధాతువునుండి 'మ్' శబ్దము; 'ఇదం సర్వమవీత్విశ్వ (?) భవతి' అను శ్రుతివలన 'మ్' అనునది నాదానుకార శబ్దము-అవ్యయము ప్రమితి అనగ యథార్థానుభవము. ఈశబ్దముచే పరబ్రహ్మముయొక్క చిచ్ఛక్తి చెప్పబడుచున్నది; నాదము శుద్ధచైతన్య స్థూలరూపము చిచ్ఛక్తి శుద్ధచైతన్యాత్మకమును ఉన్మనీనాదాదులకంటె అతీతమగుటవలనను అవాఙ్మానసగోచరము (మి) మినోతి' అను రూపముకల ధాతువునుండి 'మ్' శబ్దము; నాదార్థకము. సర్వాత్మయందు తాదాత్మ్యమున 'ఈ' అనగ నిరతిశయానందానుభవప్రకాశనాదాత్మక చిచ్ఛక్తి అని అర్థము; ఇదమ సర్వ ప్రపంచములు అను మితములగుచున్నవి, సృజింపబడుచున్నవి ఇది ఋగనుష్టుప్ఛందము. సకల హ్రీరూపమగు హ్రీం-సకలహ్రీం; లేక, హ్రీ + ఈ=హ్రీం అని చెప్పవచ్చును; అనగ సకలహృదాకాశములందు దీపశిఖవలె అంతర్గతమైయున్నట్టిదియు, సర్వతత్త్వాధిష్ఠానములగు నిరతిశయ సత్యానందముల యొక్క అనుభవమును ప్రకాశిపజేయునట్టిదియు నాదాత్మికము నగు చిచ్ఛక్తి అని అర్థము ఈఖండముచే మోక్షసాధనమగు నాదలయయోగానందానుభవము చెప్పబడినది; కావున దీనిని శక్తిఖండమందురు; ఇది చిత్తవృత్తి నిరోధము ప్రధానముకలది. వైశ్యజాతిచే

ఉపాసింపబడు జగతీచ్ఛందస్సారము దీనిచే చెప్పబడుచున్నది సామవేదము గాన ప్రధానమగుటచే, నాదమునందు చిత్తము విలీనమగుట ఈ ఖండమునందు చెప్ప బడుటచేతను, నాదలయోగము చెప్పబడుటచేతను ఈఖండము సామవేదాత్మకము.

సకలమును (పైరెండు ఖండములను) ఈ ఖండము కలయించును— సంబంధిలపజేయును గాన-సకలహ్రీం.

అనిష్ట నివారకమును, భోగభాగ్యాది వృద్ధికరమును. కీర్తిజాలజనకమును, దహరాకాశాంతర్గత దీపశిఖ అయినదియును, సర్వతత్త్వాధిష్ఠానమైనదియును, నిరతిశయానందసంవిదనుభవ ప్రకాశకమును నాదాత్మిరమునగు చిచ్ఛక్తి ఈపంచదశీ మంత్రముచే చెప్పబడినని సామవేదమందలి హంకారమను స్తోభాక్షర ప్రాచుర్యమున, నిధనస్తోభ ప్రధానత్వమున ఈమంత్రము సామవేదాత్మకము. 'సామవేదో బ్రాహ్మణానాం ప్రసూతిః' అను శ్రుతి ననుసరించి ఈ మంత్రము బ్రాహ్మలచేతనే అవశ్యము పఠింపదగినది. కాని పురాణములు, ఆగమములు అంగీకరించినందున ఈ మంత్రము ఇతరవర్ణములవారిచేకూడ ఉపాస్యమగుచున్నది. కావున చాతుర్వర్ణ్యము న నమంత్రము సాధారణముగ ఉపాస్యము, తదితరులకు కాదు. ఈ మంత్రమును దాని అర్థమును మనన మొనరించిన వారికి సర్వాతిశయాభీష్టసంపద కలుగును. ఈ మంత్రమందలి తత్త్వమే 'గంధద్వారాం' చిత్రావసో, అవస్తి ఇత్యాది మంత్రములచే స్తుతింపబడినది. ఈమంత్రము వేదమయమగుటవలన బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులవలననే ఉపాస్యమగుచున్నది 'త్రీణి పదాని హితాగుహాసు యస్తద్వేద సవితః పితాసత్' అను శ్రుతిచే వేదోచ్చారణమందు మూలాధార హృదయమూర్ధములు మూడుపదములుగ, స్థానములుగ నున్నవి; బిగ్గరగ వేదము నుచ్చరించునపుడీ స్థానములందు ఉచ్చారణ కనబడుచున్నది; అట్లే ఈమంత్రమందలి మూడుఖండములు ఈమూడు స్థానములను పొందియున్నవి 1 మాలిని-అంతర్వర్తి యగుటచేగాని హృల్లేఖాసహితమగుటచేగాని ఈఖండమునకు ఉష్ణిక్త్వము, స్వతంత్రతచే చెప్పబడినందున అతిచ్ఛందస్త్వము చెప్పబడినది. తత్రైః వర్ణం మయానో అన్నమాత్తి, యదిమంశృణోతి యేవిపశ్యంతి, య్య ప్రాణితి, యదిమం శృణోతి,

యం కామయేత తముగ్రం కృణోమి, తంబ్రహ్మాణం కమృషిం, తం సుమేధాం—
అని శ్రుతులు.

ఈమంత్రము పంచదశవర్ణాత్మకము; 'ఆపంచదశ' అను కాండానుక్రమణీయవచనముచే ఈమంత్రమునకు గాయత్రీమయత్వము; స్వతంత్రత్వమున ఉపాసింపబడునట్టి బిందునాద వర్ణద్వయాత్మక మాలినీ బీజాత్మక మంత్రమిందు కలదు కావున, ద్వ్యక్షరాదౌ ఉష్ణిక్' అను వచనముచే ఈమంత్రమునకు ఉష్ణిక్ ఛందోమయత్వము ఈమంత్రమున కింకను అనేక కారణములచే అతిచ్ఛందస్త్వము, జగతీచ్ఛందోమయత్వము పఙ్క్తిచ్ఛందోమయత్వము. బృహతీచ్ఛందోమయత్వము చెప్పబడినది; కావున ఇది సర్వచ్ఛందోమయము; మంత్ర బ్రాహ్మణోపనిషద్రూపమగు ఖండత్రయాత్మకము. ఈవిద్యయే ఉత్తరనారాయణానువాకమునందు సకల ప్రపంచ సారాత్మికముగను బ్రహ్మతేజోభివృద్ధిమయముగను స్తుతింపబడినది. ఈ విద్యయే సర్వవేదములందు, సర్వలోకపాల సమిష్టిరూపమున, సర్వాత్మక చైతన్య రూపమున గూఢముగ చెప్పబడినవి. కావున ఈ మంత్రము శైవ వైష్ణవ గాణాపత్య సౌరమంత్రములందు సంయోజింపబడి ఉపాసింపబడుచున్నది. ఈవిద్య సకల పురుషార్థప్రాప్తి రూపమగు ఆత్మజ్ఞాన సాధనము; జీవబ్రహ్మ సమరసీ భావరూప మోక్ష సాధనము. ఈ మంత్రరాజమును హయగ్రీవుని వలన అగస్త్యుడు పొంది కలాతత్త్వోద్భాసినియు, అపరిమిత భాగ్యోదయకరమునగు ఈటీకను వేదత్రయీసారము నుండి ఉద్ధరించి లోకోపకారమునకై వ్రాసెను.

---

(1) ఆధారహృదయ భ్రూమధ్యములందు మంత్రమందలి ఖండత్రయమును విన్యసించి బ్రహ్మరంధ్రమునందు తురీయఖండమును అనగ శ్రీబీజమును విన్యసింపవలెనని ప్రపంచసార సంగ్రహము.

## XXXX

ఓం-ఇతి శ్రీ పరమశివాఽపరరూప శ్రీమదగస్త్య మహర్షి విరచితా
శ్రుతిసార సముద్ధృతా శ్రీ విద్యాదీపికా—సమాప్తా.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

సకుంకుమ విలేపనామళిక చుంబి పాశాంకుశామ్ ।
సమందహసితేక్షణాం సశరచాప పాశాంకుశామ్ ।
అశేషజన మోహినీ మరుణ మాల్యంభూషాంబరామ్ ।
జపాకుసుమభాసురాం జపవిధౌ స్మరేదంబికామ్ ॥

మూలమంత్రము— క ఏ ఈ ల హ్రీం. హ స క హ ల హ్రీం. స క ల హ్రీం.

# ఇందలి సంకేతాక్షరముల వివరణము

| | | |
|---|---|---|
| ఉ | .... | ఉపనిషత్తు |
| ఈ | .... | ఈశావాస్యము |
| ఐ | .... | ఐతరేయము |
| కఠ | .... | కఠోపనిషత్తు |
| కేన | .... | కేనోపనిషత్తు |
| కౌ.ఉ. | .... | కౌషీతకీ - ఉపనిషత్తు |
| కౌ. బ్రా. | .... | కౌషతకీబ్రాహ్మణము |
| ఛా<br>ఛాం | .... | ఛాందోగ్యము |
| తై | .... | తైత్తిరీయము |
| నృ. ఉ. తా. | .... | నృసింహోత్తరతాపిని |
| నృ. తా.<br>నృసి. తా. | .... | నృసింహతాపిని |
| బృ.<br>బృ. దా. | .... | బృహదారణ్యకము |
| బ్ర. సూ. | .... | బ్రహసూత్రము |
| భ. గీ. | .... | భగవద్గీత |
| మాం | .... | మాండూక్యము |
| ము.<br>ముం. | .... | ముండకము |
| శ్వే | .... | శ్వేతాశ్వతరము |

శ్రీః

# లలితా త్రిశతీ భాష్యమ్

వందే విఘ్నేశ్వరం దేవం సర్వసిద్ధిప్రదాయినం
వామాంకారూఢవామాక్షీకరపల్లవపూజితమ్,
పాశాంకుశేక్షుసుమరాజితపంచశాఖాం
పాటల్యశాలిసుషమాంచితగాత్రవల్లీమ్ !!
ప్రాచీన వాక్ స్తుతపదాం పరదేవతాం త్వాం
పంచాయుధార్చితపదాం ప్రణమామి దేవీమ్ !
లోపాముద్రాపతిం నత్వా హయగ్రీవమపీశ్వరం
శ్రీవిద్యారాజసంసిద్ధికారిపంకజవీక్షణమ్ !!
విస్తారితాం బహువిధాం బహుభిః కృతాం చ
టీకాం విలోకయితు మక్షమతాం జనానామ్
తత్రత్యసర్వపదయోగవివేకభానుం
తుష్ట్యై కరోమి లలితాపదభక్తియోగాత్ !!

పార్వతీవామాంకమందారుఢుడై ఆమెకరపల్లవముచే పూజితుడైయున్న సర్వసిద్ధిప్రదుడగు విఘ్నేశ్వరునకు నమస్కారము. పాశాంకుశేక్షు సుమ విరాజితములగు హస్తములు కలిగి, పాటలవర్ణ కాంతితో విలసిల్లుచున్న గాత్రవల్లి కలిగి, వేదములచే స్తుతింపబడుచున్న పదములు కలిగి, మన్మథునిచే అర్చింప బడుచున్న పాదములు కలిగియున్న పరదేవతకు ప్రణమిల్లు చున్నాను. ఎవరి వీక్షణము వలన శ్రీవిద్యారాజసంసిద్ధి కలుగునో అట్టి ఈశ్వరుడగు హయగ్రీవుని లోపాముద్రా పతి యగు అగస్త్యుని నమస్కరించి ఈ టీక నొనరించు చున్నాను. ఇదివరలో అనేకులు టీకను వ్రాసిరి. కాని జనులు వానిని తెలిసికొన లేకున్నందుకు సర్వ

పదయోగ వివేక భానురూపమగు ఈ టీకను లలితాదేవీపదములందు భక్తికలిగి జనుల సంతోషముకొరకు వ్రాయుచున్నాను,

పైశ్లోకములు శ్రీశంకరభగవత్పాదులచే పీఠికారూపమున రచింపబడినవి.

అగస్త్యోవాచ :

1. హయగ్రీవ దయాసింధో భగవన్ శిష్యవత్సల
త్వత్తః శ్రుత మశేషేణ శ్రోతవ్యం యద్యదస్తి తత్
హయగ్రీవ : దయాసింధో, భగవన్, శిష్యవత్సల : నీవలన వినదగునదంతయు వింటిని.

2. రహస్యనామ సాహస్రమపి త్వత్తః శ్రుతం మయా
ఇతఃపరం మే నాస్త్యేవ శ్రోతవ్య మితి నిశ్చయః!!
రహస్యములగు లలితా సహస్రనామములను నీవలన వింటిని' ఇంక వినవలయునది లేదనియే నా నిశ్చయము.

3. తథాపి మమచిత్తస్య పర్యాప్తి ర్నైవ జాయతే
కార్త్స్న్యార్థః ప్రాప్య ఇత్యేవ శోచయిష్యామ్యహం ప్రభో!!
అయినను నా చిత్తమునకు తృప్తికలుగలేదు. సర్వార్థముల నొందియు ఇంకను శోకమొందుచున్నాను.

4. కిమిదం కారణం బ్రూహి జ్ఞాతవ్యాంశో స్తి వా పునః
అస్తిచే న్మమ తద్బ్రూహి బ్రూహీత్యుక్త్వా ప్రణమ్య తమ్.
ఏమి కారణము ? తెలియదగిన అంశము కలదా ? ఉన్నట్లయిన చెప్పవలెను. అని పలికి నమస్కరించెను.

సూత ఉవాచ :

5. సమాలలంబే తత్పాదయుగళం కలశోద్భవః
హయాననో భీతభీతః కిమిదం కిమిదం త్వితి.

ఇట్లు పలికి అగస్త్యుడు హయవదనుని పాదములు పట్టుకొనెను. హయాననుడు భీతినొంది ఏమిది, ఏమిది అనెను.

6. ముంచ ముంచేతి తం చోక్త్వా చింతాక్రాంతో బభూవ సః
చిరం విచార్య నిశ్చిన్వన్ వక్తవ్యం న మయేత్యసౌ.

పాదములను విడువుము అని పలికి, అత డాలోచించెను. కాని ఎంత విచారించినను చెప్పవలయున దేదియు వానికి కన్పింపలేదు.

7. తూష్ణీం స్థితః స్మరన్నాజ్ఞాం లలితాంబాకృతాం పురా
ప్రణమ్య విప్రం స ముని స్తత్పాదావత్యజన్ స్థితః.

లలితాంబ పూర్వమిచ్చిన ఆజ్ఞను స్మరించి హయవదనుడు ఊర కుండెను. అగస్త్యుడు హయవదనుని పాదములను వదలలేదు.

ఈ శ్లోకములు త్రిశతీనామములకు ఉపోద్ఘాతప్రాయములుగ బ్రహ్మాండపురాణోత్తర ఖండమందలి హయగ్రీవాగస్త్యసంవాదమం దున్నవి.

8. వర్షత్రయావధి తథా గురుశిష్యౌ తథా స్థితౌ
తచ్ఛృణ్వంతః పశ్యంతశ్చ సర్వే లోకాః సువిస్మితాః.

మూడు సంవత్సరములు ఈ విధముగ గురువుయొక్క పాద ములు పట్టుకొని శిష్యుడుండెను, ఈ విషయమును విని కనియున్న వారందరు విస్మయమందిరి.

9. తతః శ్రీలలితాదేవీ కామేశ్వర సమన్వితా
ప్రాదుర్భూయ హయగ్రీవం రహస్యేవ మచోదయత్.

పిమ్మట కామేశ్వర సమన్వితయై లలితాదేవి హయగ్రీవునికి కాన్పించి రహస్యముగ నిట్లనియెను-

శ్రీదేవ్యువాచ :

10. అశ్వాననావయోః ప్రీతిః శాస్త్ర విశ్వాసిని త్వయి
రాజ్యం దేయం శిరో దేయం న దేయా షోడశాక్షరీ.

అశ్వానన ! శాస్త్రమందు విశ్వాసముకల నీయందు మాకు ప్రీతి కలదు. రాజ్యమీయవచ్చును. శిరమీయవచ్చును. కాని, షోడశాక్షరి నీయరాదు.

11. స్వమాతృజారవద్గోప్యా విద్యైషేత్యాగమా జగుః
తతోఽతిగోపనీయా మే సర్వపూర్తికరీ స్తుతిః.

ఈ విద్యను స్వమాతృజారత్వము నెంత గోప్యముగ నుంచుదురో అంత గోప్యముగ నుంచవలెను, అంత కంటె గోప్యముగ సర్వపూర్తికరియగు ఈ స్తుతిని ఉంచవలెను.

12. మయా కామేశ్వరేణాఽపి కృతా సంగోపితా భృశమ్
మదాజ్ఞయా వచో దేవ్య శ్చక్రు ర్నామసహస్రకమ్.

ఈ స్తుతి నాచేతను కామేశ్వరుని చేతను చేయబడి గోప్యముగ నుంచబడినది. సహస్ర నామములను, నా ఆజ్ఞచే వాగ్దేవతలు చేసిరి.

13. ఆవాభ్యాం కథితా ముఖ్యా సర్వపూర్తికరీ స్తుతిః
సర్వక్రియాణాం వైకల్యపూర్తి ర్యజ్జపతో భవేత్.

సర్వసిద్ధికరమును ముఖ్యమునగు ఈ స్తుతి మాచే చెప్ప బడినది. దీనిని జపించిన సర్వక్రియలందలి లోపములు పూర్తిచెందును.

14. సర్వపూర్తికరం తస్మాదిదం నామ కృతం మయా
తద్బ్రూహి త్వమగస్త్యాయ పాత్రమేవ న సంశయః.

సర్వపూర్తికరమగు ఈ నామమును నీవు అగస్త్యునకు చెప్పుము. అతడిందుకు పాత్రుడు, సంశయము లేదు.

15. పత్న్యస్య లోపాముద్రాఖ్యా మాముపాస్తేఽతిభక్తితః
అయంచ నితరాం భక్తః తస్మాదస్య వదస్వ తత్.

ఇతని పత్నియగు లోపాముద్ర నన్నతిభక్తితోనుపాసించును. ఇతడు కూడ మిక్కిలి భక్తుడు. కావున నీవు దీనిని వానికి చెప్పుము.

16. అముంచమాన స్త్వత్పాదౌ వర్ష త్రయ మసౌ స్థితః
ఏతజ్ఞాతుమతో భక్త్యా హీదమేవ నిదర్శనమ్.

నీ పాదములు విడవకుండ మూడు సంవత్సరములు భక్తితో నిత డుండెను. ఇతడు దీనిని తెలిసికొనుటకు పాత్రుడనుటకు ఇదియే నిదర్శనము.

17. చిత్తపర్యాప్తి రేతస్య నాన్యథా సంభవిష్యతి
సర్వపూర్తికరం తస్మాదనుజ్ఞాతో మయా వద.

మరియొక విధముగ వీనికి చిత్త తృప్తి కలుగదు. కావున నాచే అనుజ్ఞాతుడవై నీవు ఈ స్తుతిని వానికి చెప్పుము.

సూత ఉవాచ :

18. ఇత్యుక్త్వాఽంతరధాదంబా కామేశ్వర సమన్వితా
అథోత్థాప్య హయగ్రీవః పాణిభ్యాం కుంభసంభవమ్.

19. సంస్థాప్య నికటే వాచ మువాచ భృశవిస్మితః

ఇట్లు పలికి కామేశ్వరునితోకూడ అంబ అంతర్ధానమొందెను. తరువాత కుంభసంభవుని హయగ్రీవుడు చేతులతో లేవనెత్తి, తన సమీపమున కూర్చుండబెట్టుకొని విస్మితుడై ఇట్లనెను :

సూతఉవాచ :

కృతార్థోఽసి కృతార్థోఽసి కృతార్థోఽసి ఘటోద్భవ.

ఘటోద్భవ ! నీవు ముమ్మాటికి కృతార్థుడవు.

20. త్వత్సమో లలితాభక్తో నాఽస్తి నాఽస్తి జగత్త్రయే
యేనాగస్త్య స్వయం దేవీ వక్తవ్య మన్వశాత్.

. నీవంటి లలితాభక్తుడు మరియొకడు లేడు; ఏలన, నీకు చెప్ప వలయునని దేవి స్వయముగ శాసించినది.

21. సచ్ఛిష్యేణ త్వయా చాఽహం దృష్టవా నస్మి తాం శివామ్
యతంతే దర్శనార్థాయ బ్రహ్మవిష్ణ్వీశపూర్వకాః॥

అశ్వానన ! శాస్త్రమందు విశ్వాసముకల నీయందు మాకు ప్రీతి కలదు. రాజ్యమీయ వచ్చును. శిరమీయవచ్చును. కాని, షోడ శాక్షరి నీయరాదు.

11. సమాతృజారవద్గోప్యా విద్యైషేత్యాగమా జగుః
తతోఽతిగోపనీయా మే సర్వపూర్తికరీ స్తుతిః.

ఈ విద్యను స్వమాతృజారత్వము నెంత గోప్యముగ నుంచుదురో అంత గోప్యముగ నుంచవలెను, అంత కంటె గోప్యముగ సర్వ పూర్తికరియగు ఈ స్తుతిని ఉంచవలెను.

12. మయా కామేశ్వరేణాఽపి కృతా సంగోపితా భృశమ్
మదాజ్ఞయా వచో దేవ్య శ్చక్రు ర్నామసహస్రకమ్.

ఈ స్తుతి నాచేతను కామేశ్వరుని చేతను చేయబడి గోప్యముగ నుంచబడినది. సహస్ర నామములను, నా ఆజ్ఞచే వాగ్దేవతలు చేసిరి.

13. అవాభ్యాం కథితా ముఖ్యా సర్వపూర్తికరీ స్తుతిః
సర్వక్రియాణాం వైకల్యపూర్తి ర్యజ్జపతో భవేత్.

సర్వసిద్ధికరమును ముఖ్యమునగు ఈ స్తుతి మాచే చెప్ప బడినది. దీనిని జపించిన సర్వక్రియలందలి లోపములు పూర్తిచెందును.

14. సర్వపూర్తికరం తస్మాదిదం నామ కృతం మయా
తద్బ్రూహి త్వమగస్త్యాయ పాత్రమేవ న సంశయః.

సర్వపూర్తికరమగు ఈ నామమును నీవు అగస్త్యునకు చెప్పుము. ఆతడిందుకు పాత్రుడు, సంశయము లేదు.

15. పత్న్యస్య లోపాముద్రాఖ్యా మాముపాస్తేఽతిభక్తితః
అయంచ నితరాం భక్తః తస్మాదస్య వదస్వ తత్.

ఇతని పత్నియగు లోపాముద్ర నన్నతిభక్తితోనుపాసించును. ఇతడు కూడ మిక్కిలి భక్తుడు. కావున నీవు దీనిని వానికి చెప్పుము.

16. అముంచమాన స్త్వత్పాదౌ వర్ష త్రయ మసౌ స్థితః
ఏతజ్జ్ఞాతుమతో భక్త్యా హీదమేవ నిదర్శనమ్.
నీ పాదములు విడవకుండ మూడు సంవత్సరములు భక్తితో నిత డుండెను. ఇతడు దీనిని తెలిసికొనుటకు పాత్రుడనుటకు ఇదియే నిదర్శనము.

17. చిత్తపర్యాప్తి రేతస్య నాన్యథా సంభవిష్యతి
సర్వపూర్తికరం తస్మాదనుజ్ఞాతో మయా వద.
మరియొక విధముగ వీనికి చిత్తతృప్తి కలుగదు. కావున నాచే అనుజ్ఞాతుడవై నీవు ఈ స్తుతిని వానికి చెప్పుము.

సూత ఉవాచ :

18. ఇత్యుక్త్వాఽంతరధాదంబా కామేశ్వర సమన్వితా
అథోత్థాప్య హయగ్రీవః పాణిభ్యాం కుంభసంభవమ్.

19. సంస్థాప్య నికటే వాచ మువాచ భృశవిస్మితః
ఇట్లు పలికి కామేశ్వరునితోకూడ అంబ అంతర్ధానమొందెను. తరువాత కుంభసంభవుని హయగ్రీవుడు చేతులతో లేవనెత్తి, తన సమీపమున కూర్చుండబెట్టుకొని విస్మితుడై ఇట్లనెను :

సూతఉవాచ :

కృతార్థోఽసి కృతార్థోఽసి కృతార్థోఽసి ఘటోద్భవ.
ఘటోద్భవ ! నీవు ముమ్మాటికి కృతార్థుడవు.

20. త్వత్సమో లలితాభక్తో నాఽస్తి నాఽస్తి జగత్త్రయే
యేనాగస్త్య స్స్వయం దేవీ వక్తవ్య మన్వశాత్.
నీవంటి లలితాభక్తుడు మరియొకడు లేడు; ఏలన, నీకు చెప్ప వలయునని దేవి స్వయముగ శాసించినది.

21. సచ్ఛిష్యేణ త్వయా చాఽహం దృష్టవా నస్మి తాం శివామ్
యతంతే దర్శనార్థాయ బ్రహ్మవిష్ణ్వీశపూర్వకాః॥

సచ్ఛిష్యుడవగు నీవలన నే నాదేవిని చూడకలిగితిని. ఆమె దర్శ
నమునకై త్రిమూర్తులే కనిపెట్టుకొనియుందురు కదా!

22. అతః పరం తే వక్ష్యామి సర్వపూర్తికరం స్తవమ్
యస్య స్మరణమాత్రేణ పర్యాప్తిస్తే భవేద్ధృది.

ఇక నీకు సర్వపూర్తికరమగు ఈ స్తవమును చెప్పెదను. దీనిని
స్మరించినంతమాత్రమున నీ హృదయమునందు తృప్తి కలుగును.

23. రహస్యనామసాహస్రాదపి గుహ్యతమం మునే।
ఆవశ్యకం తతో ప్యేతల్లలితాం సముపాసితుమ్.

ఇవి సహస్రనామములకంటె గుహ్యమైనవి. కావున ఇవి లలితా
దేవి నుపాశించుట కావశ్యకమైనవి.

24. తదహం సంప్రవక్ష్యామి లలితాంబానుశాసనాత్।
శ్రీమత్పంచదశాక్షర్యాః కాదివర్ణాన్ క్రమాన్మునే.

కావున, లలితాంబా శాసనమున నీకు పంచదశాక్షరి యొక్క కాది
వర్ణములను క్రమముగ ఉపదేశింతును.

25. పృథగ్వింశతినామాని కథితాని ఘటోద్భవ।
ఆహత్యనామ్నాం త్రిశతీ సర్వ సంపూర్తికారిణీ.

ఒక్కొక్క అక్షరమునకు ఇరువది నామములు చెప్పబడినవి.
అన్నియు కలసి త్రిశతి (300) అయినవి.

26. రహస్యాతిరహస్యైషా గోపనీయా ప్రయత్నతః,
తాం శృణుష్వమహాభాగ సావధానేన చేతసా.

ఇది రహస్యాతిరహస్యము: ప్రయత్నమున గోపనీయము. సావ
ధానమగు చేతస్సుతో వినుము.

27. కేవలం నామబుద్ధిస్తే న కార్యా తేషు కుంభజ
మంత్రాత్మకత్వ మేతేషాం నామ్నాం నామాత్మతాఽపి చ.

ఇది కేవలము నామములని నీవు భావింపకూడదు. ఇవి నామ
ములేగాక మంత్రాత్మకములునై యున్నవి.

28. తస్మాదేకాగ్రమనసా శ్రోతవ్యం చ త్వయా సదా,
ఇత్యుక్త్వా తం హయగ్రీవః ప్రోచే నామశతత్రయమ్.

కావున నీవు ఏకాగ్రమనస్కుడవై వినవలయును. అని పలికి హయగ్రీవుడు నామ శతత్రయమును అగస్త్యునికి చెప్పెను.

ఈ తరువాత నున్న శ్లోకములకు శ్రీశంకరభగవత్పాదులు భాష్యము వ్రాసిరి

భక్తితో బహుకాలము హయగ్రీవుని పాదముల నవలంబించి యున్న కుంభజన్మమునికి భగవత్ప్రీతుడై శివదంపతీకృతమగు నామ తత్రయమును హయగ్రీవుడీ క్రిందివిధముగ చెప్పెను.

కకారరూపా కల్యాణీ కల్యాణగుణశాలినీ
కారుణ్యశైలనిలయా కమనీయా కలావతీ.

(1) కకారరూపా :-

కకారము కవర్ణము, దానిని రూపముగ, అనగ జ్ఞాపకమొనరించు విశేషణముగ కలది. కావున పరదేవత కకారరూప- అనగ విద్యా విగ్రహా అని అర్థము. లేక, కకారము రూపముగ వాచకముగ కలిగినట్టివి కకారరూపములు - అనగ హిరణ్యగర్భుడు, ఉదకము, శిరస్సు, సుఖము మొదలైన గుణములు, వ్యంజనములలో మొదటి అక్షరముగ నుండుటచే కకారమందున్నవి. కావున నీమె కకారరూప. కకారమునకు ఉదకమని అర్థమున్నందున, ఉదకమందున్న అన్నోత్పాదనశక్తిద్వారా జగత్సంజీవనహేతుత్వము ఈ మంత్రమందలి అగ్రిమవర్ణమునకు కలదు- కావున పరదేవత కకారరూప. కకారమునకు శిరస్సు అని అర్థము కూడ కలదు. సర్వప్రాణులకు శిరస్సునందమృతమున్నది; యోగ మార్గమున కుండలినీజాగరణ మొనరించి అట్టి అమృతప్రవాహమునందు మునిగిన యోగు లీశ్వరసామ్యము నొందుదురని యోగశాస్త్రములందు ప్రసిద్ధము. అరీతిగనే ఈ మంత్రమునందు కవర్ణము శిరస్థానీయముగ నుండి దానిని పునశ్చర్య నొనరించినవారికి శివభావము నొసంగును ; కావున ఈమె కకారరూప. "కం బ్రహ్మ

ఖం బ్రహ్మ" (ఛా. ఉ. 4-10-5) (కం) సుఖము బ్రహ్మము, (ఖం) ఆకాశము బ్రహ్మము అని శ్రుతి. కవర్ణమునకు సుఖమను అర్థము కూడకలదు. హృదయ మందలి దహరాకాశము సుఖస్వరూపమగుట వలన పరమ ప్రేమాస్పదముగ అభిల షింపబడునట్లే కకారము, అతి ప్రీతివిషయమగు మూలమంత్రమందలి ఆదిమాక్షర మగుటచే, జనులచే అభిలషింపబడుచున్నది. కావున పరదేవత కకారరూప అని చెప్పబడినది.

ఓం కకారరూపాయైనమః

(2) కల్యాణీ :-

కల్యాణములనగ సుఖములు. ఇవి (లౌకికములగు) యువకుని ఆనందము, మొదలుకొని బ్రహ్మానందపర్యంతము తైత్తిరీయకాద్యుపనిష త్తులలో ప్రతిపాదింపబడినవి. — "ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి" (బృహ. ఉ. 6-3-32) ఈ బ్రహ్మానందముయొక్క లేశమను, అన్యములగుచు, ఇతర భూతములు అనుభవించుచున్నవి- అని శ్రుతి చెప్పుచున్నం దున ఏయే ఉపాధులందు ఏయే స్వరూపములున్నవో అవియన్నియు కల్యాణ శబ్ద ముచే చెప్పబడుచున్నవి కల్యాణములు కలది కల్యాణి- అని మతుప్ సమాసము.

---

(1) విద్య అనగ మంత్రము. కకారము ఆదియందు కలిగిన విద్య కాదివిద్య. అనగ ప్రకృతమగు పంచదశీమంత్రము. ఈ మంత్రము కాదివిద్య., హాది విద్య ఇత్యాదిగ ద్వాదశ భేదము కలిగియున్నది. సర్వసాధారణముగ ప్రచార ములో నున్నది కాదివిద్య.

---

ఉపాధిగతస్వరూపముచే సమిష్టి వ్యష్టిత్వము1 సంభవించుచున్నది, కావున మతుప్ సమాసము చెప్పుట యుక్తమే. "రాహోశ్శిరః" రాహువుయొక్క శిరము అని చెప్పినపుడు2 సమాసాంతర్గమగు (యొక్క-అను) షష్ఠీవిభక్తియందలి అర్థభేదము వివక్షింపబడలేదు; అట్లే ఇక్కడకూడ. ఈమె కేవలమగు ఆనందమును స్వరూపముగ కలది, ఆనందైకవిగ్రహవతి — అనగ "విజ్ఞాన మానందం బ్రహ్మ" (బృహ ఉ. 5 9-28) బ్రహ్మము విజ్ఞాన స్వరూపము ఆనందస్వరూపము, అను శ్రుతియందు చెప్పిన బ్రహ్మస్వరూపలక్షణములు కలది అని అర్థము.

ఓం కల్యాణ్యై నమః

(౩) కల్యాణగుణశాలినీ :_

(కల్యాణగుణములచే శోభించుచున్నది)

కల్యాణములనగ సుఖకరములగు గుణములు; అవి సత్యకామ, సత్యసంకల్ప సర్వాధిపత్య, సర్వేశానాత్వ, వామనీత్వ[3] సంయద్వామత్వాదులు.[4] ఈమె వలన ఈ గుణములు శోభించునని గాని, ఈమెనవి శోభింపచేయుచున్నవని గాని అర్థము చెప్పవచ్చును. కావున ఈమె కల్యాణగుణశాలిని, లేక, కల్యాణములగునట్టి గుణములు కల్యాణగుణములు. అవి ఈమెను శోభింపచేయుచున్నవి. ఇట్లు, సమాసము చెప్పినపుడు పరదేవతయొక్క పరాధీనగుణతత్త్వము, స్వతశ్శుద్ధ చైతన్యత్వము స్ఫురించు చున్నది. "కల్యాణగుణములచేత శోభించుచున్నది" అని సమాసము చెప్పినపుడు పరదేవతయొక్క గుణవత్త్వముమాత్రమే (గుణములను కలిగియుండుట మాత్రమే) స్ఫురించు చున్నది. ఉపాధివలన గుణములు కలుగు చున్నవని వేదమందు చెప్పినప్పటికిని ఆ విషయము నిటస్తుతియందు ప్రకటింప కుండుట దోషముకాదు, గుణ సంకీర్తనముచే దేవతాకృప కలుగును. కాని గుణములు ఆరోపితములు. అందుచే ముఖ్యమైనట్టిదేమనగ శుద్ధచైతన్యాఽభేద మున భజించుటయే; అనగ శుద్ధచైతన్యముకంటె తాను అభిన్నుడని ధ్యానించు టయే. దీనిని గురూపదిష్టమార్గముననే సంపాదింప సుకరము; కావున నిట విస్తరించి చెప్పుటలేదు.

ఓం కల్యాణగుణశాలిన్యై నమః

---

(1) మాయయందు ప్రతిబింబించిన చైతన్యమే ఈశ్వరుడయ్యెను; అంతఃకరణమందు ప్రతిబింబించిన చైతన్యము జీవుడు; ఈశ్వరుడు సమిష్టి (సముదాయము) అను సంజ్ఞ కలవాడు. జీవుడు వ్యష్టి అను సంజ్ఞ కలవాడు.

(2) రాహువునకు శిరమొక్కటే కలదు. మిగిలిన అవయవములు లేవు. కావున రాహోశ్శిరః అని చెప్పినపుడు షష్టీవిభక్తియొక్క అర్థము చెప్ప

బడలేదు. అట్లే "కల్యాణీ" అని చెప్పినపుడు కల్యాణగుణములు అనగ ఆనందము - అదియే కలది; ఇతరములు లేనిది అను అర్థము కలుగుచున్నది

(3) పుణ్యకర్మఫలమును కలిగించునట్టి గుణము వామనీత్వము.

(4) సంయద్వామత్వమనగ సర్వ శుభములను పొందునట్టి గుణము పైన చెప్పిన గుణములు బ్రహ్మవేత్తకుండునని ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పబడినది,

(4) కల్యాణశైలనిలయా :—

(కల్యాణశైలము నిలయముగ కలది)

శిలయొక్క వికారము (రూపభేదము) శైలము; శిలాఘనమని అర్థము. కల్యాణమనగ సుఖము; సుఖమే శైలము, అనగ ఘనీభవించిన సుఖము. అట్టి కల్యాణశైలమునందు ఆనందఘనమగు స్వస్వరూపమున నిలచియున్నది కావున ఈమె కల్యాణశైలనిలయ. "స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి, స్వే మహిమ్ని" (ఛా. ఉ 7-24--7. )ఆ భగవంతుడు దేనియందు ప్రతిష్ఠితుడు? తన "మహిమ మందు" అని శ్రుతి. దేవదత్తుడు తనయందే తానుండెనని లోకప్రయోగముకూడ కలదు. కావున స్వస్వరూపమున స్వావస్థానమున దేవత ఉండెనని చెప్పుట యుక్తమే. లేక, కల్యాణమే శైలమువలె ఘనీభవించినది కావున కల్యాణశైలము, అనగ ఆనందమయకోశము. "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" (తై. ఉ. 2-5-2) బ్రహ్మము పుచ్ఛమువలె,[1] ప్రతిష్ఠ (ఆధారము) అని శ్రుతి చెప్పినందున కల్యాణశైలము నిలయముగ కలది అని బహువ్రీహి చెప్పినను విరుద్ధముగ నుండదు. లేక కల్యాణశైలము మహామేరువు, అది నిలయముగ కలది. అనగ సుమేరు మధ్యశృంగమునందున్నది.

ఓం కల్యాణశైలనిలయాయై :-

(5) కమనీయా :-

పరదేవత పరమానంద స్వరూపము కలది కావున పరమ ప్రేమాస్పద. "కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆ

నందో న స్యాత్" (తై. ఉ. 2-1) ఈ ఆకాశము ఆనందము గాకున్న ఎవరు (చలింతురు) ప్రాణముతోనుందురు? అని శ్రుతి లేక, సుఖమందు మనోహరత్వ మున్నది, కావున అది అందరిచే కోరబడుచున్నది; అట్లే మాయావృత్తులైన జనులు తమ తమ ఇష్టదేవతలను ప్రీత్యతిశయముతో పూజలు చేయగ ఆయా ఫలముల నీమె ఇచ్చును; కావున కమనీయ. లేక ఆనందఘనీభావాత్మక సుందరమూర్తి నీమె కలిగియుండుటవలన జ్ఞానుల కీమె "కమనీయ" అని చెప్పవచ్చును.

ఓం కమనీయాయై నమః

(1) నేను సుఖినని అనుభవము కలిగిన ఆనందమయునకు ఇష్టులగు పుత్రాదులను చూచుటవలన కలుగు ప్రియము శిరము. (అనగ శిరమువలె ప్రధానమైనది) మోదము (అనగ ప్రియము కలుగుటవలన జనించిన హర్షము), కుడిరెక్క వంటిది. ప్రమోదము (అనగ ఎక్కువగు హర్షము) రెండవ రెక్కవంటిది. ఆనందము ఆత్మ — అనగ దేహ మధ్యభాగమును పోలియున్నది. ఇట్టి ఆనందమయుడగు విహంగమునకు బ్రహ్మము, పుచ్ఛము (తోక) వలె ప్రతిష్ఠ అనగ సర్వమునకు ఆధారభూతమైనది: అని శ్రుతి అనగ బ్రహ్మముచే సర్వభూతములు ఆత్మవంతములగుచున్నవి. కావున బ్రహ్మము సర్వభూతములకు ఆధారము. పక్షియొక్క క్రిందిభాగము దానికెట్లు ఆధారమో అట్లే బ్రహ్మము సర్వమునకు అధిష్ఠానము అని భావము.

(6) కలావతీ :-

కళలనగ శిరము, పాణి మొదలైన అవయవములు లేక చతుష్షష్టి కళలు, విద్యారూపములు, లేక చంద్రకళలు: అట్టి కళలు భక్తుల ధ్యానార్థము ఈమెకు కలవు కావున ఈమె కళావతి.

ఓం కలావత్యై నమః

కమలాక్షీ కల్మషఘ్నీ కరుణామృతసాగరా ।
కదంబకాననావాసా కదంబకుసుమప్రియా ॥

(7) కమలాక్షీ :-

"కమలములవంటి కన్నులుకలది" కావున ఈమె కమలాక్షి: లేక కమల అనగ లక్ష్మి, అక్షి శబ్దముచే అక్షి (నేత్ర) నిమిత్తమున కలుగుచున్న జ్ఞానము చెప్పబడుచున్నది. ఈమె అట్టి జ్ఞానము కలదని గాని, అట్టి జ్ఞానమునకు విషయమగుచున్నదని కాని చెప్పవచ్చును. లేక కమల (లక్ష్మి) యొక్క అక్షి కలది: అనగ ఐహికాముష్మిక సంపదలకు హేతుభూతమగు కన్నులు కలది. అనగ వీక్షణమాత్రముచే మహదైశ్వర్యము నీమె ప్రాపింప చేయును అని భావము.

ఓం కమలాక్ష్యై నమః

(8) కల్మషఘ్నీ:—

కల్మషములను - పాపములను పోగొట్టు నది కావున ఈమె కల్మషఘ్ని. "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" (భ. గీ. 18-66), నిన్ను సర్వపాపములనుండి విడిపింతును: అని భగవద్వాక్యము. లేక, "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా" (భ. గీ. 4-37). జ్ఞానాగ్ని సర్వకర్మములను భస్మములుగ చేయును. అను స్మృతిచేతను, "న స పాపం శ్లోకం శృణోతి" అట్టివాడు పాపమగు మాటను వినడు, అను శ్రుతి చేతను ఈమె కల్మషఘ్ని అనగ వేదాంతమహావాక్యముల వలన కలిగిన సాక్షాత్కార రూప మగు బ్రహ్మవిద్య.

ఓం కల్మషఘ్న్యై నమః

(9) కరుణామృతసాగరా :-

కరుణచే, కృపచే కలిగిన మోక్షరూప మగు ఏ అమృతము కలదో, అట్టి కరుణామృతము యొక్క సాగరమే ఈ పరదేవత. అమృతసముద్రము స్వయముగ అమృతస్వరూపమై అమృతపానమొన రించు మేఘముచే వర్షింపబడిన - అమృతముచే ఇతర లోకములను సంజీవింపచేయును. అట్లే ఈమె అమృతస్వరూప. బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి", బ్రహ్మము నెరుగువాడు బ్రహ్మమగును. "బ్రహ్మవిదాప్నోతి పరమ్" (తై. ఉ, 2-1) బ్రహ్మవేత్త పరమపదమునొందును అని శ్రుతియందున్నందున ఈమె స్వయముగ

నమృతస్వరూప. "లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్" (భ గీ. ౹-22). పిదపవాచే ఏహితములును హితములునగు కామముల నొందును అని భగవద్వాక్యము. కావున దేవతచే నీయబడుచున్న కర్మోపాసనాదిఫలము త్తదధికారితారతమ్యమున లభించుచున్నది: అందుచే ఈమె సాగరోపమ. అమృతమువలె సంజీవనియగు కరుణామృతమునకు అభిన్నమగు అశ్రయమగుటవలన నీమె సాగరమువంటిది. కరుణ అనగా భక్తుని విషయమై ఉండునట్టి పరిపాల్యతాబుద్ధి. లేక కరుణచే - కృపచే, అమృతులు అనగ శాశ్వతకీర్తి నొంది బ్రహ్మలోకమును పొందిన సగరవంశజులు కలది అని చెప్పవచ్చును: లేక కరుణచే, దయచే, (ఈమెవలన) అమృతము నొందింపబడిన సాగరుడు - సముద్రుడు కలది. అనగ భాగీరధి అని అర్థము చెప్పవచ్చును.

ఓం కరుణామృత సాగరాయై నమః

(10) కదంబకాననావాసా ;-

కదంబమను పేరుగల కల్పవృక్షములు కలిగిన కాననమందు ఈమె అవాసము - అనగ గృహము కలధి.

ఓం కదంబకాననావాసాయై నమః

(11) కదంబ కుసుమప్రియా :-

కదంబవృక్షములయొక్క కుసుమములందు ప్రియ - అనగ ప్రీతికలది (ప్రీతిమతి). ప్రియశబ్దము ప్రీతికి విషయమైన వస్తువును చెప్పునట్టిదైనను ఇక్కడ కుసుమముల వలన ప్రీతిలేనందున ప్రీతివిషయవాచకముగ చెప్పుటకు వీలులేనందున కుసుమములందు[1] ప్రీతిమతి అని చెప్పబడినది.

ఓం కదంబకుసుమప్రియాయై నమః

కందర్పవిద్యా కందర్పజనకాపాంగవీక్షణా ।
కర్పూరవీటీసౌరభ్యకల్లోలితకకుప్తటా ॥

(12) కందర్పవిద్యా :—

ఈమె కందర్పునియొక్క విద్య,[2] అనగ అందునిరూపింపబడిన జీవబ్రహ్మైక్యవిజ్ఞానమని అర్థము. లేక వేదవాక్యములలో

(7) కమలాక్షీ :-

"కమలములవంటి కన్నులుకలది" కావున ఈమె కమలాక్షీ: లేక కమల అనగ లక్ష్మి, అక్షి శబ్దముచే అక్షి (నేత్ర) నిమిత్తమున కలుగుచున్న జ్ఞానము చెప్పబడుచున్నది. ఈమె అట్టి జ్ఞానము కలదని గాని, అట్టి జ్ఞానమునకు విషయమగుచున్నదని కాని చెప్పవచ్చును. లేక కమల (లక్ష్మి) యొక్క అక్షి కలది: అనగ ఐహికాముష్మిక సంపదలకు హేతుభూతమగు కన్నులు కలది. అనగ వీక్షణమాత్రముచే మహదైశ్వర్యము నీమె ప్రాపింప చేయును అని భావము.

ఓం కమలాక్ష్యై నమః

(8) కలుషఘ్నీ:—

కల్మషములను - పాపములను పోగొట్టు నది కావున ఈమె కల్మషఘ్ని. "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" (భ. గీ. 18-66), నిన్ను సర్వపాపములనుండి విడిపింతును: అని భగవద్వాక్యము. లేక, "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా" (భ. గీ. 4-37). జ్ఞానాగ్ని సర్వకర్మములను భస్మములుగ చేయును. అను స్మృతిచేతను, "న స పాపం శ్లోకం శృణోతి" అట్టివాడు పాపమగు మాటను వినడు, అను శ్రుతి చేతను ఈమె కల్మషఘ్ని అనగ వేదాంతమహావాక్యముల వలన కలిగిన సాక్షాత్కార రూపమగు బ్రహ్మవిద్య.

ఓం కల్మషఘ్న్యై నమః

(9) కరుణామృతసాగరా :-

కరుణచే, కృపచే కలిగిన మోక్షరూపమగు ఏ అమృతము కలదో, అట్టి కరుణామృతము యొక్క సాగరమే ఈ పరదేవత. అమృతసముద్రము స్వయముగ అమృతస్వరూపమై అమృతపానమొనరించు మేఘముచే వర్షింపబడిన - అమృతముచే ఇతర లోకములను సంజీవింపచేయును. అట్లే ఈమె అమృతస్వరూప. బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి", బ్రహ్మము నెరుగువాడు బ్రహ్మమగును. "బ్రహ్మవిదాప్నోతి పరమ్" (తై. ఉ, 2-1) బ్రహ్మవేత్త పరమపదమునొందును అని శ్రుతియందున్నందున ఈమె స్వయముగ

నమృతస్వరూప. "లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్" (భ గీ. 7-22). పిదపనాచే ఏహితములును హితములనగు కామముల నొందును అని భగవద్వాక్యము. కావున దేవతచే నీయబడుచున్న కర్మోపాసనాదిఫలము తత్తదధికారితారతమ్యమున లభించుచున్నది: అందుచే ఈమె సాగరోపమ. అమృతముకలె సంజీవనియగు కరుణామృతమునకు అభిన్నమగు అశ్రయమగుటవలన నీమె సాగరమువంటిది. కరుణ అనగా భక్తుని విషయమై ఉండునట్టి పరిపాల్యతా బుద్ధి. లేక కరుణచే - కృపచే, అమృతులు అనగ శాశ్వతకీర్తి నొంది బ్రహ్మలోకమును పొందిన సగరవంశజులు కలది అని చెప్పవచ్చును: లేక కరుణచే, దయచే, (ఈమెవలన) అమృతము నొందింపబడిన సాగరుడు - సముద్రుడు కలది. అనగ భాగీరధి అని అర్థము చెప్పవచ్చును.

ఓం కరుణామృత సాగరాయై నమః

(10) కదంబకాననావాసా :-

కదంబమను పేరుగల కల్పవృక్షములు కలిగిన కాననమందు ఈమె ఆవాసము - అనగ గృహము కలది.

ఓం కదంబకాననావాసాయై నమః

(11) కదంబ కుసుమప్రియా :-

కదంబవృక్షములయొక్క కుసుమములందు ప్రియ - అనగ ప్రీతికలది (ప్రీతిమతి). ప్రియశబ్దము ప్రీతికి విషయమైన వస్తువును చెప్పునట్టిదైనను ఇక్కడ కుసుమముల వలన ప్రీతిలేనందున ప్రీతివిషయవాచకముగ చెప్పుటకు వీలులేనందున కుసుమములందు[1] ప్రీతిమతి అని చెప్పబడినది.

ఓం కదంబకుసుమప్రియాయై నమః

కందర్పవిద్యా కందర్పజనకాపాంగవీక్షణా ।
కర్పూరవీటీసౌరభ్యకల్లోలితకకుప్తటా ॥

(12) కందర్పవిద్యా :-

ఈమె కందర్పునియొక్క విద్య,[2] అనగ అందునిరూపింపబడిన జీవబ్రహ్మైక్యవిజ్ఞానమని అర్థము. లేక వేదవాక్యములలో

(ఒకభాగమునకు) ఉపనిషత్తులు అను ప్రయోగమున్నట్లు, విద్యను కలిగించునవి కావున కందర్పదృష్టమగు (పంచదశీ) మూలమంత్రమందలి వర్ణసముదాయము విద్య అని చెప్పబడినవి. ఈ విద్యకు వాచ్యార్థముగ పరదేవతయే సూచింపబడుచున్నది.

ఓం కందర్పవిద్యాయై నమః

---

(1) ప్రియశబ్దములకు ఇక్కడ ప్రీతివిషయవాచకముగ అర్థము చెప్పిన యెడల కదంబ కుసుమజన్యమగు ప్రీతికి ఈమెను విషయముగ చెప్పవలయును: కాని కదంబ కుసుమ జన్యమగు ప్రీతిలేనందున ఇక్కడ కదంబకుసుమములందు ఈమె ప్రియ - ప్రీతి కలది అని అర్థము చెప్పబడినది.

(2) ప్రకృతమగు పంచదశీ మంత్రము కందర్ప దృష్టము. ఈ మంత్రమందు జీవబ్రహ్మైక్య విజ్ఞాన మేఅర్థముగ నున్నది.

---

(13) కందర్పజనకాపాంగవీక్షణా :-

(మన్మథోత్పాదకముగ అపాంగ వీక్షణము కలది) అపాంగములచే వీక్షణము, అనగ ఈషద్ దర్శనము - ఈమె కందర్ప జనకమగు అపాంగవీక్షణము కలది. జడులు, కురూపులునగు జనులపై నొకసారి ఈమె కొంచెముగనైనను చూపు పరపిన, వారు కందర్పునివలె రూపయౌవనసామర్థ్యలక్ష్మీవంతులై యుందురని ఈ నామముచే ధ్వనితమగుచున్నది. లేక, కందర్పునియొక్క జనకుడు శ్రీమన్నారాయణుడు, అతడు ఈమెయొక్క అపాంగ వీక్షణముచే, ఈషద్భ్రూవల్లీ చలనముచే ప్రవర్తించును అనగ ఈమెయొక్క ఆజ్ఞచే వశ్యుడై మహావిష్ణువు జగద్రక్షాదికార్యములను చేయును- అని అర్థము. లేక కందర్పజనక అగు మహాలక్ష్మి ఎవరి అపాంగవీక్షణముచే ప్రేరేపింపబడి ప్రవర్తించునో అట్టిది, అని అర్థము. లేక, కందర్పజనకములనగ మన్మథోత్పాదకములగు స్రక్చందనాది భోగ్యవిషయములు: అవి ఎవరి అపాంగవీక్షణము వలన కలుగునో అట్టిది అని అర్థము లేక, చంద్రుడీమెకు వామనేత్రము కావున అపాంగ వీక్షణమనగ చంద్రిక (వెన్నెల); కందర్పజనకమగు అపాంగ వీక్షణముకలది.

కందర్పజనక అను శబ్దముచే లక్ష్మీనివాసమగు కమలము సూచింపబడుచున్నది. అట్టి కమలములవంటి అపాంగములు కలది - అనగ కమలాక్షి; కమలములవంటి కన్నులు, వానియందున్న వీక్షణము - లోకసంజీవన రూపమగు వీక్షణము కలది.

ఓం కందర్పజనకాపాంగవీక్షణాయై నమః

**(14)** కర్పూరవీటీసౌరభ్యకల్లోలిత కకుప్తటా :-

కర్పూరయుక్తమగు తాంబూలసౌరభ్యముచే కల్లోలితములగు దిక్తటములు కలది, "కర్పూరయుక్తమగు వీటి"- అనగ తాంబూలకబళములు: వానియొక్క సౌరభ్యము అనగ సౌగంధ్యము వానిచే కల్లోలితములు, అనగ అత్యంతపరిమళ యుక్తములగు కకుప్తటములు - దిక్ప్రదేశములు కలది. ఈమె ముఖమందలి పరిమళముచే జగత్తంతయు సురభీకృతమైనదని చెప్పుటవలన ఈ నామముచే పర దేవతయొక్క స్వరూపాతిశయోక్తి వ్యక్తమగుచున్నది. అనగ ఈమె మహారాజ భోగము కలది అని అర్థము.

ఓం కర్పూరవీటీసౌరభ్యకల్లోలితకకుప్తటాయై నమః

కలిదోషహరా కంజలోచనా కమ్రవిగ్రహా ।
కర్మాదిసాక్షిణీ కారయిత్రీ కర్మఫలప్రదా ॥ 4

**(15)** కలిదోషహరా :-

(కలిదోషములను హరించునట్టిది.) నింద్యమగు కలియందు పుట్టుచున్న జనులకు జన్మమాత్రముచేతనే దోషములు - పాపములు కలుగుచున్నవి. భగవ ద్దర్శనశ్రవణకీర్తన స్తవనపూజనధ్యానముల నొనరించినయెడల ఈమె ఈదోషములను హరించును. కలి యనగ అన్యోన్యవాదుల కలహము, దానివలన వారివారి మతములందు వారికి కలిగిన అభినివేశముచే కలుగు దోషములు - కలిదోషములు పరబ్రహ్మవిషయములో అనేక వాదములున్నవి :— అస్తిత్వ, నాస్తిత్వ, దేహాది వ్యతిరిక్తత్వ, భిన్నత్వ, అభిన్నత్వ, గుణిత్వము మొదలైనవి వీనికి సాధకము లచే 1 యుక్త్యాభాసములు, అట్టివేనగు 2 సంమత్యాభాసములు కలవు. ఇట్టి సాధ కములచే ఆయావాదులు శ్రుతి - తాత్పర్యమును విఘటనమొనరించి అన్యథాకరణ మొనరించి దురాగ్రహమొంది కామక్రోధ పరుషత్వ పరవశులై, నింద — అపహ

నాది రూపములగు పెక్కు దోషములకు లోనగుచున్నారు. అట్టి దోషములను అద్వైత బ్రహ్మజ్ఞాన సాధన ముక్తిరూపముచే నీమె హరించును. కావున కలిదోషహర.

ఓం కలిదోషహరాయై నమః

(16) కంజలోచనా ;-

(పద్మములవంటి లోచనములుకలది) క అనగ ఉదకము, దానినుండి పుట్టినది కంజము - అనగ అరవింద నీలోత్పలములు. కంజములవంటి లోచనములు కలది కంజలోచన: లేక "అయం పూర్వ మపః సృష్ట్వా తాసు వీర్య మపాసృజత్, తదండమభవద్ధైమమ్" - భగవంతుడు పూర్వము జలమును సృజించి అందు వీర్యమును విసర్జించెను. అదియే హైమమగు అండము. అని చెప్పుటవలన కంజము (బ్రహ్మమువలన పుట్టినది) అనగ బ్రహ్మాండము, 'సేయం దేవతైక్షత' (ఛా. ఉ. 6-3-2) ఆ దేవత చూచెను (సంకల్పించెను). అని శ్రుతి చెప్పుటవలన లోచనములనుండి అనగ లోచన కృత వీక్షణమునుండి కంజములు—అనగ, అనేక కోటి బ్రహ్మాండములు ఎవరివలన కలిగినవో ఆమె కంజలోచన.

ఓం కంజలోచనాయైనమః

[17] క్రమవిగ్రహా :—

(మనోజ్ఞమగు విగ్రహముకలది) గాంభీర్య ధైర్య మాధుర్యాద్యనేకగుణము లీమెకు కలవని చెప్పుటవలన క్రమము—అతిమనోజ్ఞమగు మూర్తి అనగ విగ్రహముకలది. "ఆనందరూప మమృతం యద్విభాతి" [ము. ఉ. 2-2-7] ఆనందరూపమై అమృతమై ఏది నాత్మయందు భాసించునో, అను శ్రుతి ననుసరించి ఇట్లు చెప్పబడినది. లేక, ఈమె ఆనందస్వరూప అగుటచే క్రమ విగ్రహ-అనగ లలితారూప అని అర్థము.

ఓం క్రమవిగ్రహాయైనమః

[18] కర్మాదిసాక్షిణీ :-

[కర్మాదులకు ఈమె సాక్షిణి] కర్మ ఆదిగకలవి కర్మాదులు: అవి ఉపాసనాయోగశ్రవణ మనన నిధిధ్యాసనములు, ఈ కర్మాదులకు

ఈమె సాక్షిణి: సంబంధము లేకుండ సాక్షిగనున్నది "సాక్షీ చేతా" [శ్వే. ఉ. 6-10] సాక్షియు, చేతనయు అని శ్రుతి లేక, జీవనిష్ఠములగు కర్మాదులు సాక్షిభూతములుగ కలది; అనగ కర్మాదుల నాశ్రయింపక సృజింపబోవు జగత్తునకు ఉపాదాన కారణభూతములైన ఆత్మదర్శన సాధనములు కలది.3

ఓం కర్మాదిసాక్షిణ్యై నమః

[1 1] కారయిత్రీ :-

కారయితృత్వ మనగ "చేయుము" అని ఆజ్ఞాపింప కలుగుట. లిజ్ లోట్ తవ్య ప్రత్యయముల ధర్మమును విధినిష్ఠభావన అందురు. ఈ ప్రత్యయములు ముందుకలుగనున్న కార్యమువలన తెలియబడు కృతికి ఉత్పత్తిహేతు

(1) యుక్తివలె కనిపించి నిక్కముగ యుక్తికాకుండునట్టిది యుక్త్యాభాసము.

(2) సంమతివలె కనిపించి నిక్కముగ సంమతి రూపము కానిది సమంత్యాభాసము.

(3) సేయం దేవతైక్షత-అను శ్రుతీచే జగత్తుయొక్క సృష్టి వీక్షణపూర్వకము అనగ ఆత్మదర్శన పూర్వకము.

వగు కర్మమును తెలియచేయునట్టివి: ఈ విధులు శబ్దాత్మకములగుటచే జడములు కావున వానియందు చెప్పబడినట్లు [లోకములో] సంభవింపదు అందుచే వేదములకు [శబ్దములకు] అధిష్ఠానమైన చైతన్యరూపమగు నీమెయే చేయించుచున్నది అని చెప్పవలెను. "సర్వే వేదా యత్రైకం భవంతి" ఎక్కడ [ఏ ఆత్మ యందు] వేదములన్నియు ఏకమగునో అని శ్రుతి చెప్పినందున ఆత్మకంటె అభిన్నమగు వేదమునకు స్వప్రకాశముచే అర్థప్రకాశమగుచున్నది: తద్ద్వారా వేదమందొక భాగమగు ప్రామాణ్యవిధులుకూడ ప్రేరణరూపములు. ఈవిధులకు అధిష్ఠానమైన చైతన్యాత్మరూపమున నుండి ఈమెయే చేయించుచుండును, కావున కారయిత్రి అని అర్థము. "ఏష హ్యేవ సాధుకర్మ కారయతి" [కౌ. ఉ. 3-8] ఇతడే సాధుకర్మ చేయించునని శ్రుతి.1

3] Farm

ఓం కారయిత్ర్యై నమః

[20] కర్మఫలప్రదా :-

[కర్మఫలము నిచ్చునట్టిది] చేసిన కర్మములకు కాలాంతరమందు కలుగు ఫలమునకు కారణమదృష్టమని నిరీశ్వరమీమాంసకుల మతము: కాని ఈ మతము సరికాదు. జడములు సూక్ష్మములగు అదృష్టములకు చేతనధర్మమగు కర్మఫలప్రదానమందు సామర్థ్యముండదు; చేసిన కర్మములకు ఫలమ వశ్యముగ నుండవలెను. కర్మాధ్యక్షః[శ్వే. ఉ 6-10]ఇతడే కర్మాధ్యక్షుడని శ్రుతి. "మయైవ విహితాన్ హితాన్"(భ. గీ. )నాచే విహితములగు హితముల నొందును అని స్మృతి. "ఫలమత ఉపపత్తేః" [బ్ర. సూ. 3-2-38] అని న్యాయము 2. కనుక పరదేవతయే కర్మఫలప్రద.

ఓం కర్మఫలప్రదాయై నమః

ఏకారరూపా చైకాక్షర్యేకానేకాక్షరాకృతిః
ఏతత్తదిత్యనిర్దేశ్యా చైకానందచిదాకృతిః 5

(21)ఏకారరూపా :-

ఏకారము రూపముగ కలది; అనగ మంత్రమందలి ద్వితీయావయవమును జ్ఞాపకమొనరించు రూపముకలది.

ఓం ఏకారరూపాయై నమః

[22] ఏకాక్షరీ :-

[ఏకమగు అక్షరముకలది] ఏకము-అనగ ఈశ్వరునకు (మాయ) ఉపాధి అగుటచే ముఖ్యమని అర్థము. అక్షరమనగ ఆత్మజ్ఞానము లేకుండ నశింపనిది-ఏకమగుఅక్షరము. ఏకాఅక్షరము అనగ కూటస్థశబ్దవాచ్యమగు మాయ. ఈ మాయయందున్న ప్రతిబింబమగు ఈశ్వరునకు గల సర్వజ్ఞత్వాదులను కలుగజేయు నట్టి విశేషణము లీమెకు కలవు: కావున ఈమె ఏకాక్షరి. లేక ఏకమగు అక్షరము ప్రణవము, సర్వమునకు ప్రకృతి అగుటచేతను, పరాపరబ్రహ్మమునకు ప్రతీకమగుట చేతను ప్రణవము నుపాసించిన పరాపరబ్రహ్మమును పొందవచ్చును. ఇట్టి బ్రహ్మ

రూపలక్షితలక్షకశబ్దమగు ప్రణవము పరదేవతకు కలదు. కావున ఈమె ఏకాక్షరి. లేక ఏకః-అఖండ చైతన్యరూపుడు, అక్షరుడు, అవినాశియగు పరమేశ్వరుని తన అర్ధశరీరమునందు కలది కావున ఈమె ఏకాక్షరి. లేక, ఏకములగు అక్షరములు-అనగ మాయాబీజము హ్రీం) మొదలైనవి: అవి ఈమెయొక్క ఉపాసనమందు ప్రతీకములుగ నున్నవి. అట్టి అక్షరములు కలది ఏకాక్షరి. "అథ పరా యయా తదక్షరమధిగమ్యతే" [ము. ఉ. 1-6] పిమ్మట పరావిద్య, దేనిచే అక్షరము పొందబడుచున్నదో[1] అని శ్రుతి, అఖండాకారవృత్తియందు ప్రతిఫలింప యోగ్యమగు చైతన్యరూపత్వమున, అట్టి వృత్తియందు వ్యాప్తిమాత్రమున అక్షరమను పదముచే లక్షింపబడుచున్న చైతన్యము, విషయతాసంబంధమున, ఈమెయందున్నది. కావున ఈమె ఏకాక్షరి.[2] (చ+ఏకాక్షరి=చైకాక్షరీ) చకారమును ప్రయోగించినపుడు, బ్రహ్మము నిర్గుణమైనను సగుణవిశిష్టముగకూడ గ్రహింపబడుచున్నదని గమనింపవలెను. "సచ్చిన్మయః శివః సాక్షాత్ తస్యానందమయీ శివా" శివుడు సచ్చిన్మయుము శివ ఆనందమయి, అని వచనము. స్త్రీరూపాం చింతయేత్ దేవీం పుంరూపా మథవేశ్వరీం అథవా నిష్కలాంధ్యాయేత్ సచ్చిదానంద విగ్రహామ్" సచ్చిదానంద విగ్రహయగు దేవిని స్త్రీ రూపగాగాని పుంరూపముగాని ధ్యానింపవచ్చును లేక నిష్కలగ (అవయవ రహితమైనదిగ) ధ్యానింపవచ్చును. అని స్మృతి 3 "త్వం స్త్రీ త్వం పుమాన్" నీవు స్త్రీవి, నీవు పురుషుడవు, వాని శ్వేతాశ్వతరోపనిషత్తునందు [4-3] ఉపాధిచే ఈమెకు నానారూపములు కలుగుట చెప్పబడినది. కావుననే, "సేయం దేవతైక్షత" [ఛా ఉ. 6-3-2] అని మొదలిడి "తత్సత్యం స ఆత్మా" అని పూర్తి చేసిన శ్రుతియందు స్త్రీ లింగాంత దేవతాదిపదములకు, "తత్సత్యం" అను నపుంసకాంతమునకు "స ఆత్మా" అను పుంలింగమైన ఆత్మశబ్దము కు ఏకార్థత్వము కలుగుచున్నదీ;

(1) భవేత్ అనునది భూధాతువునకు లిజ్ రూపము. భవతు అనునది లోట్ యొక్క రూపము. "భవితవ్యః" అనునది తవ్యరూపము. ఈ ప్రత్యయములు "ఈ పని చేయవలెను" అని విధిని చెప్పును. శబ్దాత్మకములగు విధులు జడములు కావున వేదాఽభిన్న చైతన్యరూపయగు ఈమెయే కారయిత్రి అని అర్థము.

(2) కర్మాధ్యక్షుడీశ్వరుడు కావున ఈశ్వరునివలన కర్మఫలము కలుగుచున్నదని చెప్పుట న్యాయమేనని ఈ సూత్రమునకు అర్థము.

తత్త్వంపదముల లక్ష్యార్థము ఏకనగుటవలన ఇట ఉపాధికలిగియుండుట వివక్షింపబడ లేదు. కావున తత్త్వంపదలక్ష్యార్థమునందు సర్వగుణవర్ణనము సంభవమని సూచించు టకై ఈ త్రిశతియందనేక చకారములను హయగ్రీవుడు ప్రయోగించెను. ఈ చకార ముల కింతియే ప్రయోజనము: మరి వేరు ప్రయోజనము లేదు.

ఓం ఏకాక్షర్యై నమః

[1] ఋగ్వేదాదులు (సగుణబ్రహ్మమును చెప్పునట్టివి) అపరవిద్య: నిర్గుణ బ్రహ్మమును తెలియ జేయునట్టిది పరావిద్య అని ముండకోపనిషత్తు నందు చెప్పబడినది.

[2] సమాధిరూపమగు అఖండాకారవృత్తియందే చైతన్యము ప్రతిఫలించు చున్నదో, ఏది వ్యాపించియున్నదో ఆ చైతన్యమునకు ఈమె విషయమగు చున్నది. అనగ ఆ చైతన్య మీమెయే అగుచున్నది.

[3] ఈ వాక్యము యామళతంత్రములోనిదని దేవీభాగవత వ్యాఖ్యాత నీల కంఠుడు, పుంరూపమున అనగ విరాట్పురుష రూపము అని ఆయన అర్థముచెప్పెను.

(23) ఏకానేకాక్షరాకృతిః :-

(ఈమె ఏకము అనేకములగు అక్షరముల యొక్క ఆకృతి కలది.) ఏకం=ఈశ్వరుడును ప్రతిబింబమునకు ఉపాధియగుటచే శుద్ధసత్త్వప్రధానమైన అక్షరము అనగ అజ్ఞానము అనేకం=మలినసత్త్వప్రధాన మగుటచే జీవనోపాధిభూతములగు అజ్ఞానములు. "మాయాచాఽవిద్యాచస్వయమేవ భవతి" (నృ. తా. ఉ. 9) మాయయు అవిద్యయు స్వయముగ కలుగును అని శ్రుతి. ఏకములు + అనేకములు=ఏకానేకములు. అట్టి అక్షరములు, "మాయాంతు ప్రకృతిం విద్యాత్" (శ్వే. ఉ. 4-10) మాయను ప్రకృతిగ తెలుసుకొనలెను. అని శ్రుతి. ఈ అక్షరములందు (మాయలందు) ఆకృతులు-ప్రతిబింబిన్నరూపములగు చైతన్యములు: ఇవి ఘటమందున్న ఉదకమునందు ప్రతిబింబించిన ఆకాశమువంటివి; అట్టి చైతన్య ములు కలది ఏకానేకాక్షరాకృతి. లేక ఏకములనగ ప్రణవాదులు· అనేకములనగ అకారాదిక్షకారాంతములగు అక్షరములు, అనగ వర్ణములు. అవి స్వరూపముగ,

అకృతిగ కలవి. అనగ ఈమె మాతృకాస్వరూప అని అర్థము."అకారాదిక్షకారాంతా మాతృకేత్యభిధీయతే" అకారము మొదలుకొని క్ష కారము అంతముగ కల వర్ణములు మాతృక అని చెప్పబడును; అని వచనము లేక, ఏ + క(ఏకార కకారములు) ఏక ములు. అనియు ఇతరములగు అనేకాక్షరములును కలసిన పంచదశవర్ణాత్మకమగు మూలవిద్య (మంత్రము) అకృతిగ, స్వరూపముగ కలది అని చెప్పవచ్చును. లేక సాక్షిరూపమున ఏకీభూతమై అనేకాక్షరములందు అనగ అనేక అజ్ఞానములందు. అకృతికలది. అనగ శోధితత్వం పదార్థ సామరస్యాత్మకమగు స్వరూపము కలది.

ఓం ఏకానేకాక్షరాకృతయేనమః

(24) ఏతత్తదిత్యనిర్దేశ్యా :-

(ఇది అది అని నిర్దేశింప శక్యము కానిది)

ఏతత్=ఈ కాలమందు, ఇంతటిది అని పరిచ్ఛేదముకలిగిన వస్తువు, తత్=పరోక్షము అనిశ్చిత స్వరూపముగల వస్తువు ఏతత్ + తత్=ఏతత్త్ + ఇతి. ఇతి అనిచెప్పుట "ఇత్థం" ఇటువంటిదను భావమున "ఇత్థంభావేతృతీయా" —అను పాణిని సూత్ర ముచే ఏతత్, తత్ శబ్దములయొక్క తృతీయాంత విభక్తితో ఇతిపదమునకు సమా సము. ఇది (ఏతత్), అది (తత్) అనువానిచేత, అని ఈ పదములకు అర్థము. అనగ ఇది అది అని నిర్దేశింపశక్యము కానిది 'అనిర్దేశ్య'; కావున ఈమె ఏతత్త దిత్యనిర్దేశ్య లాకమున సవిశేషమగు పదార్థమునే, దానియందున్న పరోక్షత్వము మొదలైన ధర్మములయొక్క విశేషణములచేత నిర్వచింప శక్యమగుచున్నది. (బ్రహ్మము నిర్విశేషము): "అశబ్ద మస్పర్శమరూపమవ్యయం" (కఠ.ఉ. 3-15) బ్రహ్మము శబ్ద స్పర్శరూప వ్యయరహితము. "నిర్గుణం నిష్కలం"[శ్వే.ఉ. 6-19] బ్రహ్మము నిర్గుణము. అవయవరహితము అని శ్రుతులు చెప్పుచున్నవి. బ్రహ్మము శబ్దప్రవృత్తికి నిమిత్తమగు జాతి గుణ క్రియా షష్ఠ్యర్థముల సంబంధము లేనిది: అట్టి వస్తువును ఏ కరణముచే (సాధనముచే) ఏ వచనముచే నిర్దేశింప శక్యమగును? "యద్వాచాఽనభ్యుదితం"(కేన. ఉ. 1-4, 'ఏది(బ్రహ్మము)వాక్కుచే చెప్పబడదో' అని శ్రుతి. కావున ఈమె ఏతత్తదిత్యనిర్దేశ్య; అనగ వాక్కునకు మనస్సుకు అతీత అయినది అని అర్థము. లేక ఏతత్ అనగ ప్రత్యక్షాది ప్రమాణములచే తెలియునట్టి దియు, తరువాత కలుగబోవునట్టిదియునగు కార్యము (జగత్తు); తత్ అనగ పరోక్ష మును పూర్వకాలమును సంబంధము కలదియు వ్యవహితముగ నున్నదియునగు

కారణము (జగత్కారణము): ఇతి శబ్దము ఈ రెంటిని సంబంధింప చేయును. కార్యమనిగాని, కారణమనిగాని ఈ శుద్ధచైతన్య స్వరూపమును నిర్దేశింప శక్యము కాదని అర్థము. కార్యత్వమునుగాని ఘటింపచేయు ఉపాధి ఈమెకు లేనందున ఈమె యందు కార్య కారణభావము లేదు. కావున కార్య కారణ వాచకశబ్దములచే ఈమెను విషయీకరింప శక్యము కాదు. లేక, ఏతత్ - అనగ అపరోక్షముగ "అహం" అని ప్రతీతమగు జీవ చైతన్యము. ఇది త్వం పదముయొక్క వాచ్యార్థము. తత్ అనగ పరోక్షముగ ప్రతీతమగు ఈశ్వరచైతన్యము, ఇది తత్ప వాచ్యార్థము ఇతి శబ్దము ఏవ అను అర్థము కలది ఈ విధముగ భిన్న సిద్ధాంతము లిట చెప్పబడినవి-సాంఖ్య మతమందు ప్రకృతి జగత్కర్త్రి: జీవుడు నానాచేతనుడు, భోక్త, కావున ఈ మత మున ఈశ్వరుడులేడని అంగీకరింపబడినది భాగవత మతమందు "గుణీ సర్వవిత్" [శ్వే. ఉ. 6-16] అతడు విశ్వకర్త. గుణీ, సర్వవేత్త అను శ్రుతి వలన నిత్య గుణ విశిష్టుడును పరమేశ్వరుడునగు విష్ణువునుంచి జీవుల ఉత్పత్తి వినాశములు కలుగు చుండుటచే జీవులు అనిత్యులని, భగవంతుడొక్కడే పారమార్థికమగు ఏకవస్తువని అంగీకరింపబడినది. ఈ ఉభయ వాదుల మతములు ఔపనిషదుల మతముచే తిరస్కృ తములు: కావున ఈ రెండు విధములుగ పరదేవత అనిర్దేశ్య. ఛాందోగ్యమందలి దేవతాశబ్దము వ కివిధముగనే, పరమార్థసచ్చిదానంద రూపముననే, అర్థము చెప్పబడి నది. లేక తటస్థేశ్వరవాదులగు కాణాదుల సిద్ధాంతమువలె [1]వ్యవస్థిత భేదముకల జీవేశ్వరరూపమున అనిర్దేశ్య: భేద వ్యవస్థనే సాధించుటకు శక్యముకాదు. కావున ఈమె ఏతత్తదిత్యనిర్దేశ్య.

ఓం ఏతత్తదిత్యనిర్దేశ్యాయై నమః

(25) ఏకానందచిదాకృతిః :—

[ఏకమగు ఆనందముయొక్క, చిత్తు యొకకు ఆకృతి కలది] ఏకా- అనగ ముఖ్యము, మోక్షరూపమున పొందగోరబడినది కావున ముఖ్యమైనది, ఆనందమనగ సుఖము, చిత్ అనగ చైతన్యము-ప్రకాశజ్ఞా నము. ఆనందః + చిత్ =ఆనందచిత్. ఏకమగు ఆనందచిత్ ఏకానంద చిత్ ; అదియే ఆకృతిగ - స్వరూపముగకలది. సచ్చిదానందబ్రహ్మ రూపలక్షణములుకలది అని అర్థము "విజ్ఞాన మానందం బ్రహ్మ" (బృహ. ఉ. 5-9-28) బ్రహ్మము

విజ్ఞానరూపము ఆనందరూపమైనది: "ఆనందం బ్రహ్మేతి వ్యజానాత్" (తై. ఉ. 3 5) ఆనందమే బ్రహ్మమని తెలుసుకొనవలెను. అని శ్రుతులు. "ఆనందాదయః ప్రధానస్య" (బ్ర సూ. 3-3-11) అని న్యాయము.2 కావున దీప్తస్వరూపమును ప్రకాశాత్మకమునగు పరమానందస్వరూపము, జీవన్ముక్తినొంది నపుడు, పరమాత్మజ్ఞానమొందిన పురుషులకు అనుభవరూపమున ప్రత్యక్ష ప్రమాణ గోచరమగును. అట్టి గోచరత్వ మీమెకు కలదు: లేక, ఏకేషాం=అనుభవమొందిన కొందరకు అనగా యోగులకు, ఈమె ఆనంద సాక్షాత్కారరూపమగు ఆకృతి, అనగ నిరావరణ ప్రకాశరూపమగు ఆకృతికలది. లేక, ఆనందః=చిత్ = పర మేశ్వరుడు, ఏకము= మూర్తిభేదరహితమగు ఆనందచిత్తు ఆకృతికలది:

ఓం ఏకానందచిదాకృతయేనమః

(1) తార్కికుల మతమునందు జీవాత్మ అని పరమాత్మ అని ఆత్మ ద్వివిధముగ చెప్పబడినది. వేదాంతులకు ఆత్మ ఏకరూపమే.

(2) ఆనందాదిధర్మములు ప్రధానమగు బ్రహ్మమునందు సర్వేసర్వత్ర ఉండును. అని ఈ సూత్రమునకు అర్థము.

---

ఏవమిత్యాగమాబోధ్యా చైకభక్తిమదర్చితా
ఏకాగ్రచిత్తనిర్ధ్యాతా చైషణారహితాదృతా ॥ 6

[26] ఏవమిత్యాగమాబోధ్యా :- (ఈమె ఇట్టిదని ఆగమములచే చెప్పబడలేదు) వెనుకటినామము (25)లోని ఆనందశబ్దమున కీవిధముగ (పూర్వపక్షమున) అర్థము చెప్పవచ్చును:- ఆనందశబ్దము లక్షణముచే ఆనంద మయమగుదానిని చెప్పును. "య ఏకో జాలవాన్ ఈశత ఈశనీభిః" (శ్వే. ఉ. 3-1) ఒక్కడై యున్నట్టి ఎవడు మాయనవలంబించి స్వశక్తులచే పాలించునో, అను శ్రుతిచేత చెప్పబడిన ఏకత్వము జీవునియందుకూడ సిద్ధించును. కావున ఏకమగు ఆనందము, (అనగ జీవునియొక్క ఆనందము) దానియొక్క చిత్.

అనగ అధిష్ఠానప్రకాశ చైతన్యము: దానిని ఆకృతిగకలది: అని అర్థము చెప్పవచ్చును కదా! "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" (తై. ఉ. 2-5-2) బ్రహ్మము, పుచ్ఛమువలె ఆధారమైయున్నది) అను శ్రుతియందు పుచ్ఛమను శబ్దముచే అధిష్ఠాన అట్టి ప్రకాశచైతన్యమే పరామర్శింపబడుచున్నదిగదా! ఇట్లున్నపుడు ప్రకాశకము ప్రకాశ్యము (ప్రకాశింపచేయబడునట్టిది) యొక్క నిత్యత్వమునపేక్షించుచున్నది. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" ఇత్యాది బ్రహ్మస్వరూపలక్షణవాక్యములందు వాచ్యార్థ ప్రాధాన్యముననే విధి రూపముననే బ్రహ్మము ప్రతిపాదింపబడుచున్నది: బ్రహ్మకాని దానిని వ్యావృత్తి నొనరించుటకై (తొలగించుటకై) నిషేధరూపమున లక్షణార్థ ప్రాధాన్యమున (బ్రహ్మము) చెప్పబడుచున్నది: బ్రహ్మస్వరూప లక్షణ ప్రతిపాదన పరముగనే తత్త్వమస్యాది వాక్యములందలి వైశిష్ట్యము వాక్యార్థముగ సంభవించుచున్నది. (కావున బ్రహ్మము విధిముఖముననే ప్రతి పాదించుచున్నది), అని చెప్పిన-అది సరికాదని "ఏవమిత్యాగమాబోధ్యా" అను నామముచే చెప్పబడుచున్నది.

"ఏవం" అని, ఇటి విశేషణముకలదని ప్రత్యక్షసిద్ధముగ ఆగమములచే వేదములచే ఈమె చెప్పబడలేదు: ఆ విధముగ ఈమె జ్ఞాపక మొనరింపబడలేదు. ఆనందశబ్దము ఆనందమాత్రమునే చెప్పును ఆ శబ్దమును ఆనందప్రాచుర్యము (ఆధిక్యము) కలిగి ఈషద్దుఃఖముకూడ కలదని సంభావింపబడిన జీవునియందు వర్తింపజేసినయెడల మూడు దోషములు కలుగును. పారమార్థికమగు బ్రహ్మము కంటె భిన్నమగు మరియొకవస్తువు లేనందున, తత్త్వంపదముల వాచ్యార్థమందున్న విశేషణద్వయమునకు అన్యోన్య విరోధము కలుగుచున్నందున వానియందు తమస్సు ప్రకాశమువలె నుండి వైశిష్ట్యములేకుండగనే అఖండార్థము, వాక్యార్థముగ కలుగును. కావున ఇట్లు చెప్పుటకు వీలులేదు. "అతోన్యదార్తం" (బృహ 5-॥-28) బ్రహ్మముకంటె భిన్నమైనది మిథ్య. అను శ్రుతిచే, (బ్రహ్మముయొక్క) స్వరూపలక్షణములు చెప్పునట్టి వాక్యముల వాచ్యార్థమునకు మిథ్యాత్వము ప్రతి పాదింపబడినది: కావున నిషేధముఖముననే, బ్రహ్మముకానిదానిని వ్యావృత్తి నొనరించునట్టి ప్రతిపాదనముననే లక్షణవాక్యములు సమంజసము లగునని భావము 1

ఓం ఏవమిత్యాగమాబోధ్యాయై నమః

[27 ఏకభక్తి మదర్చ్ని :-

(ఏకభక్తి కలవారిచే అర్చిత) ఏకమగు; అభిన్నమగు భక్తి - జీవుని యందు - బ్రహ్మమునందుభక్తి అనగ భజింపవలెనను బుద్ధి. ఏకభక్తికలవారు. ఏకభక్తిమంతులు - వారిచే అట్టి పరిజ్ఞానకలవారిచే అర్చిత - పూజిత. అర్చనము స్తుతిధ్యాన నమస్కృతులకుపలక్షణము. "యన్మనసా ధ్యాయతి, తద్వాచా వదతి తత్కర్మణా కరోతి" (నృ. ఉ. తా-1) దేనిని మనస్సుతో ధ్యానించునో దానినే వాక్కుచే వచించును., దానినే కర్మచే చేయును, అని శ్రుతి; కావున ఇతరింద్రియ కర్మములన్నియు మానసిక వ్యాపారపూర్వకములని అభిప్రాయము. లేక, ఈ సంసారమండలములలో ఈ దేవతయొక్క స్వరూపము నెరింగినవారికి కలభజనీ యత బుద్ధి - భక్తి సగుణబ్రహ్మవిషయములలో ఏకప్రవీణత ఆగు ఈభక్తి 1 అష్ట విధములు అట్టి ఏకభక్తికలవారిచే అర్చిత - అంతర్యాగ బహిర్యాగ మహాయాగ 2 ప్రకారములచేపూజిత అని అర్థము.

(1) తత్ పదమునందలి ఈశ్వరవిశేషణము, త్వం పదమునందలి జీవవిశేషణము - ఈ రెండును విశేషణద్వయము. ఈశ్వరవాచకమగు తత్పదమందలి చైతన్యము. జీవవాచకమగు త్వం పద మందలి చైతన్యము ఏకమనినపుడు అఖండార్థము కలుగును. అఖండార్థ మనగ భేదరహితమగు అర్థము. తత్త్వమస్యాదివాక్యములచే జీవుడు బ్రహ్మభిన్నుడని లక్షణచే చెప్పబడుచున్నది. జీవునియందలి జీవత్వ ఘటగమగు అజ్ఞానము తొలగించి కేవల చైతన్యస్వరూపను కనుగొని నపుడు జీవబ్రహ్మైక్యము కలుగుచున్నది. బ్రహ్మస్వరూపలక్షణములు శ్రుతియందు విధిముఖమున చెప్పబడలేదు: నిషేధముఖముననే చెప్పబడి నవి. బ్రహ్మము కేవల మానందస్వరూపమే: ఆనందమయుడు, ఆనంద ప్రాచుర్యముకలిగినట్టివాడు కాదు.

4] Farm

ఓం ఏక భక్తి మదర్చితాయై నమః

[28] ఏకాగ్రచిత్తనిర్ధ్యాతా :-

(ఏకాగ్రచిత్తముకలవారిచే నిర్ధ్యాత) ఏకము - ఐక్యరూపమగు, అగ్రము ఆలంబనము, అనగ విషయము విజాతీయా భావలిఎస్కారపూర్వకమును, సజాతీయవృత్తికలిగినదియు, నిరంతరవ్యాప్తికి విషయమునగు చైతన్యము కలయట్టి అంతఃకరణము కలవారిచే ఈమెనిర్ధ్యాత—

యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, అధ్యాన, ధారణ, సమాధులయొక్క పరిపాకాతిశయమువలన కలుగు ఆసంప్రజ్ఞాతసమాధికి మూడు భూమికలు కలవు— [3]ఋతంభరా, ప్రజ్ఞాలోకా ప్రశాంతవాహితా.

[1] "శ్రవణం కీర్తనం విష్ణోఃస్మరణం పాదసేవనమ్, అర్చనం వందనం దాస్యం సఖ్యమ్ ఆత్మనివేదనమ్" అని శ్రీమద్భాగవతమునందు( -5-2) విష్ణుభక్తి నవవిధములుగ చెప్పబడినది. కొన్ని పురాణములతో అష్ట విధములుగ చెప్పబడినది.

[2] అంతరంగపూజ అంతర్యాగమనియు, బహిరంగపూజ బహిర్యాగ మనియు, ఈ ఉభయులను అధికారిభేదముచే చేయుట మహాయాగ మనియు ప్రసిద్ధములు. మూలాధారమునుండి సహస్రారమునకు కుండలిని గొనిపోయి అమృతపాన మొనరించి మరల స్వస్థానమునకు తెప్పించుట అంతర్యాగము,

[3] నిర్విచారుడై సమాహితచిత్తుడై యున్న యోగికి కలుగునట్టిప్రజ్ఞను ఋతంభర అందురు. అనగ—సత్యమును ధరించునట్టిప్రజ్ఞ ధ్యాన మునందు త్రిపుటి నశించునపుడు సమాధి కలుగును:
అపుడు ప్రజ్ఞాలోక అనుస్థితి కలుగును. అనగ అట్టి యోగియొక్క ప్రజ స్వచ్ఛమగును. నిరోధసంస్కారాభ్యాసపాటవముచే వ్యుత్థానసం స్కారములు నశించునపుడు చిత్తము వాసనారహితమగును అంతట ప్రశాంత వాహిత అను భూమిక కలుగును — అని యోగ దర్శనము.

[1] ఋతంభరా — ఋతమును — అనగ యదార్థమగు సచ్చిదానంద లక్షణమగు బ్రహ్మమును వృత్తివ్యాప్తిచే భరించును. అనగ విషయీకరించును. కావున ఋతంభరా: ఇది ప్రథమ భూమిక. "ఆత్మన్యేవ వశం నయేత్" (భ గీ. 6-26) మనస్సును ఆత్మవశము చేయవలెను అని భగవద్వాక్యము.

[2] ప్రజ్ఞాలోక - ప్రజ్ఞ అనగ బ్రహ్మవిషయమగు అఖండాకారవృత్తి: ఇది నిత్య నిరంతరాభ్యాసముచే పరిపాకమొందక ఆవరణాజ్ఞానము నశించును. "ప్రజ్ఞా ప్రతిష్ఠా" అని శ్రుతి- బ్రహ్మస్వరూపమగు ప్రజ్ఞయొక్క ఆలోకము అనగ సాక్షాత్కారము - అది దేనియందు కలుగుచున్నదో అది కారణవిజ్ఞానము. "యస్మిన్ విజ్ఞాతే సర్వ మిదం విజాతం భవతి" (ము. ఉ. 1.3) ఏదివిజ్ఞాతమగునో, అని శ్రుతి చెప్పినందున అట్టి ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము కలుగును. అట్టి విజ్ఞానమందు అధ్యస్తమైన (ఆరోపితమైన) సర్వజగత్తును చూడవలెనని ప్రారబ్ధవశమున నెవరికైన చిత్తమున కోరిక కలిగినయెడల, వారికి చైతన్యప్రకాశముతో ప్రకాశితమై అశేషమగు జగత్తు, స్వప్నమందలి పదార్థమువలె, కనిపించును. అట్టి అనుభవము భరద్వాజాదులకు కలదని పురాణాగమ ప్రమాణములచే మనకు తెలియుచున్నది ఈ భూమి యందలి సంస్కారమాత్రరూపమగు అంతఃకరణము నిరుద్ధసామర్థ్యముకలదై, వాసనారహితమై నశించినపుడు ప్రశాంతవాహిత యను తృతీయభూమిక కలుగును ప్రశాంతవాహిత—వహ మనగ ప్రవాహము, సంతతవృత్తి ధార - దీనికలది - వాహి వాహి యొక్క భావము వాహితా. ప్రశాంతమగు వాహిత ప్రశాంతవాహిత. లేక ప్రశాంతమగు వాహము కలవి ప్రశాంతవాహి, దీనిభావము ప్రశాంతవాహిత అనిచెప్పవచ్చును. "మనసో వృత్తిశూన్యస్య బ్రహ్మాకారతయా స్థితిః. అసంప్రజ్ఞాతనామేతి సమాధి ర్యోగినాం ప్రియః" "మనస్సు వృత్తిశూన్యముగ బ్రహ్మాకారముతో నున్నపుడు అసంప్రజ్ఞాత" అను పేరుకల సమాధికలుగును. అది యోగులకు ప్రియము" అని వచనము. "ప్రశాంతమనసం హ్యేనం" (భగ. 6-27) "శాంత మొందిన మనస్సు కలవానిని" అని భగవద్వచనము. పృథివ్యాప్తేజోఽనిలఖే సముత్థితే పంచాత్మకే యోగగుణే ప్రవృత్తే న తస్య రోగో న జరా న మృత్యుః ప్రాప్తస్య యోగాగ్ని మయం శరీరం" (శ్వే. ఉ 2-12), పంచభూతములు సముత్థితములైనపుడు అనగ పంచాత్మకమగు యోగగుణములు ప్రవృత్తములైనపుడు [1]ఆయోగియొక్క శరీరము యోగాగ్నిమయమగును. అపుడువానికి రోగము,జర, మృత్యువు ఉండవు-అని శ్రుతి:

(1) యోగికి పంచభూతములయొక్క గుణములు కలుగును. అనగ గంధవతి అగు పృథివియొక్క గంధము కలుగును. అట్లే ఇతర భూతముల గుణములు ప్రవృత్తములగును. ఆ విధముగ కలిగినపుడు జరాదులుండవు అని శ్వేతాశ్వతరో పనిషత్తులో చెప్పబడినది.

పైనజెప్పిన లక్షణములుకల సాధనపరిపాకవశమున ఇవి కలుగును. అట్టియోగులచే ఈమె నిర్ధ్యాత- ధ్యానము నిర్గతమగును కావున నిర్ధా భేదము స్ఫురింపనపుడు ధ్యాతకుధ్యానవిషయముండదు; స్వరూపమే ప్రకాశించుచుండును. "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" బ్రహ్మము నెరిగినవాడు బ్రహ్మమగునని శ్రుతి. నిధ్యాతా అను పాఠమున ని = నితరాం = అత్యంతము శ్రవణమననిదిధ్యాసనములచే సాక్షాత్కృతి అని అర్థము.

ఓం ఏకాగ్రచిత్తనిర్ధ్యాతాయైనమః

[29] ఏషణారహితాదృతా ;—

(ఈమె ఇచ్ఛలేనివారిచే ఆదరింప బడి) ఏషణ అనగ ఇచ్ఛ, ఇది మూడువిధములు: ఈ లోకమునుజయించుటకై పుత్రైషణ, పితృలోకజయసాధన మగు కర్మసంపాదనకై విత్తైషణ; ఉపాసనాదులచే జయింపబడునవి దేవలోకము, అందు ఇచ్ఛలోకైషణ; వీనిచే రహితులు అనగ ఆకర్షింపబడనిచిత్తము కలవారు ఏషణారహితులు. "తేహస్మ పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణా యాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి" (బృహ ఉ, 5 5) ఆత్మనెరిగినవారు పుత్రైషణ, లోకైషణలను వదలి భిక్షాచర్యము నవలంబింతురు" అని శ్రుతి. ఏషణారహితులను పరమహంస పరివ్రాజకాచార్యులు నగు సన్యాసులచే ఆదరముగ అతిశయప్రేమతో స్వరూపమున ఆదృత, అనగ అంగీకృత. ఈమె నిరంతర ధ్యానమున సాక్షాత్కృతయై మోక్షరూపమున ప్రాప్త మగుచున్నది అని అర్థము.

ఓం ఏషణారహితాదృతాయైనమః

ఏలాసుగంధిచికురా చైనఃకూటవినాశినీ
ఏకభోగా చైకరసా చైకైశ్వర్యప్రదాయినీ. 2

[30] లాసుగంధినికురా :-

(ఏలకులవలె సుగంధము కలిగిన చికురములు కలది) ఏలా— ఏలకివలె- అని దృష్టాంతప్రదర్శనము సౌగంధ్యమాత్ర సద్భావప్రదర్శనమున అకృత్రిమగు దివ్యపరిమళమును కలిగియుండుటకు హేతువు చెప్పబడినది. బ్రహ్మము స్వాధీన మగు మాయకలదికావున ఈ దృష్టాంతము ప్రాకృత సౌగంధ్య ప్రదర్శనపరము కాదు. "ఏలవలె సుగంధము" అనినపుడు సాజాత్యముమాత్రమే చెప్పబడు చున్నది. గుణమాత్రగ్రహణమునకై మరియొక పదార్థము దృష్టాంతముగ ఇందు చెప్పబడినది. సుగంధముకలది సుగంధి, సుగంధములగు చికురములు— కుంతలములు - ఈమెకు కలవు. కావున ఈమె ఏలాసుగంధిచికుర — చికుర పదముయొక్క ఉపలక్షణత్వమువలన స్వభావసిద్ధమగు దివ్యపరిమళము కలిగిన సర్వాంగములయొక్క సౌరభ్యముకలది" అని అర్థము కలుగుచున్నది.

ఓం ఏలాసుగంధిచికురాయై నమః

[31] ఏనఃకూటవినాశినీ :—

(పాపములకూటమును ఈమె నశింపజేయును) ఏనస్సులయొక్క పాపములయొక్క, కూటము - సముదాయము. ఆగామి సంచిత ప్రారబ్ధభేదమునను సమిష్టిరూపమునకు పొందిన కర్మఫలము దృఢతరమగు తత్త్వజ్ఞానము లేకున్న అనుభవముచేతనే క్షయమొందును. కల్పకోటికాలము ఇట్లు కర్మఫలానుభవమును పొందుచు నుండకుండ వానిని క్షయమొందింపదలచిన వారికి బ్రహ్మాత్మైకజ్ఞానము కలిగినయెడల అట్టిచైతన్యము కర్మఫలానుభవము లేకుండగనే దానిని నశింప చేయును. కావున ఈమె బ్రహ్మజ్ఞానము కలవానికి పాపమంటదు. "అశరీరం వావ సంతం ప్రియాప్రియే న స్పృశతః: అశరీరముగ నున్నవానిని ప్రియాప్రియము లంటవు. (ఛా. ఉ. 8-12-1 అనిశ్రుతి. "అహం త్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి" (భ. గీ. 18-66) నేను నిన్ను సర్వపాపములనుండి విడిపింతును, అని స్మృతి. లేక ఏనస్సులుపాపములు: వానికి కారణీభూతములగు కూటమును, అనగ కపటవచనములు పలుకుటను దానికి కారణమగు మాయను ఈమె నశింప చేయును కాన ఈమె ఏనఃకూటవినాశిని.

ఓం ఏనఃకూటవినాశిన్యై నమః

[32] ఏకభోగా :-

(ఏకభోగముకలది) ఏకేన = కామేశ్వరునితోడ, భోగము = భుక్తి, అనగ స్వస్వరూపానందానుభవము కలది. లేక, ఏకస్య = అజ్ఞానము తత్కార్యము, ఇవి కార్యకారణరూపమున అభిన్నములు, కావున ఏకము అని చెప్పబడినవి: దానియొక్క భోగము కలది, అనగ అధిష్ఠానరూపమున, స్వసత్తాదాయకరూపమున-పరిపాలనము ఈమెకు కలదు. అనగ ప్రపంచముయొక్క ఉత్పత్తిస్థితినాశహేతువగు మాయోపాధిక చైతన్యమీమెయేయని అర్థము. "ఏకాకీ న రమతే తత శ్చ పతిశ్చ చాఽభవతామ్"(బృహ. ఉ. 1-4-3) ఒంటరిగ నున్నవాడు రమింపడు, అందువలన (బ్రహ్మము) దంపతీ రూపమొందెను" అని పురుషవిధ బ్రాహ్మణ వచనము. ఇట్లు దంపతులకు ఇచ్ఛాపూర్వకమగు భేదమును చెప్పినందున పరమార్థమున ఆ స్వరూపము ఏకచైతన్యరూపమని అర్థమగుచున్నది; కావున అట్టి ఉభయభోగములు ఏకభోగమే, అట్టిది కలది కావున ఈమె ఏకభోగ అని చెప్పవచ్చును.

ఓం ఏకభోగాయై నమః

(33) ఏకరసా :-

(ఏకరసము కలది) ఏకము = అభిన్నమగు, రసము = సామరస్యము కలది. "రసం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి" (తై. ఉ. 2-7-1) రసము నొందియే అతడానందియగుచున్నాడు, అని శ్రుతి. లేక, ఏకరసమనగ నవరసములందు ముఖ్యమగు శృంగార రసము, దానిని ఈమె కలిగియున్నది, లేక, ఏకేన= పరమేశ్వరునిచే, ఈమెయందు కలుగచేయబడుచున్న ప్రీత్యతిశయరూపమగు రసము; అట్టి రసము విషయముగా కలది ఏకరస. లేక, ఏకస్మిన్ = తనభర్త యందు, రసము = నిరతిశయ ప్రీతి - అనురాగ సంజ్ఞ కలది అని అర్థము. లేక షడ్రసములందు ముఖ్యమగు మధురరసము ప్రియముగ కలది. మధురరసము సత్త్వ గుణప్రధానులకు ప్రియము కావున, ఈమె సత్త్వగుణ ప్రధాన మాయోపాధికమగు చైతన్యరూపముకలది అని అర్థము కలుగుచున్నది. "రస్యా స్నిగ్ధాః స్థిరా హృద్యాః

ఆహారాః సాత్త్వికప్రియాః" (భ. గీ. 17-8) రస్యములు స్నిగ్ధములు హృద్యములనగు ఆహారములు సాత్త్వికప్రియములు, అని భగవద్వచనము.

ఓం ఏకరసాయై నమః

[34] ఓం ఏకైశ్వర్యప్రదాయినీ :-

(ఏకమగు ఐశ్వర్యము నిచ్చునట్టిది.) ఈశధాతువు ప్రేరణార్థకము. ఈశ్వరుడనగ అంతర్యామి రూపమున అన్నిటిని ప్రేరేపించునట్టివాడు. "యః సర్వేషు భూతేషు తిష్ఠన్ యః సర్వాణి భూతాన్యంతరో యమయతి" (బృహ 5–7–15) ఎవడు సర్వభూతములలోనుండి వానిని ప్రేరేపించునో, అని శ్రుతి. ఇట్లు ఈశ్వరప్రేరితులగు జీవులు భూతశబ్దవాచ్యులు; అజ్ఞానము తత్కార్యమగు అంతఃకరణము అనునట్టి ఉపాధియందు ప్రతిబింబించిన చైతన్యరూపులు, జాగ్రదాద్యవస్థాభిమానులు ఈ జీవులు అఖండ బ్రహ్మసాక్షాత్కార సమయమునందు అభేదానుభవము నొందుదురు. "తత్త్వమసి" అని శ్రుతి. "ఏకమేవాద్వితీయం" అని శ్రుతియందు ఏకము అద్వితీయమని విశేషింపబడినది. 1 కావున ఏకమగు ఈశ్వరుడు. ఏకేశ్వరుడు వానియొక్క భావము ఏకైశ్వర్యము, అట్టి ఐక్యము నిచ్చునట్టిది ఏకైశ్వర్యప్రదాయనీ లేక, విద్యాధనములు కలిగియున్న అనేకులలో ఒకరిని విద్యాధనములు కలవారని చెప్పినపుడు ఆ యొక్కరియొక్క ఆధిక్యము తెలియుచున్నది. అట్లే ఏకమగు అనగ నిరతిశయమగు అణిమాదికమగు అష్టఐశ్వర్యము నిచ్చునట్టిది: నిశ్శ్రేయసము నిచ్చునట్టిది కావున ఈమె ఏకైశ్వర్యప్రదాయని, లేక ఏకము = మానుషమును, సర్వోత్కృష్టమును, సార్వభౌమద్యాదిలక్షణమును అభ్యుదయ రూపమునగు ఐశ్వర్యము నిచ్చునట్టిది అని చెప్పవచ్చును.

ఓం ఏకైశ్వర్యప్రదాయిన్యై నమః

ఏకాతపత్ర సామ్రాజ్యప్రదా చైకాంతపూజితా।
ఏధమానప్రభా చైజదనేకి జగదీశ్వరీ ॥ 8

[35] ఏకాతపత్ర సామ్రాజ్యప్రదా :-

(ఏకచ్ఛత్రాధిపత్యము నిచ్చునట్టిది) ఆ + తపము = ఆతపము. ఆ = అనగ అధ్యాత్మ. ఆధిదైవత, అధిభూతములు, వీనివలన కలిగిన తాపములు

ఆ+తపములు. తపింప చేయునట్టివి, శోషింపచేయునట్టివి తపములు, తపముల నుండి రక్షించునది ఆతపత్రము, అనగ సర్వసంసార దుఃఖమును ఉపశమింప చేయునట్టి ఆత్మజ్ఞానము. "యాజ్ఞాత్వా న పున ర్మోహ మేవం జాస్యసి" (భ.గీ. 4 35), దేనిని తెలిసుకొని మరల ఇట్టి దోషమును పొందవో అని భగదవద్వాక్యము. అఖిలదుఃఖములకు నిదానమగు (అదికారణమగు) అనజ్ఞామును పోగొట్టునది ఏకము - అది లక్షణచే, అభిన్నమగు బ్రహ్మము విషయముగ కలది. ఏక మగు ఆతపత్త్రిము అఖండాకార జ్ఞానము: అట్టి ఏకాతపత్రము వలన కలుగు

(1) ఏకమనగ సజాతీయ స్వగతబేదము లేనిది, అద్వితీయమనగ విజాతీయ భేదము లేనిది.

సామ్రాజ్యము; సమ్రాట్టుయొక్క భావము సామ్రాజ్యము అనగ సర్వోత్తమత్త్వము దాని నిచ్చునట్టిది, లేక ఏకాతపత్ర సామ్రాజ్యమనగ చక్రవర్తిత్వము: దాని నిచ్చునట్టి కావున ఏకాతపత్ర సామ్రాజ్యప్రద.

ఓం ఏకాతపత్త్రి సామ్రాజ్యప్రదాయై నమః

[36] ఏకాంతపూజితా :-

(ఏకాంతమున పూజిత) ఏకము=అద్వితీయము అనగ శోధితతత్త్వం పదార్థము (తత్త్వ పదార్థము లొక్కటేనని శోధింపబడినది) దానియొక్క అంతము, అనగ ఉపాధి: పరిచ్ఛేదకమగుటవలన ఏకాంత మనగ హృదయము అని అర్థము. హృదయమందు ఈమె పూజిత. అనగ, నేనే, అని (పూజించువానిచే) అపరోక్షీకరింపబడినది. "యత్సాక్షా దపరోక్షాద్ బ్రహ్మ" (బృహ. ఉ. 5-4-1) బ్రహ్మము సాక్షాత్ స్వరూపము, పరోక్షమగునది కాదు, అని శ్రుతి, లేక, ఏకస్య=ఏకమగు బ్రహ్మముయొక్క అంతే=సమీపమున. పూజిత కావున ఏకాంత పూజిత, ఉపనిషత్ అనుశబ్దము సద్ అను ధాతువు నుండి నిష్పన్నమైనది. సద్ - ధాతువు గతి. అవసానము అను అర్థములు కలది. ఉప అనగ సమీపము. ఉపనిషత్ అనగ బ్రహ్మమాత్రత అని పర్యవసాన మగుచున్నది. కావున ఈమె ఏకాంత పూజిత అనగ ఉపనిషత్పూజిత. లేక, "గుహానివాతాశ్రయేణ ప్రయోజయేత్" (శ్వే. ఉ. 2-10) గుహ మొదలైన నివాతాది స్థలములందు

ధ్యానముచేయవలెను. అని శ్రుతిః కావున ఏకాంతమున, ఏకాంతస్థలమున యోగులచే ధ్యానాదులచే విషకయీకృత, అని అర్థము. లేక, కామేశ్వరునిచే ఏకాంతమున శ్రీలింగమున పూజిత. సంప్రదాయప్రవృత్తికొరకు ఆదియందు ఈశ్వరునిచే ఆదిమసాధనమున బహిర్యాగక్రమమున సప్తాహ్యాదియందు సంతోషిత అని భూతార్థమిట తెలియ చేయబడుచున్నది లేక, ఏకాంతమున, సర్వము ప్రవిలాపన మొందు సమయమున. పూజిత, ధ్యానాదులచే సంపాదిత. అనగ సాక్షాత్కృత. "కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్ ఆవృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్ - ఒకానొక ధీరుడు అమృతత్వమును కోరుచు అంతర్దృష్టికలిగి ప్రత్యగాత్మను కనుగొనెను. (కఠ. ఉ. 2- -1)

ఓం ఏకాంత పూజితాయై నమః

[37] ఏధమానప్రభా :-

(వృద్ధినొందుచున్న కాంతిగలది) ఏధమానము వివర్ధమానము, సర్వాతిశాయిని అగుప్రభ - కాంతి; ఇట్టి కాంతి ని కలది. "త మేవ భాంతమను భాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి" (కఠ ఉ. 2-5-15) భాసించుచున్న బ్రహ్మమును అనుసరించియే సర్వము భాసించుచున్నది, వాని కాంతిచే సర్వము భాసించుచున్నది అని శ్రుతి.

ఓం ఏధమానప్రభాయై నమః

[38] ఏజదనేకజగదీశ్వరీ :-

(సర్వ ప్రపంచమునకు ఈశ్వరి) ఏజత్= కంపించునట్టివి చేష్టమానములు, అనగ జీవించునట్టివిః అనేకములు, నానోపాధికము లగుటచే అనేకములు జగత్తులు, అనగ జంగమములు చరించునట్టి ప్రాణులు, ఏదజనేకజగత్తులు; వానికి ఈశ్వరి. ఈష్టే-ప్రేరేపించును కనుక ఈశ్వరి; స్థావరములకు [చెట్లు మొదలైనవానికి] సుఖదుఃఖములు నొందుట పరిహరించుట, గ్రహించుట మొదలగు ఉపాయములు తెలియనప్పటికిని వానియందు స్వజీవన హేతుభూతములైన ఉదకపానాది ప్రవృత్తి కనబడుచున్నందున అవియు చేష్టా

వంతములే: కావున జగచ్ఛబ్ద మిక్కడ సర్వప్రపంచ పరముగ నున్నది. ఈ విధముగ అర్థము చెప్పకున్న "సర్వేషు భూతేషు" [సమస్త భూతములందుండి ఎవడు నియమించుచుండునో] అను శ్రుతియందు సర్వభూతములంను అనినపుడు "చరప్రాణిమాత్రమునందు" అని సంకుచితార్థము చెప్పవలసివచ్చును. విరోధము లేనప్పుడు సామాన్యవాచకశబ్దమునకు విశేషలక్షణము చెప్పుట న్యాయమైనదే. ఈ విధముగ అర్థము చెప్పకున్న బ్రహ్మముయొక్క ప్రపంచమాత్రోత్పత్త్యాది హేతుత్వము సంకుచితమగును. కావున నామావళియందు ఏజత్ పదము గ్రహింప బడినది. ప్రాణిమాత్రులకు క్రియాశ్రయత్వమున, అన్నిటికి హిరణ్యగర్భాశ్రయత్వ మున ఏ యోయొక విధముగ ప్రేరణచేయు శక్తినీమె కలిగియున్నదని భావము.

ఓం ఎజదనేకజగదీశ్వర్యై నమః

ఏకవీరాదిసంసేవ్యా చైకప్రాభవశాలినీ ।
ఈకారరూపా చేశిత్రీ చేప్సితార్థప్రదాయినీ॥ 9

[39] ఏకవీరాదిసంసేవ్యా :-

(ఏకవీరాదులచే సంసేవ్య) ఏకః=ఇతర సాధారణుడు కానట్టి, వీరుడు-ఏకవీరుడు: పురశ్చర్యాదులచే మంత్ర దేవతా సాక్షాత్కా రమునొంది పురుషార్థము నొందిన పురుషుడు; విజయము నొందిన అభ్యుదయశాలి. ఆయా దేవతల నుపాసించు పురుషులు రాజరాజులందుండు ధైర్యగాంభీర్యాది గుణములను కలిగియుందురు; కావున వారు వీరులనబడుచున్నారు లేక, ఏక వీరాదులను శక్తులను కలిగియున్న ప్రాణికోటులు ఏకవీరాదులు అట్టి శక్తిసమూహ ముచే ఈమె, సంసేవ్య—సేవింపదగినది. భక్తుల ననుగ్రహించునపుడు ఈశ్వరి సగుణవిగ్రహము కలిగియుండును: అపుడామె అనేక—పరివార దేవతలచే పరిసేవింప బడుచుండును. అట్టి మంత్రదేవతా రూపమున ఈమె నుపాసింపవలయునని అర్థము. లేక, ఏకవీర అనగ రేణుక. 1 రేణుక, 2 శ్యామల మొదలగు శక్తులు ఏకవీరాదులు. వీరు ఆయాసములందు వారివారి పీఠములందుండి 3 ఉపాసకులకు అభీష్ట వరప్రదానము చేయుచుందురు. ఉపాసకులకు అభీష్ట వరప్రదానములను స్వయముగ నీయగల ఈ రేణుకాది శక్తులు పరదేవతకు పరిచారకులని చెప్పుటచే ఈమెయొక్క మహిమాతిశయము వ్యక్తమగుచున్నది.

ఓం ఏకవీరాదిసంసేవ్యాయై నమః

[40] ఏకప్రాభవశాలినీ ;-

(ఏకమగు ప్రాభవముచే శోభించునట్టిది) ప్రభువుయొక్క భావము ప్రాభవము - అనగ రక్షకత్వము. ఏకమనగ ఇతర సాధారణము కానట్టిది. ఏకమగు ప్రాభవము - ఏకప్రాభవము, దానిచే శోభించునట్టిది ఏక ప్రాభవశాలిని - లేక ప్రాభవపదము నియమింపబడు వస్తువు నపేక్షించునట్టిదగుటవలనను, ఏకపదము అనన్యగామి (మరియొక వస్తువు నపేక్షింపనిది) అగుటవలనను ఈ రెండు పదముల యొక్క సామాన్యాధికరణ్యాస్వారస్యమును పర్యాలోచనచేయగ ఈ క్రింది అర్థము సూచింపబడుచున్నది. నియమింపబడు లోకము యొక్క పుట్టుక నియామకుని ప్రాభవము లేకుండ సంభవింపదు: కావున, అర్థాపత్తిచే, చైతన్యమునందు అంతర్గతమును, దానియొక్క కార్యమునగు జగత్తు నియమ్యమైన వస్తువుగ సిద్ధించుచున్నది. అందువలన, వటబీజమునందు వృక్షమువలె (చైతన్యమునందు) అంతర్గతమైయుండి తరువాత కలుగుచున్నట్టి కార్య వస్తువగు జగత్తును తనయందు కలిగియున్న కూటస్థ చైతన్యమీమెయని ఈ నామముచే అర్థము కలుగుచున్నది లేక, ప్రాభవమనగ ఈశ్వరత్వము: దీనిచే కల్పింపబడు నియమ్యజగత్తు, ఉపలక్షణరూపమున, ఏ అఖండ చైతన్యమునకు కలదో అది ఏకప్రాభవము. "పాదోఽస్య సర్వా భూతాని (ఛా, ఉ. 3-12-6) సర్వభూతములు బ్రహ్మము యొక్క అంశములు" - అని శ్రుతి. 'ఏకాంశేన స్థితో జగత్' (భ గీ. 10-42) బ్రహ్మముయొక్క ఏకాంశమున ఏకపాదమున జగత్తు స్థిరమైయున్నది: అని స్మృతి. పూర్వమే యున్నదియును, తనయందున్న ప్రాభవముచే తెలియబడుచున్నదియును నగు సచ్చిచైతన్య రూపమును (శాలతే) ఆవిష్కరించును కావున ఈమె ఏకప్రభావశాలిని. లేక, ఏక

(1) ఆదిత్యుని యందున్న శక్తి రేణుక అని గీర్వాణేంద్ర విరచిత ప్రపంచ సార సంగ్రహము.

(2) లలితాదేవి బుద్ధినుండి ఉత్పన్నమైన శక్తి శ్యామల - ఈమె మంత్రిణి - అని లలితోపాఖ్యానమునందున్నది.

(3) ఏక పంచాశత్పీఠములలో ఏకవీరపీఠమొకటిగ ప్రపంచసార సంగ్రహములో నున్నది.

మగు ప్రాభవము, ఏకప్రాభవము. ఏక ప్రాభవము, అనగ ముఖ్యమగు సార్వభౌమత్వము. సవిశేషమగు ప్రభుత్వ పరంపరకు ఎక్కడనో ఒకచోట పర్యవసానముండవలెను. 'ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతి రేషభూతపాలః' (బృహ. ఉ. 6 - 4- 22) ఇతడు సర్వేశ్వరుడు, భూతాధిపతి, (యముడు) భూతపాలుడు (ఇంద్రుడు) అని శ్రుతి చెప్పినందున, అంతర్యామి రూపత్వమునను, సాక్షాత్కారమును కలిగించు యుక్తి చేతను వాక్కు మొదలైన అవయవముల యొక్క ప్రేరణాతిశయములకు ఇందే (బ్రహ్మమునందే) పర్యవసానము కలుగుచున్నదని అభిప్రాయము నిరంకుశ స్వతంత్ర జగత్కారణత్వరూపయు, తటస్థ లక్షణ- లక్షిత వేదాంత సమన్వయమునకు విషయభూతయు, అఖండ సచ్చిదానంద రూపయునగు పరదేవతను స్వస్వరూపముననే ధ్యానింపవలెనని నిష్కృష్టా ము.

ఓం ఏకప్రాభవశాలిన్యై నమః

[41[ ఈకారరూపా ;—

(ఈకారము రూపముగ కలది) మంత్రమందలి తృతీయావయవమగు ఈకారమును ఈమె రూపముగ కలిగియున్నది.

ఓం ఈకారరూపాయై నమః

[42] ఈశిత్రీ :—

(ఈశ్వరి) ఇచ్ఛతి అనగ కోరికను కలిగించునది. ఈష్టే అనగ ఈశ్వరత్వము కలది: ఈ ఉభయమును ఈమెయే అనగ ఈమె సర్వప్రేరిక.

ఓం ఈశిత్ర్యై నమః

[43] ఈప్సితార్థప్రదాయినీ :—

(కోరిన అర్థముల నిచ్చునట్టిది) అర్థింపబడునవి, ప్రార్థింపబడునవి కనుక అర్థములు; అభ్యుదయ నిశ్శ్రేయస రూపములు. ఈప్సితము లనగ పొందుటకు ఇచ్ఛావిషయీభూతములు, పొందగోరినవి. ఈప్సితములగు అర్థములు అని కర్మధారయ సమాసము ఈప్సితార్థముల నిచ్చునట్టిది ఈప్సితార్థ ప్రదాయిని. ఇప్పుడు చేసిన కేవల కర్మములకు కాలాంతరమందు అదృష్టముద్వారా ఫలము కలుగునని మీమాంసకులు చెప్పినమాట సరియైనది కాదు. ఏలన - అదృష్టము.

అచేతనము, అందుచే ఏ ఫలముల నిచ్చుటకును దానియందు సామర్థ్యములేదు భృత్యుడొనరించిన పరాక్రమాది కర్మములచే తుష్టిచెంది, రాజు ఫలములనిచ్చును: అట్లే చైతన్యాధిష్ఠితములగు కర్మములకు ఫలము కలుగును. "కర్మాధ్యక్షః" (శ్వే. ఉ. 6–11) ఆరాధితుడగు పరమేశ్వరుడే కర్మాధ్యక్షుడు అని శ్రుతి. కావున కర్మాధ్యక్షుడును, సర్వజ్ఞుడునగు నీతడు ఆయ కర్మాధికారు లొనరించిన పుణ్యాపుణ్యములకు అనురూపమగు ఫలప్రదానమందు సమర్థుడు. తదితరులకు, చేతనములకు జీవాదులకు కూడ ఈ సామర్థ్యములేదు. కావున ఇతడే ఆయా కర్మాధికారులకు అనుగుణమగు విషయములందు ఇచ్ఛను కలిగించుచు, ఆయా సాధనములను వారిచే నవలంబింపజేయుచు, ఫలములందు వారికి కల కోరికలను పూరించును. ఇట్లు చెప్పినందున దీనిచే అనీశ్వరమీమాంసకుల మతము నిరసింపబడినదని గమనింపవలెను. లేక, ఈప్సిత అనగ జిజ్ఞాసిత: ఈమె స్వస్వరూపక ప్రతిపాదకమగు వేదాంతముల యొక్క శ్రవణమనననిదిధ్యాసనములచే విషయీకృతయై, అర్థమును అనగ ప్రార్థింపబడినదానిని అనగ అందరచే కోరబడుచున్న మోక్షరూపమగు పురుషార్థమును ఇచ్చును.

ఓం ఈప్సితార్థప్రదాయిన్యై నమః

ఈదృగిత్యవినిర్దేశ్యా చేశ్వరత్వవిధాయినీ ।
ఈశానాదిబ్రహ్మమయీ చేశిత్వాద్యష్టసిద్ధిదా॥

[44] ఈదృగిత్యవినిర్దేశ్యా :- (ఈ విధమైనదని నిర్దేశింప శక్యము కానిది) ఈదృక్ = ఇట్టి లక్షణములు కలది, ఇట్టి పరిమాణము కలది, ఇట్టి స్వరూపము కలది, ఇట్టి ధర్మము కలది అని ప్రత్యక్ష సిద్ధమగు అర్థమును గురించి చెప్పవచ్చును. కాని, బ్రహ్మవిషయమున "యచ్చక్షుషా న పశ్యతి" కంటితో చూడబడనిది (కేన. ఉ. 6-1)అని శ్రుతి చెప్పినందున, ఇంద్రియ గోచరత్వము లేదు: కావున ఈమె ఈదృక్ అని నిర్దేశ్య కాదు, అనగనిర్దేశింప శక్యము కాదు. ఉపనిషత్తులు వేదైకదేశములు (వేదములందొక భాగము): కావున ఇతర ప్రమాణము నపేక్షింపకుండ. అజ్ఞాతమగు అర్థమును జ్ఞాపకమొనరించును; ఈ రూపమున వానియందు ప్రామాణ్యము కలదని ఔపనిషదుల మతము; కావున ఈమె ఇట్టిదని చెప్పుటకు వీలులేదని ఈ నామము

యొక్క అర్థము ఉపపన్నమగుచున్నది ఈమె ఇట్టిది, ఇదియే అని ఉపనిషత్తులు చెప్పినట్లు భావించిన యెడల అవి ప్రత్యక్ష సిద్ధమగు అర్థమును జ్ఞాపక మొనరించిన వగును, అప్పుడవి అనువాద రూపములు కలిగియుండును. కావున "ఇతర ప్రమాణాపేక్షలేనట్టి" ఉపనిషత్తులు సాపేక్షత్వరూపమగు అప్రామాణ్యమును పొందును. కావున, ఔపనిషదుల మతము నవలంబించి ఈమె ఈదృగిత్యవినిర్దేశ్య అని చెప్పవలెను.

ఓం ఈదృగిత్యవినిర్దేశ్యాయై నమః

[45] ఈశ్వరత్వవిధాయినీ :-

(ఈశ్వరత్వము కలిగియున్నట్టిది) ఈశ్వరునియొక్క భావము అనగ ఐక్యము ఈశ్వరత్వము. దానిని కలిగించును కావున ఈమె ఈశ్వరత్వ విధాయిని 'స్వేన రూపేణ నిష్పద్యతే' (ఛా. ఉ. 8 3 4) స్వస్వరూపముగ నిష్పన్నమగును. అని శ్రుతి చెప్పినందున ఈమె, ఆవరణ నిక్షేపశక్తులు కలిగిన అజ్ఞానమును నివారించునట్టి అఖండాకార చైతన్యస్వరూప అగుచు, ఈశ్వరైక్యము కలుగదను భ్రమను, భేదబుద్ధిచే సంపాదితమగునట్టి భ్రమను నివారించును. లేక ఈశ్వరత్వమనగ నానాదేశ విద్యాధనాధిక్య రూపకర్మఫలములు: వానిని ఆయా ప్రాణి సమూహములకు, వారివారి పుణ్య ప్రారబ్ధానుసారముగ ఇచ్చునట్టిది. కావున ఈమె ఈశ్వరత్వ విధాయిని

ఓం ఈశ్వరత్వవిధాయిన్యై నమః

[46] ఈశానాదిబ్రహ్మమయీ :-

(ఈమె ఈశానుడు మొదలుగా గల పంచబ్రహ్మలరూపము) ఈశాన, తత్పురుష, అఘోర, వామదేవ, సద్యోజాత - అను పేర్లు కలిగిన పంచ బ్రహ్మల మయమగు స్వరూపముకలది కావున ఈమె ఈశానాది బ్రహ్మమయి. లేక ఈశానుడు ఆదిగ కలవారు ఈశానాదులు: వారు అధికార పురుషులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులు, ఆయా నామరూపములచే విశిష్టులై అహంబుద్ధి కలిగియున్న వీరికికూడ అంతర్యామి రూపమున, బుద్ధిప్రేరక సచ్చిదానందస్వరూప పరబ్రహ్మానంద ప్రకాశ రూపమున ఈమెయే స్ఫురించుచుండును. కావున ఈమె ఈశానాది బ్రహ్మమయి.

అచేతనము, అందుచే ఏ ఫలముల నిచ్చుటకును దానియందు సామర్థ్యములేదు భృత్యుడొనరించిన పరాక్రమాది కర్మములచే తుష్టిచెంది, రాజు ఫలములనిచ్చును: అట్లే చైతన్యాధిష్ఠితములగు కర్మములకు ఫలము కలుగును. "కర్మాధ్యక్షః" (శ్వే. ఉ. 6–11) ఆరాధితుడగు పరమేశ్వరుడే కర్మాధ్యక్షుడు అని శ్రుతి. కావున కర్మాధ్యక్షుడును, సర్వజ్ఞుడునగు నీతడు ఆయ కర్మాధికారు లొనరించిన పుణ్యాపుణ్యములకు అనురూపమగు ఫలప్రదానమందు సమర్థుడు. తదితరులకు, చేతనములకు జీవాదులకు కూడ ఈ సామర్థ్యములేదు. కావున ఇతడే ఆయా కర్మాధికారులకు అనుగుణమగు విషయములందు ఇచ్ఛను కలిగించుచు, ఆయా సాధనములను వారిచే నవలంబింపజేయుచు, ఫలములందు వారికి కల కోరికలను పూరించును. ఇట్లు చెప్పినందున దీనిచే అనీశ్వరమీమాంసకుల మతము నిరసింపబడినదని గమనింపవలెను. లేక, ఈప్సిత అనగ జిజ్ఞాసిత: ఈమె స్వస్వరూపక ప్రతిపాదకమగు వేదాంతముల యొక్క శ్రవణమనననిదిధ్యాసనములచే విషయీకృతయై, అర్థమును అనగ ప్రార్థింపబడినదానిని అనగ అందరచే కోరబడుచున్న మోక్షరూపమగు పురుషార్థమును ఇచ్చును.

ఓం ఈప్సితార్థప్రదాయిన్యై నమః

ఈదృగిత్యవినిర్దేశ్యా చేశ్వరత్వవిధాయినీ ।
ఈశానాదిబ్రహ్మమయీ చేసిత్వాద్యష్టసిద్ధిదా॥

[44] ఈదృగిత్యవినిర్దేశ్యా :-

(ఈ విధమైనదని నిర్దేశింప శక్యము కానిది) ఈదృక్ = ఇట్టి లక్షణములు కలది, ఇట్టి పరిమాణము కలది, ఇట్టి స్వరూపము కలది, ఇట్టి ధర్మము కలది అని ప్రత్యక్ష సిద్ధమగు అర్థమును గురించి చెప్పవచ్చును. కాని, బ్రహ్మవిషయమున "యచ్చక్షుషా న పశ్యతి" కంటితో చూడబడనిది (కేన. ఉ. 6-1)అని, తి చెప్పినందున, ఇంద్రియ గోచరత్వము లేదు: కావున ఈమె ఈదృక్ అని నిశ్చ కాదు, అనగనిర్దేశింప శక్యము కాదు. ఉపనిషత్తులు వేదైకదేశములు (వేదములందొక భాగము): కావున ఇతర ప్రమాణము నపేక్షింపకుండ. అజ్ఞాతమగు అర్థమును జ్ఞాపకమొనరించును; ఈ రూపమున వానియందు ప్రామాణ్యము కలదని ఔపనిషదుల మతము: కావున ఈమె ఇట్టిదని చెప్పుటకు వీలులేదని ఈ నామము

యొక్క అర్థము ఉపపన్నమగుచున్నది ఈమె ఇట్టిది, ఇదియే అని ఉపనిషత్తులు చెప్పినట్లు భావించిన యెడల అవి ప్రత్యక్ష సిద్ధమగు అర్థమును జ్ఞాపక మొనరించిన వగును, అప్పుడవి అనువాద రూపములు కలిగియుండును. కావున "ఇతర ప్రమాణాపేక్షలేనట్టి" ఉపనిషత్తులు సాపేక్షత్వరూపమగు అప్రామాణ్యమును పొందును. కావున, ఔపనిషదుల మతము నవలంబించి ఈమె ఈదృగిత్యవినిర్దేశ్య అని చెప్పవలెను.

ఓం ఈదృగిత్యవినిర్దేశ్యాయై నమః

[45] ఈశ్వరత్వవిధాయినీ :-

(ఈశ్వరత్వము కలిగియున్నట్టిది) ఈశ్వరునియొక్క భావము అనగ ఐశ్యము ఈశ్వరత్వము దానిని కలిగించును కావున ఈమె ఈశ్వరత్వ విధాయిని 'స్వేన రూపేణ నిష్పద్యతే' (ఛా. ఉ. 8 3 4) స్వస్వరూపముగ నిష్పన్నమగును అని శ్రుతి చెప్పినందున ఈమె, ఆవరణ నిక్షేపశక్తులు కలిగిన అజ్ఞానమును నివారించునట్టి అఖండాకార చైతన్యస్వరూప అగుచు, ఈశ్వరైక్యము కలుగదను భ్రమను, భేదబుద్ధిచే సంపాదితమగునట్టి భ్రమను నివారించును. లేక ఈశ్వరత్వమనగ నానాదేశ విద్యాధనాధిక్య రూపకర్మఫలములు: వానిని ఆయా ప్రాణి సమూహములకు, వారివారి పుణ్య ప్రారబ్ధానుసారముగ ఇచ్చునట్టిది. కావున ఈమె ఈశ్వరత్వ విధాయిని

ఓం ఈశ్వరత్వవిధాయిన్యై నమః

[46] ఈశానాదిబ్రహ్మమయీ :-

(ఈమె ఈశానుడు మొదలుగా గల పంచబ్రహ్మలరూపము) ఈశాన, తత్పురుష, అఘోర, వామదేవ, సద్యోజాత - అను పేర్లు కలిగిన పంచ బ్రహ్మల మయమగు స్వరూపముకలది కావున ఈమె ఈశానాది బ్రహ్మమయి. లేక ఈశానుడు ఆదిగ కలవారు ఈశానాదులు: వారు అధికార పురుషులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులు, ఆయా నామరూపములచే విశిష్టులై అహంబుద్ధి కలిగియున్న వీరికికూడ అంతర్యామి రూపమున, బుద్ధిప్రేరక సచ్చిదానందస్వరూప పరబ్రహ్మానంద ప్రకాశ రూపమున ఈమెయే స్ఫురించుచుండును. కావున ఈమె ఈశానాది బ్రహ్మమయి.

ఓం ఈశానాది బ్రహ్మమయ్యై నమః

[47] ఈశిత్వాద్యష్టసిద్ధిదా :—

(ఈశిత్వము మొదలైన అష్ట సిద్ధుల నిచ్చునట్టిది) ఈశిత్వము అదిగ కలది ఈశిత్వాదులు. అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ఈశిత, ప్రాకామ్య వశిత్వములు. ఇట్టి అష్టసిద్ధుల నీమెయే ఇచ్చును. కావున, ఈమె ఈశిత్వా ద్యష్ట సిద్ధిద, మహత్త్వము మహిమ; (అల్పమైనది పర్వతమువలె అగుట), లాఘవము-లఘిమ (మహాంతమైనది కొద్దిదగుట) గురుత్వభావము గరిమ అనగ — జడతరము లగు పర్వతాదులవలె భారవశముచే కదలించుటకు నలవికాకుండుట; క్షణమాత్రమున విరాడాకృతి నొందుట ప్రాప్తి, అనగ చేతితో చంద్రమండలమును స్పృశింప కలు గుట మొదలైన శక్తులను కలిగియుండుట; ఇంద్రాదులను ప్రేరేపింపకలుగుట— ఈశిత; అప్రతిహతములగు కోరికలను కలిగియుండుట - అనగ వాంఛితార్థఫల ప్రాప్తి నొందుట ప్రాకామ్యము. సర్వలోక వశీకరణ సామర్థ్యము - వశిత్వము. "అణిమా మహిమా లఘ్వీ గరిమా ప్రాప్తిరీశితా। ప్రాకామ్యం చ వశిత్వం చ యత్రకామాః" అని వచనము. యత్రకామాః పరాగతాః అని చెప్పిన ఐశ్వర్యము కలిగినపుడు కామములు అనగ విషయములయొక్క అనుభవము లేకుండగనే అను భవజన్యసుఖము కలుగును. ఇదియే ఆప్తకామత్వము. 1 ఇవి అష్టసిద్ధులు. ఈమె ఈ సిద్ధుల నిచ్చును

ఓం ఈశిత్వాద్యష్టసిద్ధిదాయై నమః

'ఆత్మకామ ఆప్తకామః' ఆత్మకాముడైన వాడు ఆప్తకాముడని శ్రుతి. అనగ వానికిట్టి సిద్ధి కలుగును. యోగదర్శనములో అష్టసిద్ధులలో గరిమ లేదు. యత్రకామావసాయిత్వం అనునది ఒకసిద్ధిగ చెప్పబడినది. దానినే ఇక్కడ "యత్రకామాః పరాగతా-" అని చెప్పిరి.

ఈక్షిత్రీక్షణసృష్టాండకోటిరీశ్వరవల్లభా
ఈడితాచేశ్వరార్ధాంగ శరీరేశాధిదేవతా ॥

[48] ఈక్షిత్రీ :-

(సాక్షిణీ) ఈమె ఉదాసీనమగు దర్శిష్టి (ద్రష్ట) అనగ సాక్షిణీ, అసంగమును ఉదాసీనమునగు స్వరూపము కలది. 'సాక్షీ చేతా' (శ్వే. ఉ. 6-11) అని శ్రుతి. "ఆవిః సంనిహితం గుహాయాం" (ము ఉ. 2-2) ప్రకాశముగ హృదయమందు సన్నిహితమై బ్రహ్మమున్నది, అని శ్రుతి కావున ఈమె ఈక్షిత్రి.

ఓం ఈక్షిత్ర్యై నమః

[49] ఈక్షణసృష్టాండ కోటిః :-

(ఈ క్షణముచే సృజింపబడిన బ్రహ్మాండకోటులు కలది) అండములనగ బ్రహ్మాండములు. వానియొక్క కోటులు అనగ అసంఖ్యాకములగు అండములు. సంసారమండలము అనాది, కనుక కోటి శబ్దమునకు భూతభావికాల భేదముచే బహువచనము చెప్పబడినది. ఈ క్షణముచే అనగ భావికాల పర్యాలోచనముచే సృష్టములగు అండకోటులు కలది, ఈక్షణసృష్టాండకోటి: "తదైక్షత బహు స్యాం ప్రజాయేయ" (ఛా ఉ. 6-2-3) అనేకముగ కావలెనని, సృష్టించెదనని అతడు చూచెను. (సంకల్పించెను), 'స ఈక్షాంచక్రే' అతడు చూచెను. "ఆత్మా వా ఇద మేక అగ్ర ఆసీత్ నాన్యత్ కించన మిషత్ స ఈక్షత లోకాన్ను సృజా ఇతి స ఇమా న్లోకానసృజత" (బ. ఉ 1-1) మొదట ఆత్మ ఒక్కటే ఉండెను; వ్యాపారము కలిగినట్టిది మరియొకటి ఏదియును లేదు. అది లోకమును సృజింతును అని చూచి (సంకల్పించి) సృజించెను. అని శ్రుతులు చెప్పుచున్నవి. బాహ్యకరణము (సాధనము) నపేక్షింపకుండ చేతనమగు బ్రహ్మము తనకంటె అభిన్నముగను, తానే నిమిత్తోపాదాన కారణముగనుండి ఊర్ణనాభి (సాలెపురుగు)వలె సృజించుట ' ప్రకృతి శ్చ ప్రతిజ్ఞా దృష్టాంతానుపరోధాత్ ' (2-4-23) ఇత్యాది బ్రహ్మసూత్రములందు చెప్పబడినది. 1

ఓం ఈక్షణసృష్టాండకోటయే నమః

[50] ఈశ్వరవల్లభా :-

ఈశ్వరుడు - కామేశ్వరుడు, తనకు వల్లభుడుగ - పతిగ కలిగినది ఈశ్వరవల్లభ: లే., ఈశ్వరులనగ బ్రహ్మ విష్ణు రుద్రాదులు; ఈమె వారియొక్క

మహిమోత్కర్షరూపము అనగ వారిమహిమకు ఈమె కారణము. అందుచే వారి యొక్క ప్రీత్యతిశయమునకు ఈమె విషయమగుచున్నది, అనగా వారిచే కోరబడు చున్నదని అర్థము.

ఓం ఈశ్వర వల్లభాయై నమః

(1) ఘటమునకు కుమ్మరి నిమిత్తకారణము. మట్టి ఉపాదాన కారణము. అట్లే బ్రహ్మము, బ్రహ్మమే నిమత్తోపాదాన కారణములని ఈ సూత్రమునకు అర్థము.

(51) ఈడితా :-

(స్తుతింపబడినది) ఈడ ధాతువు స్తుతి అను అర్థము కలదిగ ధాతుపాఠ మునందున్నది. కావున ఈ నామముచే ఈమె స్తుతులచే విషయీకరింపబడినది, అనగ వేదాంతములచే విషయముగ చెప్పబడినది అని అర్థము. "ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య" (బృహ. ఉ. 6—4-23) బ్రహ్మవేత్తయొక్క నిత్యమగు మహిమయెట్టి దనిన అది (సత్) కర్మములచే వృద్ధి నొందదు, (అసత్) కర్మములచే క్షయ మొం దదు అనిశ్రుతి.

ఓం ఈడితాయై నమః

(52) ఈశ్వరార్ధాంగశరీరా :-

(ఈమె ఈశ్వరునియొక్క అర్ధాంగ శరీరము) ఈశ్వరుని యొక్క అనగ సచ్చిదానందాత్మకుడగు శివుని యొక్క అర్ధాంగము - ఈశ్వరార్ధాంగము— అనగ ఆనంద స్వరూపత, దానిని శరీరముగ, శరీరమువలె స్వరూప లక్షణముగ కలది అర్ధాంగశరీర. "సచ్చిన్మయః శివః సాక్షాత్ తస్యాఽఽనందమయీ శివా" శివుడు సచ్చిన్మయుడు, శివ ఆనందమయి, అని స్మృతి. లేక ఈశ్వరునియొక్క అర్ధాంగమగు వామ భాగమును ఈమె శరీరముగ కలిగియున్నదని అర్థము చెప్ప వచ్చును. లేక ఈశ్వరుడనగ హకారము. "హకారము యొక్క అర్ధాంగము శక్తి

(6) Farm

బీజము" (ఈకారము): దానిని శరీరముగ కలది: 1 అనగ పరదేవత మంత్రాత్మక యగు మూర్తి కలది అని అర్థము

ఓం ఈశ్వరార్ధాంగశరీరాయై నమః

(౯౬) ఈశాధిదేవతా :—

(ఈశునకు అధిదేవత) ఈశ శబ్దమునకు, ఉపలక్షణచే, ఈశ్వరుడనియే గాక జీవుడను అర్థము కూడ కలదు. ఈశునకు అనగ ఈశ పదముచే చెప్పబడిన వానికి, మాయను ఉపాధి కలిగినవానికి, విశేషణ సహితుడైన వానికి (అధి)పైన ఉన్న దేవత ఈశాధిదేవత. దేవత అనగ విశేషణ ద్వయమును పరిత్యజించునపుడు ద్యోతమానమగునది, అనగ ప్రకాశించునది 2 లేక ఈశుడనగ కామేశ్వరుడు, వానిని అధిదేవతగ, పూజ్యుడుగ కలది అనగ- ఈమె పరమ పతివ్రత అని అర్థము.

ఓం ఈశాధిదేవతాయై నమః

---

(1) ఈ మంత్రమందలి హకార కకారములు శివవాచకములు, హ్రీంకారములు శివశక్త్యాత్మకములు: మిగిలిన అక్షరములు శక్తివాచకములని మూలమునందు కలదు.

(2) ఉపాధి యనగ కార్యమం దన్వయింపక భేదమును కలిగించునది: విశేషణమనగ కార్యమందన్వయించుచు భేదమును కలిగించునది. మాయయు అంతఃకరణము అనునవి ఉపాధులు. జీవుడు ఈశ్వరుడు అనునవి చైతన్యముయొక్క విశేషణములు. వీరువురిలోను విశేషణాంశములో భేదమేగాని విశేష్యాంశములో (చైతన్యాంశములో) భేదము లేదు.

(3) ఈశ శబ్దమునకూ ఈశ్వరుడని జీవుడని అర్థము చెప్పబడినది. ఈశ్వరుడు మాయను ఉపాధిగ కలవాడు: జీవుడు అంతఃకరణమును ఉపాధిగ కలవాడు. తమ ఉపాధులను, జీవేశ్వరులనువిశేషణద్వయమును, వీరు వీడినపుడు వారిద్దరిలోనున్న చైతన్యాఽవిశేషణముచే ఈదేవత స్ఫురించుచున్నది. అనగ ఈమెయే శుద్ధచైతన్య స్వరూపము అని అర్థము తత్ అనగ సచ్చిదానంద లక్షణములచే చెప్పబడిన బ్రహ్మము: అతడే త్వం అను పదముచే వాడగుచున్నాడు. లక్షణ నాశ్రయించి ఇట్టు అర్థము

చెప్పబడినది. నిర్ధర్మకమగు బ్రహ్మమునకు వ్యవహార సౌకర్యమునకై సచ్చిదానందాది లక్షణములు చెప్పబడుచున్నవి. తత్ అను పదముచే నిర్దిష్టుడగు శుద్ధసత్త్వ ప్రధానుడగు ఈశ్వరునందు సర్వజ్ఞత్వాది లక్షణములు చెప్పబడు చున్నవి. ఈ రెండును ఏకపదార్థమని అసి పదము చెప్పుచున్నది. కావున తత్త్వ మస్యాది వాక్యములందలి అర్థమును భాగత్యాగ లక్షణచే శోధించిన యెడల తత్ అను పదముచే చెప్పబడిన పదార్థములో నున్న శుద్ధచైతన్యము త్వం అను పదముచే చెప్పబడినపదార్థనళళములో నున్న శుద్ధచైతన్యము ఈ రెండును ఏకమని తెలియుగున్నది. కావున పరదేవతయే శోధితత్త్వం పదార్థస్వరూప అని అర్థము. ఈమె పరమ పతివ్రత అని అర్థము.

ఈశ్వరప్రేరణకరీ చేశతాండవసాక్షిణీ
ఈశ్వరోత్సంగనిలయా చేతిబాధావినాశినీ ॥ 12

(54) ఈశ్వరప్రేరణకరీ :-

(ఈశ్వరుని ప్రేరణ చేయునట్టిది) బింబరూపుడగు ఈశ్వరుని స్వరూపమగుచు ఈమెయే జగత్తుయొక్క సృష్ట్యాదికార్యమును ప్రేరేపించును, అనగ ఆజ్ఞాపించును. ఇచ్ఛాజ్ఞాని క్రియాశక్తులందును ఆవరణవిక్షేపశక్తులందును 1 చిత్ స్వరూపముగ ఈమె ప్రతిబింబించుచు సృష్ట్యాది అధ్యక్ష పరమేశ్వరునిచే ప్రారంభింపబడిన

(1) ఇచ్ఛా జ్ఞాన క్రియా శాంతః అను నాలుగు శక్తులు శ్రీచక్రమందు ఊర్ధ్వముఖములగు యోని చతుష్కరూపమున పొందియున్నవి. జ్ఞానశక్తి ప్రకాశాంశమగు శివుడు: క్రియాశక్తి విమర్శాంశమగు శక్తి; ఇచ్ఛాశక్తి సమిష్టి స్వరూపము: అనగ జ్ఞానక్రియలయొక్క సమత్వము ఇచ్ఛాతత్త్వమునందుండును; ఇది బీజము వంటిది బీజము స్థిరముగానుండును. కాని మూలాంకురములు పైకి క్రిందకు ప్రసరించుచుండును. జ్ఞానము అంతరగతి కలిగి అధోభాగమున ప్రసరించునపుడు అది నివృత్తి కారణమగును. బాహ్యగతి కలిగినపుడు ప్రవృత్తిరూపమై అంకురరూపమున క్రియాశక్తి వెడలును. ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులే త్రిపుటిరూపము నొంది

నని. జ్ఞానశక్తి జ్ఞానము (మానము) క్రియాశక్తి జేయము (మేయము) ఇచ్ఛాశక్తి జ్ఞాత (మాత) అనునట్టి త్రిపుటి వీనివలన కలిగినది. ఈ త్రిపుటియే హరిహర హిరణ్యగర్భాత్మకమైనది. ఇచ్ఛాతత్త్వమునందు సృష్టి జ్ఞానతత్త్వమునందు సంహారము, ఇవియే సత్త్వరజస్తమః ప్రకృతికములు.

"ఏతత్త్రయాత్మకతయా సకలం త్రిరూపం।
సృష్ట్యాదికా అపి దశాశ్చ తథైవ తిస్రః॥"

అని మాతృకాచక్రవివేకము. సకల ప్రపంచము ఇచ్ఛాజ్ఞాన క్రియా శక్త్యాత్మకమగుట వలన లోకములో నన్నియు త్రైరూపమున నుండును. ఉదా॥ లోకత్రయము, వర్ణత్రయము, వేదత్రయము, బీజత్రయము(అనగ బాలామంత్రము) మొదలైనవి.

ఈక్షణమును పేరుకలిగిన ప్రకాశస్వరూపమగునని భావము1 లేక, ఈశ్వరునిభార్య అగుటచే వానికి వశ్యయై వాని యాజ్ఞ నుల్లంఘించకుండ ఈశ్వరప్రేరణ చేయును కావున ఈమె ఈశ్వరప్రేరణకరి.

ఓం ఈశ్వరప్రేరణకర్త్యై నమః

[55] ఈశతాండవసాక్షిణీ :—

(ఈశ్వరుని తాండవమునకు ఈమె సాక్షిణి) ఈశునియొక్క, అనగ ఈశ పదముచే చెప్పబడువానియొక్క, తాండవము, నర్తనమువలె అప్రయత్నముగ చేయునట్టి లీలామాత్రము. తాండవము చలనరూప కర్మమగుటవలన ఇట తాండవ మనగ సృష్ట్యాదిరూప ప్రక్రియ అని అర్థమగుచున్నది; దానియొక్క సాక్షిణి; అనగ ఈమెయే సంసర్గరహితయగు ప్రకాశ స్వరూపిణి అని అర్థము. "అసంగో నహి సజ్జతే" అసంగుడు సక్తినొందడు. (బృహ. 6- -15) అని శ్రుతి. లేక ఈశతాండవమనగ పరమేశ్వరుని నృత్యనాట్యములచే అభివ్యంజితమగు చతుష్షష్టి కళోపదేశము; ఈమె దానికి సాక్షిణి: "నర్తనాద్ధి పరేశస్య చతుష్షష్టికళాజనిః" పరమేశ్వరుని నర్తనమునుండి చతుష్షష్టి కళలు కలిగినవి అని ప్రదోషస్తోత్రమునందు ఈశతాండవ నర్తన మతిస్ఫుటముగ నున్నది. అందుచే నిట వ్రాయలేదు.

ఓం ఈశతాండడహాక్షీత్ర్యై నమః

ఈశక్తులే జాగ్రత్ స్వప్న సుషుప్తి రూపములైనవి. పంచదశీ మంత్ర మందలి మూడు ఖండములు అగ్ని సౌర సోమ ఖండములు. అవిజాగ్రత్ స్వప్న సుషుప్త్యాత్మకములని ఇచ్ఛాది శక్తిత్రయరూపములని చెప్పబడి నవి. ఆవరణ విక్షేపశక్తులు. గుణసామ్యము కలిగిన మూల ప్రకృతి యందు ప్రతిబింబించిన వానిని సాక్షి యందురు. ఈ మూల ప్రకృతి మరల వికృతిని పొంది సత్త్వగుణోద్రిక్తమైనపుడు ఆవరణ శక్తి అను పేరునొందినది. ఇందు ప్రతిబింబించినది ఈశ్వర చైతన్యము: ఈశ్వరుడు మాయను తన స్వాధీనమందు కలవాడు. సృష్టిస్థితి లయములకు ఆదికారకుడు; ఈశాధిష్ఠితమగు ఆవరణశక్తి రజోగుణోద్రిక్తమైనపుడు మహత్ అను పేరుగల విక్షేపశక్తి అయినది. ఇందు ప్రతిబింబించినది హిరణ్యగర్భచైతన్యము. హిరణ్యగర్భాధిష్ఠితవిక్షేపశక్తి తమగుణోద్రిక్తమైనపుడు అహంకారమను పేరు గలిగిన స్థూలశక్తి కలిగినది. ఇందు ప్రతిబింబించినది విరాట్ చైతన్యము. ఇతడే విష్ణువు; వీనినుండి ఆకాశాది పంచభూతములు జనించినవి - అని పైంగలోపనిషత్తు ఆవరణ శక్తి సత్పదార్థము నావరించి దానిని కనబడకుండ చేయును. విక్షేపశక్తి అసత్పదార్థమును (సత్పదార్థమువలె) కనుపింపచేయును. కూటస్థుడులేడు ప్రకాశించుటలేదు అని చెప్పుటకు కారణము ఆవరణము. అవిద్యావృతుడగు కూటస్థుయందు ప్రత్యగాత్మత్వకల్పన విక్షేపము - అని విద్యారణ్య మునికృత వేదాంత పంచదశి జ్ఞానముచే అవరణ శక్తి నశించునని విక్షేపశక్తి మాత్రము ప్రారబ్ధక్షయపర్యంతము నిలచియుండునని అందుచే నారదాది ఋషులకు కూడ అపుడపుడు అజ్ఞానము కలుగుచుండునని దేవీ భాగవత నీలకంఠీయ వ్యాఖ్యానమునందున్నది.

(1) "స ఐక్షత" అను శ్రుతిచే జగత్తుయొక్క సృష్టి ఈక్షణ పూర్వకము. జగత్తు సృజింపవలనని ఈశ్వరుడు సంకల్పించెను. అట్టి ఈశ్వరుని ఈమె ప్రేరేపించును.

(56) ఈశ్వరోత్సంగనిలయా :-

ఈశర్వునియొక్క అనగ తన భర్తయొక్క, ఉత్సంగము అనగ ఊరువులు, అవి నిలయముగ కలది - ఈశ్వరోత్సంగనిలయ.

ఓం ఈశ్వరోత్సంగనిలయాయై నమః

(57) ఈతిబాధావినాశినీ :-

ఈతిబాధలనగ దైవాదులవలన కలుగు బాధలు: లేక, క్షుద్ర జంతువుల వలన కలుగు పీడలు. అట్టి ఈతిబాధలను ఈమె వినాశ మొందించును. కావున ఈతిబాధావినాశిని. 1

ఓం ఈతిబాధావినాశిన్యై నమః ;-

ఈహావిరహితా చేశశక్తి రీషత్ స్మితాననా ।
లకారరూపా లలితా లక్ష్మీవాణినిషేవితా ॥ 13

(58) ఈహావిరహితా :

(కోరికలులేనిది) అప్రాప్తమగుదాని ప్రాప్తికొరకు కలుగు కోరిక ఈహ. ఈహ లేనిది ఈహావిరహిత. ఈమె ఆప్తకామ కావున ఈహావిరహిత.

ఓం ఈహావిరహితాయై నమః

(59) ఈశశక్తిః :—

ఈశ్వరునియొక్క సర్వజ్ఞత్వాదిరూపమగు శక్తి, అనగ సామర్థ్యము ఈమెకు కలదు. "దేవాత్మశక్తిం" (శ్వే.ఉ. 1.3) పరమాత్మయొక్క స్వతంత్ర శక్తియే ప్రపంచమునకు కారణమని ఋషులు కనుగొనిరి అని శ్రుతి.

ఓం ఈశశక్త్యై నమః

(60) ఈషత్ స్మితాననా :—

ఈషత్స్మితమును అనగ మందహాసమును కలిగిన ఆననము కలది ఈషత్ స్మితానన; పర్యాప్తకామత్వముచే సర్వదా ప్రసన్నముఖి అని అర్థము. లేక, దుఃఖమే అంటనట్టి పరమానందస్వరూపమే అగుటచే ఇట్లుండెనని చెప్పవచ్చును.

ఓం ఈషత్ స్మితాననాయై నమః

(61) లకారరూపా ;—

(లకారము రూపముగ కలది) రూపింపబడునది రూపము: మంత్రము యొక్క చతుర్థ వర్ణ రూపముచే జ్ఞాపకము చేయబడునది కావున ఈమె లకారరూప.

ఓం లకారరూపాయై నమః

(62) లలితా :—

"లలితం త్రిషు సుందరమ్" అను వచనముచే లలిత మనగ సుందరమైనది ఈమె అత్యంత సౌందర్యవతి అని గాని, అనుపమ సౌందర్యము కలది అనిగాని అర్థము.

ఓం లలితాయై నమః

(1) అతివృష్టి రనావృష్టి శ్శలభామూష కాశ్శుకాః
అత్యాసన్నాశ్చ రాజానః షడేతే ఈతయః స్మృతాః

[63] లక్ష్మీవాణీని షేవితా :—

(లక్ష్మిచే, వాణిచే సేవిత) లక్ష్మి అనగ సరైశ్వర్యశక్తియగు రమ: వాణి అనగ సర్వజ్ఞానశక్తియగు సరస్వతి. అభిన్నరూపులగు వారిచేబాగుగ' ఆకృతిమ ప్రేమముతో, ఈమె సేవిత, సేవ అనగ ఉన్మీలితములగు (పైకి వెలిబుచ్చిన) ఆజ్ఞలను పరిపాలించుట.

ఓం లక్ష్మీవాణి నిషేవితాయై నమః

లాకినీ లలనారూపా లసద్దాడిమపాటలా
లలంతికాలసత్ఫాలా లలాటనయనార్చితా ॥ 14

(64) లాకినీ :—

(సృష్టిస్థితిలయకారిణి) 'కం' అనగ సుఖము. "కం బ్రహ్మ" అనిశ్రుతి. కమ్, కానిది - అకము (దుఃఖము), అనగ భిన్నముగ కన్పడునట్టి దుఃఖాత్మకమగు జగత్తు అకమ. లయమొందునది - లమ్: ఈ లయము, స్థితి, ఉత్పత్తులకు కూడ ఉపలక్షణము. లం + అకం కలది లాకిని[1] అనగ ఈమె అనృత జడదుఃఖరూప జగత్తునకు కారణము, అనృతజడదుఃఖాదులు లేనట్టి బ్రహ్మస్వరూపము అని అర్థము

ఓం లాకిన్యై నమః

(65) లలనారూపా :—

(లలనయొక్క రూపము కలది) దీనిచేత నిరూపింపబడుచున్నది, జ్ఞాపక మొనరింపబడుచున్నది, (రూప్యతే అనేన) కావున రూపము, అనగ లింగము-చిహ్నము. లలనలు స్త్రీలు. వారియొక్క వేషము అనగ ఆభరణాద్యలంకారము, వారియొక్క ఆకృతికలది; లేక రూపములనగ ఐశ్వర్యములు. "లింగాంకిమిదం పశ్య జగదేతద్భగాంకితం" అను పురాణవచనము 2చే స్త్రీలు అను రూపములను అనగ ఐశ్వర్యములను కలది కావున ఈమె లలనారూప.

ఓం లలనారూపాయై నమః

(66) లసద్దాడిమపాటలా :—

(దాడిమపుష్పమువలె ఎర్రనైనది) దాడిమ శబ్దముచే వికసించిన దాడిమ పుష్పము చెప్పబడుచున్నది. లసక్ - అనగ అపుడే వికసించి ప్రకాశించినది లసద్దాడిమము. దాడి పుష్పము బంధూక పుష్పాదులకు కూడ ఉపలక్షణము. లసద్దాడిమమువలె పాటలము - అనగ శ్వేతమిశ్రమమైన రక్తవర్ణప్రధానమగు మూర్తి "శ్వేతరక్తం తు పాటలమ్" అని వచనము.

ఓం లసద్దాడిమపాటలాయై నమః

(1) మణిపూర చక్రమందున్న శక్తికి లాకిని అని పేరు. ఇక్కడ ఒక పరివారదేవతదనున్న శక్తిని పరదేవతగ చెప్పుటకు వీలులేనందున ఈ అర్థము చెప్పబడినది

(2) ఇది యంతయు లింగా(ఈశ్వరా)ంకితము. జగత్తు భగాం(శక్త్యం)కితము:— భగః శక్తిః భగవాన్ కామః అని త్రిపురోపనిషత్తు. సర్వస్వరూపుడు ఈశ్వరుడు; మాయాస్వరూపశక్తి.

(67) లలంతికాలసత్ఫాలా :—

(లలంతికాభరణముచే విలసిల్లుచున్న ఫాలము కలది) లలంతిక అనగ లలాటమధ్యమున ధరించు అలంకారము దీనికి చుట్టు ముత్యములుండును, మధ్య నవరత్నముండును. లలంతిక అనునగి లలాటపట్ట మొదలగు అలంకారములకు కూడ ఉపలక్షణము. లలంతికచే, లసత్ = విలసించుచున్న ఫాలము కలది లలంతికాలసత్ఫాల.

ఓం లలంతికాలసత్ఫాలాయై నమః

68. లలాటనయనార్చితా :-

(లలాటమునందు నయనముకలవారిచే అర్చిత) లలాటమునందు నయనముగా కలవారు - లలాటనయనులు, ఇట లలాటశబ్దముచే భ్రూమధ్యము చెప్పబడుచున్నది. నయన శబ్దముచే జ్ఞానము చెప్పబడుచున్నది. ఊర్ధ్వదృష్టి కలిగినవారిచే, ఖేచరీముద్రచే. విలీనమగు చిత్తము కలవారిచే అట్టి లలాటనయనులచే ఈమె అర్చిత – అనగ అట్టి జయసిద్ధి కలిగిన పురుషులకీమె సాక్షాత్కృత అయింది, అసివరుణలయొక్క మధ్యప్రదేశము, అవిముక్తము (వారణాసి): అవిముక్తమనగ భ్రూమధ్యప్రదేశమని అందు పరమేశ్వరుని అరాధించువారలకు పరపురుష ప్రాప్తికలుగునని అత్రిమహాముని అడిగిన ప్రశ్నలకుయాజ్ఞవల్క్య మహాముని సమాధానమిచ్చినటు జాబాలోపనిషత్తునందురాచున్నది. యాజ్ఞవల్క్యుని ఉత్తరవాక్యమున నిర్దిష్టముకు భూమికయందు జయసిద్ధి కలిగిన పురుషుల కీమె సాక్షాత్కారమగునని అర్థము. లేక, తృతీయ నేత్రముకలిగినశివునిచేగాని తత్ స్వరూపులగు రుద్రులచేగాని. (లలాటనయనులచే) పూజిత

ఓం లలాటనయనార్చితాయై నమః

లక్షణోజ్జ్వలదివ్యాంగీ లక్షకోట్యండనాయికా
లక్ష్యార్థా లక్షణాగమ్యా లబ్ధకామా లతాతనుః॥

69. లక్షణోజ్జ్వల దివ్యాంగీ ;-

(శుభలక్షణములచే ఉజ్జ్వలములగు దివ్యాంగములు కలది,) దివ్యమనగ స్వరూప తటస్థలక్షణమునచేత ఉజ్జ్వలమైన అనగ శోభితమైన శుద్ధమైన అంగము, అనగ

(1) నాలుకను వెనుకకు మరల్చి కపాలకూపమునుంచి భ్రూమధ్యమున దృష్టి నుంచుట ఖేచరీ ముద్ర,

(2) సత్యజ్ఞానానంతత్వాదులు కలిగి మాయకు ఆశ్రయమగుట బ్రహ్మముయొక్క స్వరూపలక్షణము: జగత్తునకు జన్మస్థితి లయహేతువగుట బ్రహ్మముయొక్క తటస్థలక్షణము.

స్వరూపమని కాని విగ్రహమని కాని అర్థము; అట్టి లక్షణములచే ఉజ్జ్వలమగు దివ్యాంగము కలది. తదాత్మానం స్వయ మకురుత (తై.ఉ.2.7.1) తనమ తాను చేసుకొనెను. అను శ్రుతిచే ఘృతకాఠిన్యన్యాయమున (కలిగియున్న నేయి పేరు కొనినట్లు) సచ్చిదానందా ఘనీభూత జీవాత్మకమగు విగ్రహము కలిగియున్నదని అర్థము. లేక సాముద్రిక శాస్త్రమందు చెప్పిన దివ్యలక్షణములచే ఉజ్జ్వలములైన అంగములు అనగ సంపూర్ణములు దివ్యముగల అంగములు - అనగ అవయవ ములు - శిరము కరములు మొదలైనవి; అట్టి అవయవములు కలది, అని అర్థము.

ఓం లక్షణోజ్జ్వల దివ్యాంగ్యై నమః

70. లక్షకోట్యండనాయికా :-

(అనేకములగు బ్రహ్మాండములకు ఈమె నాయిక) లక్షలు, కోటులు అనగ అసంఖ్యాకములు, అపరిమితములు అని అర్థము; సంసారమనాది కావున భూత భవిష్యదాది భేదముచే అండములు బహుసంఖ్యాకములు సమష్టి రూపమున హిరణ్య గర్భవిరాడ్రూపములు: వ్యష్టిరూపమున విశ్వతైజసులను ఉపాధులు కలవి. ఇట్టి లక్షకోట్యండములకు నాయిక అవగా దీనికి అధిష్ఠానబింబ చైతన్యరూపముననుండి ఈమెవ స్వత్వము కలిగించును.

ఓం లక్షకోట్యండనాయికాయై నమః

71. లక్ష్యార్థా :-

లక్షణచే అనగా శోధనచే, లేక జహదజహల్లక్షణచే వేదాంత వాక్యములకు ఏ అర్థము ప్రతిపాదింపబడినది. అస్వరూపము కలది. లేక యోగశాస్త్ర ప్రసిద్ధములగు బహిరంతరూర్ధ్వాఽధఃశ్రేదేశ విశేషరూపములగు భూమికలందు, నిర్గుణత్వమున

(1) దృశ్యమగు జగత్తు సమష్టియని భేదము కలిగియున్నది. ఈ రెంటిలో ఒక్కొ క్కటి ప్రత్యేకముగ స్థూలసూక్ష్మకారణములను త్రివిధ భేదమును కలిగియున్నది. స్థూలసమష్టి దృశ్యము విరాట్టు అనబడును సూక్ష్మ సమష్టి దృశ్యము లింగము అను సంజ్ఞకలది; కారణ సమష్టి దృశ్యము అజ్ఞానమనబడును, అట్టే స్థూల వ్యష్టిదృశ్యము మనుష్యాదుల శరీరము; సూక్ష్మవ్యష్టి దృశ్యము లింగమనబడును. కారణ సమష్టి దృశ్యము అజ్ఞానమనబడును. చైతన్యరూపమగు దృక్పదార్థము జీవేశ్వరులను

భేదముకలది. విశ్వ తైజస ప్రాజ్ఞులని జీవుడు, వైశ్వానరహిరణ్యగర్భ మాయావి అని ఈశ్వరుడు త్రివిధభేదము కలిగియున్నది; జీవులకు వ్యష్టియని ఈశ్వరునకు సమష్టి అని సంజ్ఞ. స్థూలదృశ్యమనుష్యాది శరీరాభిమాని యగుజీవుడు ప్రాజ్ఞుడు. హిరణ్యగర్భుడు: కారణదృశ్యా జ్ఞానాభిమాని యగు ఈశ్వరుడు మాయావి అను సంజ్ఞలు కలవు

(?) శబ్దవృత్తులు మూడు విధములుగ నున్నవి, అభిధ, లక్షణ: వ్యంజన అభిధా వృత్తిచే వాచ్యార్థము అనగ ముఖ్యార్థము చెప్పబడును ఘటమనగ ఘటమే: ఇది ముఖ్యార్థము, లక్షణ అనగ ముఖ్యార్థము కుదరకపోవుటచే దానికి దగ్గరనున్న అర్థమును చెప్పుట ఇట్లు చెప్పబడిన దానిని లక్ష్యార్థమందురు, వ్యంజన అనగ తాత్పర్యమును చెప్పునట్టిది. దీనిని వ్యంగ్యార్థమందురు, తత్త్వమస్యాదివాక్యములు బ్రహ్మపరముగా లక్షణచే చెప్పబడుచున్నవి, తత్ అను పదము ఈశ్వరుని చెప్పును.

త్వం అను పదము జీవునిచెప్పును. అసి అను పదము వీరిద్దరకు ఐక్యమును చెప్పుచున్నది. కాని అట్టి వాక్యము భిన్నులగు వారి యందుకుదురదు కావున జీవేశ్వరులందు విరుద్ధముగనున్న జడత్వ భాగములను త్యజించి వారిలో సమానముగనున్న చైతన్యాంశమున వారికి ఐక్యము చెప్పబడుచున్నది- దీనిని భాగత్యాగ లక్షణ జహదజహల్లక్షణ అంటారు

*గాని, తమతమ వాంఛాపూరణమునకైగాని మనోవిలయ రూప హఠయోగ రాజయోగ, సాధన పరిపాకవశమున సాక్షాత్కృతమగు చైతన్యమునకు లక్ష్యమని పేరు, అర్థింపబడునది అనగా గురువునుండి యాచింపబడునది అర్థము లక్ష్యమగు అర్థము – లక్ష్యము అనగ ఈమె చిత్స్వరూప పరమానందరూప అని అర్థము, బ్రహ్మైవేద మమృతం పురస్తాత్ బ్రహ్మ పశ్చాత్ బ్రహ్మ దక్షిణత శ్చోత్తరేణ (ము ఉ 2-2-11) ఆ అమృతమే బ్రహ్మము నాలుగు పైపులను బ్రహ్మమే ఉండెను. అని శ్రుతి.

ఓం లక్ష్యార్థాయై నమః

72. లక్షణాఽగమ్యా

(లక్షణచే అగమ్య) లక్షణ అనగ శక్యార్థము నందు వాచక పదమునకు సంబంధించిన అన్యపదార్థమును జ్ఞాపకము చేయునట్టి శబ్దవృత్తి ఈ లక్షణ

(1) మోక్షమునకు జ్ఞానమని యోగమని రెండు మార్గములున్నవి. మోక్షమునకు జ్ఞానయోగ మార్గములు రెండును ఆవశ్యకములు జ్ఞానమువలన అజ్ఞానము నశించును. నిష్కలము, నిర్మలము సచ్చిదానందాత్మకమునగు పరమపదము జ్ఞాని కగును మంత్రము, లయము హఠము రాజయోగమని యోగమునందు నాలుగు మార్గములు కలవు. ఇవి నాలుగు కలిపి మహాయోగమని పేరు నొందినవి మాతృకాదియుక్తమగు మంత్రమును ద్వాదశాబ్దము జపించిన అణిమాదిగుణాన్వితమగు జ్ఞానము కలుగును,మంత్రయోగము అల్పబుద్ధిగల సాధకులకేర్పడినది. చిత్తమును లయ మొందించుట లయయోగము సర్వకాల సర్వావస్థలయందు నిష్కళుడగు ఈశ్వరుని ధ్యానించుచుండిన లయయోగము కలుగును యమ నియమ ద్యష్టాంగములు కలది హఠయోగము. మహాముద్ర మహాబంధము: మహాభేదము. ఖేచరి, జాలంధరము: ఉడ్డియాణము. మూల బంధము, వజ్రోళీ మొదలైనని. అభ్యసించిన అనేకములగు సిద్ధులు కలుగును. పిమ్మట రాజయోగముచే వివేకవైరాగ్యములు కలుగునని. యోగ తత్త్వోపనిషత్తు "రజసో రేతసోయోగాత్ రాజయోగ ఇతిస్మృతః" అని యోగశిఖోపనిషత్తు, రజోబిందువు సామరస్య మొందుట రాజయోగము. యోగచూడామణ్యు పని షత్తు నందిట్లు చెప్పబడినది. "సపునర్ద్వివిధో బిందుః పాండరో లోహితస్తథా, పాండరం శుక్లమిత్యాహుః లోహితాఖ్యం మహారజః సింధూరవ్రాతసంకాశం రవిస్థానస్థితంరజః శశిస్థానస్థితం శుక్లం తయోరైక్యం సుదుర్లభం బిందు బ్రహ్మ రజశ్శక్తి ర్బిందు రిందూ రజో రవిః ఉభయో స్సంగమాదేవ ప్రాప్యతే పరమం పదమ్" రజోబిందువు రవి స్థానమందున్నది శుక్లబిందు శశిస్థానమందున్నది శుక్లబిందువు బ్రహ్మమే:ఇది ప్రకాశాంశము, రజోబిందువు శక్తిసవిమర్శరూపము: ఇది విమర్శాంశము. ఈ రెండుబిందువుల కలయిక అనగ శివశక్తి సామ రస్యము దీని ననుసంధాన మొనరించినవారు బ్రహ్మసాక్షాత్కార మొందినవారగు దురు. కావున రాజయోగము జ్ఞానయోగమే,

(2) గంగయందు గొల్లపల్లి అను వాక్యమందు, గంగలోపల గొల్లపల్లి యుండుట సంభవింపదు. కావున ముఖ్యార్థము కుదరదు. అప్పుడు లక్షణ నవలంబించి గంగ ఒడ్డు ఉన్న గొల్లపల్లి అని అర్థము చెప్పవలెను. అట్లే తత్వమసి అను వాక్యము న జీవేశ్వరులను విశేషణములను విడచి వారియందు సామాన్యధర్మముగనున్న చైతన్య స్వరూపమున వారికి అభేధము చెప్పవలయును.

వాచ్యవాచకములకు సంబంధించునట్టి భేదజ్ఞానమును కలుగుచేయునట్టి దగుటచేతను పరిచ్ఛిన్నమును అవయవ సహితమునగు పదార్థములకు సంబంధించిన జ్ఞానహేతు వగుటచేతను బ్రహ్మవిషయములో ప్రవర్తింపదు; ఏందన. బ్రహ్మము కేవల చిన్మాత్రము, నిరుపాధికమునగు వస్తువు ఇందు షష్ఠీజాత్యాది లక్ష్యతా ధర్మములులేవు. కావున ఈమెలక్షణచే అగమ్యా: అనగా పొందుటకు, తెలుసుకొనుటకు యోగ్యము కానిది అగమ్య. ఇక్కడ లక్షణచే అగమ్య అని చెప్పినప్పటికిని వేదాంతమతమందు 'తత్త్వం. పదార్థములకు అన్యోన్యతాదాత్మ్యము కుదరనందును జహద జహల్లక్షణచే (జీవత్వ. ఈశ్వరత్వ) విశేషణములు మాత్రము పరిత్యజింపబడింది ఉభయ తాదాత్మ్యము బోధింపబడుటచే లక్షణావృత్తి అంగీకరింపబడినది। కావున వేదాంతమందు లక్షణనుఅవశ్య మంగీకరింపవలెను. కాని ఇక్కడ లక్షణచే అగమ్య అని చెప్పబడి నది. ఇక్కడ విశేష్యము జ్ఞానస్వరూపము కావున నిత్యము, లక్షణవలన కలుగదు. అందుచేత లక్షణను అపేక్షించుటలేదని భావము. ప్రకృతమగు దేవత శుద్ధ చైతన్యమాత్ర స్వరూప, స్వయంప్రకాశ, కావున లక్షణచే అగమ్య అను నామము యుక్తమగుచున్నది.

ఓం లక్షణాగమ్యాయై నమః

(78) లబ్ధకామా:-

(లబ్ధములగు కామములుకలది) కామింపబడునవి కామములు. లబ్ధము లగు కామములు అనగా ఐహికాముష్మిక సాధనములు: వానిని కలది లబ్ధకామ, లేక ఆయా కామములవలన కలుగు సుఖములే లక్షణచే కామములని చెప్పబడినవి, అట్టి కామములను పొందినది. అనగ ఈమె పర్యాప్తకామ అని అర్థము. 'పర్యాప్తకామస్య కృతాత్మనస్తు, ఇహైవసర్వే ప్రవిలీయంతి కామాః' (ము. 3. 2)పర్యాప్త కామమునకు. కృతాత్మున కిక్కడనే సర్వకామములు విలలోమెందును, అని శ్రుతి.

ఓం లబ్ధకామాయైనమః

(74)లతాతనుః,

(లతవంటి శరీరముకలది) లతవలెరెండు కల్పాదివల్లులు సకల పురుషార్థప్రదములని జగత్తున ప్రసిద్ధి నొందినవి. అట్టి లతలవలె సుకుమారత్వాదులను కలిగియున్న తనువును అనగా మూర్తిని, లతలవంటి తనువును కలది, కావున లతాతనువు.

ఓం లతాతనవేనమః

లలామరాజదళికా లంబిముక్తాలతాంచితా

లంబోదర ప్రసూర్లభ్యా లజ్జాఢ్యాలయవర్జితా॥

(1) లక్షణచే చెప్పబడునది లక్ష్యార్థము బ్రహ్మమునందు షష్టీజాత్యాది లక్ష్యతాత్మములు లేవు. షష్టీవిభక్తిచేసంబంధము బ్రహ్మము దీనికి సంబంధించిన వస్తువు అని చెప్పుటకు వీలులేదు, ఈజాతికి సంబంధించిన వస్తువని చెప్పుటకు వీలులేదు. కావున లక్షణచే బ్రహ్మము అగమ్యము.

(75) లలామ రాజదళికా

(కస్తూరీ తిలకముచే శోభించు చున్న లలాటముకలది, లలామము అనగ కస్తూరీతిలకము లేక కస్తూరీపత్రము. దానిచే రాజత్—విభ్రాజమానమైనశోభించు చున్న—అళికము= లలాటము-కలది.

ఓం లలామరాజదళికాయైనమః

(76)లంబిముక్తాలతాంచితా:-

(వ్రేలాడుచున్న ముక్తాహారములచే ఒప్పుచున్నది:)లంబి=క్రిందకువ్రేలాడుచున్న. ముక్తాలతలు= హారములు లేక ముక్తాఫలములు, (ముత్యములు). వీనిచే అంచిత =ఒప్పుచున్నది. సర్వాంగములందు వ్రేలాడుచున్న నవరత్న ఖచ్చిత సువర్ణ మౌక్తికాహారములు కలది. కిరీటి ప్రథమభాగమునుండి, లలాట పట్టము నుండి, నాసాగ్రభూషణములనుండి, కర్ణదేశకంఠప్రదేశాభరణములనుండి, హస్త చతుష్టయాంగదములనుండి, కూర్పాసమునుండి, కటినిబద్ధకాంచినుండి ఈ హారములు వేలాడుచున్నవి.

ఓం లంబిముక్తాలతాంచితాయై నమః

(77) లంబోదరప్రసూః :-(లంబోదరుని జనని) లంబోదరుడు మహా గణేశుడు వనియొక్క ప్రసూః అనగ జనయిత్రి,తల్లి; లేక లంబోదరం ప్రసూతే, లంబోదరుని కన్నది అని చెప్పవచ్చును

ఓం లంబోదర ప్రసవే నమః

(78) లభ్యా:—(పొందతగినది) సంసారదశయందు ఆవరకరమగు అజ్ఞానముచే సుటప్పముగ ప్రకాశింపకుండి, శ్రవణాదులచే సంస్కృతమైన అంతఃకరణవృత్తియందు, అఖండాకారజ్ఞానభూమికయందు ప్రతిఫలించుచున్న స్వరూపముతో ఈమె లభ్య అనగ పొందతగినది బ్రహ్మము నిత్యము సన్నిహితమైయున్నది, కాని కంఠగతమైనను విస్మృతమైన కనకభూషణమువలె ప్రాప్తప్రాప్తి రూపమున (పొందియున్నదానినే పొందునట్టి రూపమున) పొందుటకు యోగ్యమైనది కావున ఈమె లభ్య.

ఓం లభ్యాయై నమః

(79) లజ్జాఢ్యా:-(లజ్జచే శోభించుచున్నది) లజ్జ-ఇది అంతఃకరణ ధర్మములన్నిటికిని ఉపలక్షణము లజ్జచేఆఢ్య; లజ్జ కలిగియుండుటచే ఆకారవతి అని అర్థము. తిరోధానాదులచే (మేలిముసుగు) అంతర్హితమై (కనుపడకుండి) వరము లిచ్చును కావున లజ్జాఢ్య

ఓం లజ్జాఢ్యాయై నమః

(80) లయవర్జితా :— (లయములేనిది) అవినాశీవారేఽయమాత్మా అనుచ్ఛిత్తిధర్మా (బృహ. ఉ.6-6—14) ఈ ఆత్మ అవినాశి, విచ్ఛేదము లేనిది,ఇత్యాది శ్రుతులచే, లయముచే, వినాశముచే, వర్జిత అనగ లయమొదనిది, ఈ లయము షడావని వికారములకు ఉపలక్షణము 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' (తై, ఉ. 2 - 1) అ్ప, శ్రుతులు.

ఓం లయవర్జితాయై నమః

హ్రీంకారరూపా హ్రీంకారనిలయా హ్రీంపదప్రియా
హ్రీంకారబీజా హ్రీంకారమంత్రా హ్రీంకారలక్షణా॥

81 హ్రీంకారరూపా :—

(హ్రీంకారము రూపముగ కలది) రూపింపబడుచున్నది నిరూపింపబడుచున్నది నిర్దేశింపబడుచున్నది రూపము. మంత్రమండలి పంచమావయవమగు హ్రీంకారము రూపముగ కలది, హ్రీంకారరూప:

ఓం హ్రీంకారరూపాయై నమః

82 హ్రీంకారనిలయా :—

(హ్రీంకారము నిలయముగ కలది) 'హ్రీం' అను అక్షరము నిలయముగ అనగ గృహమువలె అవచ్ఛేదకముగ కలది కావున ఈమె హ్రీంకారనిలయ; ఈ నామము వాచకత్వమునందారోపింపబడిన వాచ్యతాధర్మమును సంపాదించుచు గృహమందున్న పురుషునవలె. ఇతర భిన్న స్వరూపమున ఈమె యున్నదని జ్ఞాపకమొనరించుచున్నది.

ఓం హ్రీంకారనిలయాయై నమః

83. హ్రీంకారప్రియా :—

(హ్రీంపదమందు ప్రియ) దీనిచేత పొందబడుచున్నది. అనగా తెలియబడుచున్నదిగాన — పదము; లేక పొందబడుచున్నది. అనగ తెలియబడుచున్నది వాచపదము.[2] హ్రీంపదము హ్రీంకారము; ఇది మంత్రావయవ మగునవి, మంత్రదేవతా ప్రకాశక రూపమున ఈ దేవతయందు శక్తమై (శక్తి కలిగి) యున్నది, శక్తంపదమ్

(1) జనన,అస్తిత్వ, వృద్ధి, విపరిణామ, అపక్షయ, నాశములు షడ్భావ వికారములని నిరుక్తము నందు చెప్పబడినవి.

(2) ఇక్కడ, పదము అను శబ్దముయొక్క వ్యుత్పత్తి రెండువిధములుగచెప్పబడినది.

(3) శక్తం పదం - అని నైయాయికును. ఈపదమునకు ఈఅర్థము అనగ ఈ సంకేతము కలదు అని చెప్పునట్టి శక్తి పదములందు కలదు. అర్థమందు శక్యత్వ మున్నది. ఇది అవిధరూపమునగాని లక్షణరూపమునగాని ఉండవచ్చును. ఇక్కడ హ్రీం అను పదముచే ఈమె తెలియచేయబడుచున్నది, అని ప్రథమ వ్యాఖ్యానము వర్ణ ఏవపదమ్ అని ఉపవర్షుని మతమని బ్రహ్మసూత్రభాష్యములో నున్నది.

శక్తి కలిగినది పదము అను లక్షణ మిందు కలదు కావున 'దీనిచే పొందబడుచున్నది. తెలియబడుచున్నది.' అని ప్రథమ వ్యాఖ్యానము చేయబడినది 'పొందబడుచున్నది: తెలియచేయబడుచున్నది. అను ద్వితీయ వ్యాఖ్యానము వర్ణసముదాయః పదమే అను పదలక్షణము నాశ్రయించి చెప్పబడి నది. వర్ణముల సముదాయః పదము హకార, రేఫ, ఈకార, అనుస్వార వర్ణముల సమష్టి స్వరూపమున సముదాయాత్మక మగుటచే హ్రీంకారము పదమైనది, ఈ పదమును పునశ్చర్య నొనరించువారికి దేవతా సాక్షాత్కారద్వారమున సకల పురుషార్థములు ప్రాప్తించును, హ్రీం పదమునందు ప్రియ - అనగ ప్రీతికలది.

ఓం హ్రీంపదప్రియాయై నమః

84. హ్రీంకారబీజా :-

(హ్రీంకారమును బీజముగ కలది.) హ్రీంకారమేబీజము అనగ దేవతావాచక మంత్రభాగము. జ్ఞాపకం దేవతానం యత్ బీజమక్షర ముచ్యతే దేవతలను జ్ఞాపక మొనరించునట్టి అక్షరమును బీజమందురు. అని వచనము. వటవృక్షము యొక్క బీజములను, వానియందున్న వృక్షాభివ్యంజక కారణత్వముచే బీజములని చెప్పుదురు: అట్లే మాయాప్రకాశతత్వముచే హ్రీంకారమునకు బీజత్వము చెప్పబడినది. సత్కార్య వాది మతమున అవ్యక్తనామరూప కారణము బీజమని అభివ్యక్తనామ రూపాత్మకమై తరువాత కలుగు నట్టివి. కార్యమని అంగీకరింబబడినది, సకన కారణ సన్నిహితమై విశేషనామరూపములతో కారణ మభివ్యక్తమగుటయే ఉత్పత్తి అనబడును. హ్రీం కారము మాయావిచ్ఛిన్న చైతన్యమునకు అభివ్యంజకమగును, కావున బీజత్వము నొందినది, అట్టి హ్రీంకార బీజమును కలిగినట్టిది. హ్రీంకారబీజ,

ఓం హ్రీంకార బీజాయై నమః

85 హ్రీం కారమంత్రా :-

(హ్రీంకారము మంత్రముగ కలది,) హ్రీంకారము యొక్క మననముచే రక్షించునట్టిది. హ్రీంకారమంత్ర ఇక్కడ వాచ్యవాచకముల కభేదము చెప్పబడినది, లేక, హ్రీంకారఘటితమగు మంత్రము కలది. హ్రీంకారమంత్ర అని చెప్పవచ్చును.

ఓం హ్రీంకారమంత్రాయై నమః

86. హ్రీంకారలక్షణా ;-

(హ్రీంకారము లక్షణముగ కలది) హకారము శివుడు: ఇది ఆకాశబీజ మగుటవలన ఇతడు ఆకాశమువలె నిర్లేపుడు: రేఫము వహ్ని బీజ మగుటచే ఈ రెండింటివలన కార్యోత్పత్తికై సంనిహితమగు శక్తిని కలిగియున్న ఈశ్వరుడు చెప్పబడు చున్నాడు. కావున హకారయుక్త రేఫముచే కారణత్వము నొందియున్న శుద్ధచైతన్యము చెప్పబడుచున్నది. ఈ కారము మన్మథ బీజము. ఇక్కడ ఈ బీజము తనకు కారణమగుదానిని

(1) కార్యము (జగత్తు) పూర్వములేనిది: అది కారకవ్యాపారముచే అవిర్భవించును. అని అసత్కార్యవాది మతము. లేనిదానినుండి కార్య మావిర్భవించినదని చెప్పిన శశ శృంగాదులు జనింపవలయును. కావున పూర్వమున్నదానినుండియే కారకవ్యాపారమున కార్య మావిర్భవించును, అని సత్కార్యవాది మతము. కార్యము పూర్వమే ఉన్నయెడల కారక వ్యాపారము వ్యర్థమగును: కావున కార్యమును సత్ (ఉన్నదనిగాని) అసత్ (లేదనిగాని) చెప్ప వలనుపడదు అది మిథ్యయేఅగును అని మిథ్యావాదిమతము.

సూచించుచున్నది. అనగ విష్ణ్వావ చైతన్యము ఈకారముచే చెప్పబడుచున్నది. అభిన్నమును, నిమిత్తోపాదానకారణమునగు ఆ వస్తువు (బ్రహ్మము) నం దే (జగత్తు) లయమొందుట, అనుస్వారముచే చెప్పబడుచున్నది కావున 'హ్రీం' అని పలికినపుడు జగదుత్పత్తిస్థితిలయకారణమగు చైతన్యమే శబ్దశక్తిచే వాచ్యార్థముగ తెలియబడు చున్నది. హ్రీంకారముయొక్క లక్షణము కలది హ్రీంకారలక్షణ. అనగ ఉపాధిపరి త్యాగరూపలక్షణము కలది. లేక, హ్రీంకారమే లక్షణముగ, అనగ తటస్థ లక్షణముగ కలది. అని చెప్పవచ్చును.

ఓం హ్రీంకారలక్షణాయై నమః

హ్రీంకారజపసుప్రీతా హ్రీంమతీ హ్రీంవిభూషణా
హ్రీంశీలా హ్రీంపదారాధ్యా హ్రీంగర్భా హ్రీంపదాభిధా॥

87. హ్రీంకారజపసుప్రీతా :-

హ్రింకారముయొక్క జపము హ్రింకారజపము; గానిచే సుప్రీత—

ఓం హ్రీంకారజపసు ప్రీతాయై నమః

88. హ్రీంమతీ :-

(హ్రింకారము కలది.) వాచకరూపమునగాని, లక్షక (సూచించునట్టి) రూపమున గాని, అలక్ష్యపదార్ధరూపముగాని, వాచ్యవాచకముల కభేదరూపమున గాని హ్రీం (అను అక్షరము) కలది హ్రింమతి.

ఓం హ్రీంమత్యై నమః

89. హ్రీంవిభూషణా :-

(హ్రీంకారము విభూషణముకలది,) హ్రింకారము కేవల జడరూపవాచకము. ఎట్లనగ, హకారము శ్వేతవాచకము, రేఫ రోహితార్ధకము (ఎరుపు). ఈ కారము నీలార్థకము. ఇట్లు విశిష్టమైనది. శుక్ల రక్త నీలత్వములు కలిగిన పదార్ధమును చెప్పును. అనగ సత్త్వరజస్తమోగుణ విశిష్టమైన ప్రకృతిని చెప్పును. ఇది పరిచ్ఛిన్నము, అనృతజడ దుఃఖస్వరూపము నకు వాచ్యార్ధ మగుటచే, ప్రకాశరహిత మగుటచే, అగ్రాహ్య మగుచున్నది. అందుచే ఈ పరదేవత స్వప్రకాశచైతన్యరూపములనుండి ఆపాదమస్తకము అలంకృతమైన తరుణివలె. ఆనందస్వరూపత్వమున నుండి ప్రకృతివాచకమున ష్టాంరమునగు హ్రీంపదమును, అష్టైశ్వర్యములను కలిగించునట్టి శక్తి కలిగిన హ్రీపదమును: శోభాయమానమగు భూషణమువలె ధరించును. - అని అర్థము. చెప్పవలెను. కుండలీ పురుషః (ఈ పురుషుడు కుండలములను కలిగి యుండెను.) అనినపుడు ఉపలక్షణచే వానికి కుండలములు తప్ప ఇతరసజాతీయ వస్తువు లేవియు లేవని తెలియుచున్నది. అట్లే ఇక్కడ ఈ నామమునకు అర్థము చెప్పవలెను. అనగ ఇతర వాచ్యార్థములను గోచరింపజేయక ప్రమా(నిశ్చయ)జ్ఞానము ను కలిగించునట్టి రూపమున హ్రింకారమును ఈమె భూషణముగ కలిగియున్నది: కావున హ్రింవిభూషణ.

ఓం హ్రీంవిభూషణాయై నమః

90. హ్రీంశీలా :-

(హ్రీంకారము యొక్క స్వభావము కలది) హ్రీం అను పదముచే తద్వాచ్యార్థములగు బ్రహ్మ, విష్ణు, రుద్రులు చెప్పబడుచున్నారు. వారియొక్క శీలము, అనగ స్వభావము, అనగ, పారమార్థికమగు సచ్చిదానందాత్మకత్వము. ఇట్టి శీలమును కలది —హ్రీంశీల, లేక, త్రిమూర్తులందున్న సత్త్వరజస్తమోగుణములు కలది; "శీలం స్వభావేశతల్మేచో" శీలము అను పదమునకు స్వభావము, ధర్మము (గుణము) అను అర్థములు కలవు అని వదనము.

ఓం హ్రీంశీలాయై నమః

91. హ్రీంపదారాధ్యా :-

హ్రీం అను పదముచే. అనగ ఏకాక్షరమంత్ర బీజముచే ఆరాధించుటకు యోగ్య, కావున హ్రీంపదారాధ్య. హ్రీంకారేణైవ సంసిద్ధోభుక్తిం ముక్తించవిందతి హ్రీంకారముచే సంసిద్ధుడైనవాడు భుక్తిని ముక్తిని పొందును. అని భువనేశ్వరీ కల్పవచనము.

ఓం హ్రీంపదారాధ్యాయై నమః

92. హ్రీంగర్భా :-

హ్రీంశబ్దముచే సగుణులగు త్రిమూర్తులు చెప్పబడుచున్నారు. శక్తిసహితులైనవారిని ఈమె తన గర్భమునందు అనగ స్వస్వరూపమున అవినాభావ సంబంధమున కలిగియున్నది. కావున హ్రీంగర్భ మమయోని ర్మహద్ బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహం (భ గీ. 14-3) నాయొక్క ప్రకృతి సర్వభూతములకు కారణము దాని యందు నేను గర్భముచెందను అని భగవద్వచనము,

ఓంహ్రీంగర్భాయై నమః

93. హ్రీంపదాభిధా :-

హ్రీంకారపదము అభిధగ, అనగ నామధేయముగ కలది. హ్రీంకారపదాభిధ. సమష్టిరూపమగుదానిని సమష్టిశబ్దముచేతనే చెప్పవలెనని నియమము.

ఓం హ్రీంపదాభిధాయై నమః

హ్రీంకారవాచ్యా హ్రీంకారపూజ్యా హ్రీంకారపీఠికా
హ్రీంకారవేద్యా హ్రీంకారచింత్యా హ్రీం హ్రీంశరీరిణీ॥

94. హ్రీంకారవాచ్యా :—

హ్రీంకారముచే పరదేవత చెప్పబడుచున్నది. కావున హ్రీంకారవాచ్య. మాయోపాధికమగు బ్రహ్మమునకు కల్పితమగు ధర్మముచే శబ్దప్రవృత్తి ఉపపన్నమగుచున్నందున. రూఢిచే ఈమె హ్రీంకారవాచ్య అని అర్థము.

ఓం హ్రీంకారవాచ్యాయై నమః

(1) సమష్టిరూపయగు పరదేవతను సమష్టిశబ్దమగు (హకార రేఫ ఈకారానుస్వార సహితమగు) హ్రీంకారముచేతనే చెప్పవలయును.

95. హ్రీంకారపూజ్యా :-

ఈమె హ్రీంకారముచే పూజ్య మూలమంత్రేణ పూజయేత్ మూలమంత్రముచే పూజింపవలయును, అను శ్రుతిచే మూలమంత్రమునకు పూజాంగత్వము చెప్పబడుచున్నది: మూలమనువు (మంత్రము) దేవతయొక్క స్వకీయనామమని వచనమున్నది అనామముచే (మూలమంత్రముచే) అంతర్ముఖులకు మంత్రశాస్త్రమునందు వ్యుత్పన్నత్వము. కలుగుచున్నది. కావున నమః అంతముగ హ్రీంకారము నుచ్చరించి స్వగురు సంప్రదాయము ననుసరించి శ్రీచక్రాదులందు మూలదేవతను పూజింపవలెను. అని ఆగమరహస్య మున్నది, ఈమెకు అతిప్రియ బీజనామముగుటవలన హ్రీంకార బీజముచేతనే ఈమె పూజింపబడుటకు యోగ్య,

ఓం హ్రీంకారపూజ్యాయై నమః

96. హ్రీంకారపీఠికా :—

(ఈమె హ్రీంకారమునకు పీఠిక-ఆధారము) ఇక్కడ పీఠశబ్దము ఆధారమను అర్థముకలది. వాచ్యార్థము వాచకశబ్దమునకు సత్తాను (ఉనికిని) కలిగించును కావున దానికి ఆధారమగుచున్నది. మంత్రమునకు మంత్రదేవతకు అభేద మున్నప్పటికిని అర్థమందున్న మహిమ వాచకపదమందు కనుపింపకపోవుటచే భేదకల్పన మొనరించి

ఈ నామము చెప్పబడుచున్నది. హ్రీంకారముయొక్క పీఠిక అనగ వృత్తిస్థానము (ఉండువారు) శబ్దముయొక్క శక్తిచే గోచరత్వముచే ఈమె విషయీ భూత: అనగ తెలియబడునది అని అర్థము.

ఓం హ్రీంకారపీఠికాయై నమః

97. హ్రీంకారవేద్యా :—

హ్రీంకారముచే వేద్య — తెలియదగినది బ్రహ్మము స్వరూపముచే నిర్గుణము కావున అజ్ఞానమునకు విషయముగగాని ఆశ్రయముగగాని ఉండదు అందుచే అజ్ఞానావృతమగు సంసారదశయందు (నిత్యప్రాప్తమైను) బ్రహ్మము అప్రాప్త పురుషార్థ రూపముననున్నది. బ్రహ్మము శుద్ధస్వరూప పరమానంద రూపమున లక్షణచే తెలియబడుటదగుటచే పొందగోరబడిన దగుటచే శ్రవణమననాదులవలన కలుగుచున్న వృత్తి (వ్యాప్యత్వ) రూపమగు జ్ఞానమునకు (బ్రహ్మము) విషయమగుట చెప్పబడినది, ఇట్లు చెప్పినందువలన గురువు నాశ్రయింపవలెను. మననాదులు చేయవలెను అను విధులందు అప్రామాణ్యబుద్ధి నిరసింపబడుచున్నది. బ్రహ్మణ్యజ్ఞాన నాశయవృత్తి వ్యాప్తిరపేక్ష్యతే ప్రత్యగాత్మయందు అజ్ఞాన నాశముకొరకు బుద్ధివృత్తియొక్క వ్యాప్తి అపేక్షింపబడినది. అవి వచనము. మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే (భ. గీ. 7. 14) నన్ను పొందినవారు మాయను దాటుదురు. అను భగవద్వాక్యముచే ఈ వృత్తిజ్ఞాన మంగీకరింపబడినది.

గురుముఖోద్భూతమగు హ్రీంకారముచే ఈమె వేద్య-తెలియదగినవి: బ్రహ్మస్వరూప పరిజ్ఞానము బ్రహ్మప్రాప్తి పురుషార్థహేతువగునని అర్థము;

(1) ప్రత్యగాత్మము బ్రహ్మమును ఒకటేనను విషయము అజ్ఞానముచే ఆవరింపబడి యున్నది. ఈ అజ్ఞాన నివృత్తి కొరకు నేనే బ్రహ్మమును (అహం బ్రహ్మాఽస్మి) అనునట్టి ఆకారముకలిగిన బుద్ధి వృత్తియొక్క వ్యాప్తి అపేక్షింబడుచున్నది. బ్రహ్మమును మనస్సు చేతనే తెలుసుకొనవలయునని శ్రుతులు చెప్పుచున్నవి; అందుచే బుద్ధి వృత్తిచే అజ్ఞానము నివారింపబడుట నంగీకరింపవలెను.

ఓం హ్రీంకారవేద్యాయై నమః

98. హ్రీంకారచింత్యా :-

(హ్రీంకారమందు ఈమె చింతింపదగినది.) ఈ హ్రీంకారము పంచ ప్రణవప్రములలో అంతర్గత మగుటవలన ఓంకారమువలె బ్రహ్మ - ప్రతీకమగుచున్నది. ప్రణవమునందు పరాపర - బ్రహ్మోపాసన హేతువునట్లుగ ఈ ప్రతీకమందునుకలదు ఇట్టి వికల్పము (పరాపర బ్రహ్మవికల్పము అనగ సగుణ నిర్గుణ వికల్పము) మంత్ర విశేషములందు భక్త్యతిశయముచే కలుగునని యోగవేదమార్గ రహస్యము. కావున ఇందువాదజల్పముల కవకాశము లేదు, హ్రీంకారమందు ఉభయ విధముగ (పరాపర బ్రహ్మస్వరూపత్వమున) చింతింపబడుటకు ఈమె యోగ్య దేవతాసాక్షాత్కారము నొందుటకు ధ్యానము అత్యంతోప కారకము - కావున ఈమె హ్రీంకారమందు చింత్య.

ఓం హ్రీంకారచింత్యాయై నమః

99. హ్రీం :-

(సర్వమును హరించి ముక్తినిచ్చునట్టిది.) హృఞ్ హరణే అను ధాతు పాఠమువలన హృధాతువు హరణార్థకము. సమస్త విద్యైశ్వర్యాది శక్త్యాలోపములకు ఈమె అధిష్ఠానమైనను ఈమె యొక్క వాస్తవస్వరూపము పరమానందరూపము క్తి యే.

ఓం [illegible] నమః

100. హ్రీంశరీరిణీ:-

ఈమె మూలమంత్రాత్మిక. హ్రీంకారముశరీరముగ. అనగ మూర్తిగకలది. హ్రీంశరీరిణీ,

ఓం హ్రీంశరీరిణ్యై నమః

హకారరూపాల ప్పృథక్పూజితా హరిణేక్షణా
హరప్రియా హరారాధ్యా హరిబ్రహ్మేంద్రవందితా॥

101. హకారరూపా :-

మంత్రమునందు షష్ఠావయవమగు హకారము రూపముగ కలది. ఈమె మూలవిద్యయొక్క వాచ్యార్థమును వాచకముగ కలది అని అర్థము.

ఓం హ్రీంకారరూపాయై నమః

(1) శ్రీం హ్రీం క్లీం ఐం సౌః అను బీజాక్షరములు మంత్రశాస్త్రమున పంచప్రణవములుగ పరిగణింపబడుచున్నవని తెలియుచున్నది. బ్రహ్మప్రతీకమనగ తెలియజేయునట్టి గుర్తు.

(2) సమశ్శబ్దమున్నప్పుడు హ్రీంశబ్దమునకు చతుర్థీవిభక్తి చెప్పవలెను. కాని ఇక్కడ హ్రీం శబ్దము అవ్యయమని ఓం హ్రీం నమః అని చతుర్థ్యంతము లేకుండ చెప్పుట సంప్రదాయమని వరివస్యారహస్యమున భాస్కరరాయలు వ్రాసెను.

102 హలధృక్పూజితా :-

హలమును యుగమును (నాగలిని) ధరించువాడు హలధృక్ - అనగ బలరాముడు. వానిచే పూజిత, అనగ ధ్యానాదులచే ఆరాధిత,

ఓం హలధృక్పూజితాయై నమః

103. హరిణేక్షణా:-

హరిణము - ఏణము (లేడి), దానియొక్క ఈక్షణమువంటి ఈక్షణముకలది. అతి సంతోషమున కాతరాక్షియై యున్నదని భావము. లేక అంతటను ఎల్లప్పుడు అన్నిటిని చూచుచుండును కావున హరిణేక్షణ- అనగ భక్తులందు ఆదరహేతువగు దర్శనము కలది,

ఓం హరిణేక్షణాయై నమః

104. హరప్రియా :-

హరునియొక్క ప్రియ; ఈమె శివవల్లభ; లేక హరుడు ప్రియుడుగ కలది. అని చెప్పవచ్చును,

ఓం హరప్రియాయై నమః

105. హరారాధ్యా :-

స్వభర్తయగు హరునిచే, ఈమె కేవల సచ్చిదానంద స్వరూపయగుటవలన, ఆరాధ్య - ఆరాధింపబడుటకు యోగ్య.

ఓం హరారాధ్యాయై నమః

106. హరిబ్రహ్మేంద్రవందితా ;-

హరిరమేశుడు, బ్రహ్మ వాణీశుడు ఇంద్రుడు దేవేశుడు. ఈ శబ్దములు సర్వదేవ భేదములకు ఉపలక్షణములు వారిచే వందిత-నమస్కృత.

ఓం హరిబ్రహ్మేంద్రవందితాయై నమః

హయారూఢాసేవితాంఘ్రి ర్హయమేధసమర్చితా
హర్యక్షవాహనా. హంసవాహనా హతదానవా॥

107. హయారూఢాసేవితాంఘ్రిః

హయారూఢా అను అశ్వమాత్ర సేనానీ శక్తి వశ్యకరి యైనదున్నది ఆమెచే సేవింపబడిన అంఘ్రులు [పాదములు) కలది.

ఓం హయారూఢాసేవితాంఘ్ర్యై నమః

(1) హరిణ మెప్పుడును బెదురుచూపులతో ఏల్లపైపుల చూచుచుండును. పరదేవత కూడ సర్వద్రష్టి కావున అన్నిటిని చూచుచుండునని భావము.

(2) అశ్వారూఢ అనుశక్తి భండాసురుని సేనానియగు కురుండుని వధించెను. అని లలితోపాఖ్యానము

108. హయమేధసమర్చితా :-

హయమేధము అశ్వమేధము దానిచే సమర్చిత – పూజిత; ఇలాదులచే పురుషత్వ ప్రాప్తికొరకు అశ్వధామేది యజ్ఞములచే అర్చిత.

ఓం హయమేధసమర్చితాయై నమః

109. హర్యక్షవాహనా :-

(సింహము వాహనముగ కలది.) వహించునట్టిది వాహనము, హర్యక్షమనన సింహము; ఈమె హర్యక్షమును వాహనముగకలది. అనగ ఈమె మహాలక్ష్మిదూగ దుర్గ అని అర్థము.

ఓం హర్యక్షవాహనాయై నమః

110. హంసవాహనా:-

హంసను వాహనముగ కలది) హంసశబ్దము హన్ధాతువునుండి కలిగినది. గమనముకలది హంస - అనగ సూర్యుడు, ప్రాణము అని ఈ శబ్దమునకు అర్థములు కలవు. హంసను వాహనమువలె అనగ ఆధారభూతప్రతీకమువలె అనగ అభివ్యక్తి స్థానముగ కలిగియున్నదిగాన ఈమె హంసవాహన సయశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే స ఏక. (తై. ఉ. 10-4) ఈ పురుషునియందున్నదియు, ఆదిత్యుని యందున్నదియు ఒక్కటే అని శ్రుతి,(కావున ప్రాణము లేక ఆదిత్యుడు అని హంస పదములకు అర్థము చెప్పబడినది) లేక: బ్రాహ్మి (సరస్వతీ) రూపమున ఈమె హంసవాహన.

ఓం హంసవాహనాయై నమః

111. హతదానవా :-

హతులగు దానవులు కలది, అనేకప్రకార శక్తిరూపములను దరించిన ఈమెచే భండాసురాది దానవులు హతులైరి.

ఓం హతదానవాయై నమః

హత్యాదిపాపశమనీ హరిదశ్వాదిసేవితా
హస్తికుంభోత్తుంగకుచా హస్తికృత్తి ప్రియాంగనా

112. హత్యాదిపాపశమనీ :-

హత్య, బ్రహ్మహత్య మొదలైనవి, హత్య మొదలైన పాపములను ఈమె శమింపజేయును. హరిర్హరతిపాపాని పాపములను హరిహరించును. అని వచనము,

ఓం హత్యాదిపాపశమన్యై నమః

(1) ఇలుడుఅంబికావనమున ప్రవేశించి దిశ శాపగ్రస్తుడై స్త్రీత్వం మొందువునిఆరాధించి మరల పురుషుడయ్యెను,

(2) హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతిః అనిచ్ఛయాఽపి సంస్పృష్టో దహత్యేవహిపావకః ॥ ఇచ్ఛలేకుండ (అకస్మికముగ) అగ్నిని స్పృశించినను అది దహించును.

113. హారిదశ్వాదిసేవితా:-

(ఇంద్రాదులచే సేవిత) హరిత్ - హరిద్వర్ణము కలిగిన అనగ మరకతముల వంటి రంగు కలిగిన అశ్వములను కలవాడు హారిదశ్వుడు అనగ ఇంద్రుడు, ఇంద్రుడు ఆదిగ కలిగిన దిక్పతులచే సేవిత: అనగ ఈమె వారిచే కింకరత్వమున చరణార విందసన్నిధియందు ఆశ్రిత,

ఓం హారిదశ్వాదిసేవితాయై నమః

114. హస్తికుంభోత్తుంగకుచా :-

హస్తముకలది. హస్తి - ఏనుగు, హస్తి యొక్క కుంభమువలె ఉన్నతములు సాంద్రములునగు కుచములు కలది. హస్తికుంభోత్తుంగకుచ:

ఓం హస్తికుంభోత్తుంగకుచాయై నమః

115 హస్తికృత్తి ప్రియాంగనా :-

హస్తి యొక్క కృత్తి అనగ చర్మము అందు ప్రియుడు-ప్రీతిగలవాడు - శివుడు. ఈమె వానియొక్క అంగన- అనగ భామిని

ఓం హస్తికృత్తి ప్రియాంగనాయై నమః

హరిద్రాకుంకుమాదిగ్ధా హర్యశ్వాద్యమరార్చితా
హరికేశసఖీ హాదివిద్యా హాలామదాలసా

116. హరిద్రాకుంకుమాదిగ్ధా :-

హరిద్ర-అనగపసుపు-హరిద్రాకుంకుమములు, ఇవి కస్తూరీ పత్రాదులకుకూడ ఉపలక్షణచే వర్తించును: వీనిచే దిగ్ధ - పూయబడినది.

ఓం హరిద్రాకుంకుమాదిగ్ధాయై నమః

117. హర్యశ్వాద్యమరార్చితా :-

హర్యశ్వుడు—సురేశ్వరుడు (ఇంద్రుడు) ఇతడు ఆదిగకలిగిన అమరులచే అర్చిత పూజిత ఈమెయందు నియామకత్వ మున్నందున వారిచే కింకరత్వమున ఈమె పూజిత;

ఓం హర్యశ్వాద్యమరార్చితాయై నమః

118. హరికేశసఖీ:-

(హరికేశునియొక్క సఖీ) హరి అనగ హరిద్వర్ణము, హరిద్వర్ణము కలిగిన కేశములు కలవాడు. హరేశుడు, హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః (ఛా. ఉ. 1-6-6)

అట్లే ఇచ్ఛలేకుండ నైనను హరిని స్మరించిన అనామస్మరణము పాపమును హరించును, అజామీళుడు నారాయణుడను తన కుమారుని పేరు పెట్టి పిలిచినను నారాయణస్మరణ చేసినవాడగుటచే అతడు స్వర్గమునొందెనని పురాణము: ఇట్టిఅనుకూలమగు భ్రమను సంవాది భ్రమ అందురు, రత్న ప్రభను చూచి రత్నమని భావించుట విసంవాదిభ్రమ దీపప్రభను చూచిరత్నమని భావించుట విసంవాదిభ్రమ అని వేదాంతపంచదశి. సంవాదిభ్రమ ప్రయోజకరము. విసంవాది భ్రమదానికి వ్యతిరేకము,

హిరణ్యశ్మశ్రుపులు (సువర్ణమయమగు మీసములు గడ్డములు) కలవాడు. హిరణ్య కేశములు కలవాడు, అని శ్రుతి: అట్టి హిరణ్యకేశుని సఖి - అనగ ప్రయోజన మపేక్షింప కయే ఉపకార మొనర్చునట్టిది. లేక, హరికేశుడనగ నీలవర్ణుడగు హరితో సమానవర్ణము కలిగిన కేశములు కలవాడను, సర్వాంగ సుందరుడును. సత్యయౌవనుడును, చిద్రూప సహితుడునగు కామేశ్వరుడు, వాని సఖి—పరదేవత,

ఓం హరికేశసఖ్యై నమః

119. హాదివిద్యా :—

లోపాముద్రచే ఉపాసింపబడిన మంత్రరూపము కలది.

ఓం హాదివిద్యాయై నమః

120. హాలామదాలసా :-

(వారుణీమదముచే అలస) హాల—అనగ అమృతమధనమునందు ఉద్భవించిన వారుణి. హాలామదముచే. అనగ ఉల్లాసముచే ఈమె అలస అనగ అరక్తములగు నేత్రాంతములు, రోమాంచాదిచిహ్నములు కలది అని అర్థము.

ఓం హాలామదాలసాయై నమః

సకారరూపా సర్వజ్ఞా సర్వేశీ సర్వమంగళా
సర్వకర్త్రీ సర్వభర్త్రీ సర్వహంత్రీ సనాతనా॥

121. సకారరూపా ;-

(సకారమురూపముగ కలది) మంత్రమునందలి ద్వితీయ ఖండమున ద్వితీయావయవత్వమున ఈమె జ్ఞాపకమగుచున్నది,

ఓం సకారరూపాయై నమః

122. సర్వజ్ఞా :—

సర్వమెరుంగునది. లుప్తముకాని నిత్యజ్ఞాన స్వరూప మీమె యొక్క సామాన్య స్వరూపము. కావున ఈమె సర్వజ్ఞ 'యః సర్వజ్ఞః సర్వవిత్' (ము, ఉ, 1—9) ఏవడు సర్వజ్ఞుడో సర్వవేత్తయో, అని శ్రుతి.

ఓం సర్వజ్ఞాయై నమః

123. సర్వేశీ :—

సర్వమగు కార్యమును అంతర్యామిరూపమున ప్రేరేపించును. కావున ఈమె సర్వేశీ.

ఓం సర్వేశ్యై నమః

124. సర్వమంగళా :-

సర్వమగు - అనగ సర్వప్రకారమగు శుద్ధ విశిష్ట చైతన్యరూపమగు - మంగళ - అనగ పరమానందస్వరూప కనుక ఈమె సర్వమంగళ. ఇక్కడ బహువ్రీహి సమాసము వివక్షింపబడలేదు. బహువ్రీహిసమాసము చెప్పదలచిన యెడల "సుందర కాయోరాజా" "సుందరకాయము కలిగిన రాజు" అను తావున

(1) లోపాముద్ర ద్రష్టగానుండి కనుగొనిన మంత్రములో మొదటి అక్షరముహకారము కావున అది హాదివిద్య. పంచదశీవిద్య ద్వాదశ భేదములు కలిగియున్నది. అందు హాదివిద్య యొకటి.

వలె (సర్వమంగళములు కలది అని) సమాసార్థము కలుగును లేక, సర్వుల యొక్క - అనగ అందరియొక్క మంగళము కలది అని చెప్పవచ్చును. లేక - సర్వైః = సర్వప్రకారములచే, ధ్యానకీర్తన పూజానమస్కారాద్యర్చనలచే, భక్తి వలన కలుగు కైంకర్యములచే - మంగళము అనగ సుఖము, జడులకు కూడ, ఈమె వలన కలుగును. లేక, సర్వులకు ఆత్మరూపమున తెలియఁబడుచున్న మంగళ స్వరూపము సుఖస్వరూపము ఈమెకు కలదు. లేక, సర్వశబ్దముచే సర్వకారణుడగు శివుడు చెప్పబడుచున్నాడు. వానికి మంగళము ఎవరివలన కలుగుచున్నదో ఆమె సర్వమంగళ "సచ్చిన్మయ శ్శివః సాక్షాత్ తస్యానందమయీ శివా" శివుడు సచ్చిన్మయుడు, శివ ఆనందమయి అని వచనము: లేక మంగళశబ్దముచే మంగళమునకు హేతువులగు స్త్రీలు చెప్ప బడుచున్నారు. సర్వులకు: సర్వప్రాణులకు, మంగళము అనగ సుఖము,జడులకుకూడ, ఈమె వలన కలుగును. లేక సర్వులనఆత్మరూపమున తెలియబడుచున్న మంగళస్వరూపము - సుఖస్వరూపము ఈమెకు కలదు. లేక సర్వశబ్దముచే సర్వకారణుడగు శివుడు చెప్పబడుచున్నాడు. వారికి మంగళము ఎవరి వలనకలుగుచున్నదో ఆమె సర్వమంగళ'సచ్చిన్మయశ్శివః సాక్షాత్ తస్యానందమయీ శివా' శివుడు సచ్చిన్మయుడు. శివ ఆనందమయి అని వచనము. లేక, మంగళశబ్దముచే మంగళమునకు హేతువులగు స్త్రీలు చెప్పబడుచున్నారు: సర్వులకు; సర్వప్రాణులకు, మంగళము. - మంగళసాధనభూతమగు స్త్రీలు తనకంటే అభిన్నమగు సచ్చిదానందన త్త్వమున ఈమెకు గలదు, ఏతాస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవంతి (బృహ. ఉ. ౹-౪-82) ఈ ఆనందముయొక్క లేశమును ఇతర భూతములు అన్యములగుచు అనుభవిం చుచున్నవి అని శ్రుతి. అశుభాని నిరాచష్టే తనోతి శుభసంతతిం స్మృతిమాత్రేణ యత్పుంసాం బ్రహ్మ తన్మంగళం విదుః అతి కల్యాణ రూపత్వాత్ నిత్యకళ్యాణసంశ్రయాత్ స్మర్తౄణాం వరదత్వాచ్చ బ్రహ్మ తన్మంగళం విదుః స్మృతిమాత్రముచే పురుషులకు అశుభములను పోగొట్టి శుభ సంతతిని కలుగజేయు బ్రహ్మమును మంగళమందురు. అతి కళ్యాణరూపమగుటచేతను, నిత్యకళ్యాణమునకు ఆశ్రయమగుటచేతను, స్మరించువారికి వరముల నిచ్చుటచేతను బ్రహ్మమును మంగళ మందురు అను వచనమననుసరించి ఈమె సర్వమంగళ అని చెప్పబడినది.

ఓం సర్వమంగళాయై నమః

125. సర్వకర్త్రీ :-

మాయారూపమగు స్వశక్తిచే ఈమె సర్వమును చేయును. కావున సర్వకర్త్రీ. ఈశత ఈశనీభిః (శ్వే. ఉ. 3-1) మాయచే పరిపాలించుచున్నాడు అని శ్రుతి.

ఓం సర్వకర్త్ర్యై నమః

126. సర్వభర్త్రీ :-

సర్వమును భరించునట్టిది సర్వభర్త్రి. ఏష విభృతి రేషాంలోకానాం (బృహ. ఉ. 1. 4. 1.) ఈ లోకములకీ ఆత్మ-విధృతి (భరించునట్టిది) అని శ్రుతి.

ఓం సర్వభర్త్ర్యై నమః

127. సర్వహంత్రీ :

సర్వమును హరించునట్టిది సర్వహంత్రి. (125, 126, 127) ఈ మూడు నామములచేతను యతోవా ఇమాని భూతాని జాయంతే అని శ్రుతియందు చెప్పబడిన తటస్థలక్షణత్రయము (జన్మ స్థితి లయములకు కారణమగుట) చెప్పబడినదని తెలుసుకొనవలెను.

ఓం సర్వహంత్ర్యై నమః

128. సనాతనా :-

"అజో నిత్యః శాశ్వతోఽయం పురాణః" (కఠ. ఉ. 2. 18.) ఇతడు అజుడు, నిత్యుడు, శాశ్వతుడు, పురాణుడు అను శ్రుతిచే ఈమె సనాతన-అనగ నిత్య సిద్ధ స్వరూప.

ఓం సనాతనాయైనమః

సర్వానవద్యా సర్వాంగసుందరీ సర్వసాక్షిణీ ॥
సర్వాత్మికా సర్వసౌఖ్యదాత్రీ సర్వవిమోహినీ ॥

129. సర్వానవద్యా :-

(సర్వగుణములచే అనవద్య-అనింద్య) సర్వములగు జ్ఞానైశ్వర్యాది సర్వగుణములచేత ఈమె అనవద్య, అవద్య అనగ విద్యలేనిది. అనగ జడ ప్రకృతి.

ఇది జ్ఞానముచే బాధింప (నశింప) బడును గాన దీనిని మిథ్య అందురు. ఈమె అవద్య కానిది, అనవద్య. అనగ సత్యజ్ఞానానందరూపమున నున్నట్టిది. లేక, అందరకు సర్వాభీష్టముల నిచ్చుటచే ఈమె స్తుతింపదగినది అని అర్థము.

ఓం సర్వానవద్యాయై నమః

130. సర్వాంగసుందరీ :-

సర్వములగు అంగములు సర్వాంగములు. అనగ శిరస్సు, పాణి మొదలైనవి. సర్వాంగములందు ఎక్కువతక్కువలు లేకుండ సాముద్రికశాస్త్రము నందు చెప్పిన లక్షణములు కలిగియుండుటచే ఈమె సర్వాంగసుందరి లేక, సర్వాంగము లందనగ సర్వశరీరములందు-సుందరి; అనగ ఈమె బ్రహ్మస్వరూపసగుట వలన అందరకు అత్యంత ప్రేమ విషయరూపమున, సుందరపదార్థమువలె అవినాభావవాంఛకు (తాదాత్మ్యవాంఛకు) విషయమగుచున్నది, కావున సర్వాంగసుందరి.

ఓం సర్వాంగసుందర్యై నమః

131. సర్వసాక్షిణీ ;-

సర్వులకు అనగ, జడములగు కార్యములకు, స్ఫూర్తిని కలిగించును కావున సాక్షిణి, అనగ ప్రకాశమిచ్చునట్టిది. లేక సర్వమును సాక్షాత్తుగ ఈక్షించును. కనుక సర్వసాక్షిణి.

ఓం సర్వసాక్షిణ్యై నమః

132. సర్వాత్మికా :-

సర్వులయొక్క ఆత్మస్వరూప. కావున సర్వాత్మిక యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిచ య ఉస్య సంతతోభావ స్తస్మాదాత్మేతిగీయతే విషయములను పొందుచు, గ్రహించుచు, అనుభవించుచు బ్రహ్మముయొక్క సంతత భావమై ఏదియున్నదో దానిని ఆత్మయందురు-అని వచనము.

ఓం సర్వాత్మికాయై నమః

133. సర్వసౌఖ్యదాత్రీ :-

(సర్వసౌఖ్యముల నిచ్చునట్టిది) సుఖియొక్క భావము సౌఖ్యము. సర్వములగు సౌఖ్యములు అనగ ప్రియమోద ప్రమోద ఆనందశబ్దములచే వాచ్యము

లైనవి ఇష్టమైనదాని దర్శనమువలన కలుగు సుఖము ప్రియము: ప్రియమైనది లభించుటవలన కలుగు సుఖము మోదము; మోదముయొక్క అనుభవమువలన కలుగు సుఖము ప్రమోదము, సుషుప్తిరూపమైనసుఖము ఆనందము: జీవుడు భోక్త. సర్వసుఖముల నిచ్చునట్టిది సర్వసౌఖ్యదాత్రి. లేక. సర్వప్రకారములచే, స్మరణాదులచే సౌఖ్యము నిచ్చునట్టిది సర్వసౌఖ్యదాత్రి. లేక, ఆబ్రహ్మస్తంబపర్యంతము సర్వులకు వారివారి కర్మోపాసనలనుబట్టి ప్రత్యక్షముగ కనుపడునట్టి జ్ఞానైశ్వర్యాది సహితమగు సుఖమునిచ్చునట్టిది "ఏషహ్యేవానందయతి" (తై. ఉ 2–1) అతడే ఆనందింప జేయునట్టివాడు అని శ్రుతి.

ఓం సర్వసౌఖ్యదాత్ర్యై నమః

134. సర్వవిమోహినీ :-

సర్వులను విమోహింపచేయునట్టిది సర్వవిమోహిని, అనగ (ఒకవిధముగ నున్నదానిని) మరియొకవిధముగ గ్రహింపజేయుచున్నది; "అజ్ఞానేనావృతంజ్ఞానం తేన ముహ్యంతి జంతవః" (భ, గీ. 5-15) జ్ఞాన మజ్ఞానముచే నావరింపబడినది. అందువలన జనులు మోహమొందుచున్నారు; అని స్మృతి. "అనృతేన ప్రత్యూఢాః" (ఛా. ఉ. 8–3-2) అనృతముచే నీడ్వబడినవారు అనగ అపహరింపబడిన ఆత్మ స్వరూపము కలవారు. అని శ్రుతి కావున మోహింపచేయునట్టిది అజ్ఞానావరణశక్తి కార్యమే; కాని మోహనాదులు కలిగిన అప్రకాశాది ప్రధానములకు ఈమె అధిష్ఠానమగుటచే ఈమెయే మోహింపజేయు చున్నది అని లక్షణచే చెప్పబడినది. ఇనుము దహించుచున్నది[1] అన్నట్లుగ.

ఓం సర్వవిమోహిన్యై నమః

సర్వాధారా సర్వగతా సర్వావగుణవర్జితా
సర్వారుణా సర్వమాతా సర్వభూషణభూషితా ॥ 26

(1) దహించుచున్నది అగ్ని, ఇనుముకాదు, అట్లే మోహింపజేయుచున్నది అజ్ఞానము. దేవత కాదు. కాని జ్ఞానము (దేవత) అజ్ఞానముచే ఆవరింప బడినందున దేవతయే మోహింపజేయుచున్నది అని చెప్పబడుచున్నది.

135. సర్వాధారా :-

సర్వమునకు ఆధారమైనది. "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" (తై. ఉ, 2-5-2) బ్రహ్మము, పుచ్ఛమువలె ప్రతిష్ఠ (ఆధారము) అని శ్రుతి. సర్వులయొక్క హృదయములను ఆధారముగ కలది: అనగ ఉపాసకుల హృదయమున ఈమె అభివ్యక్తమగునని అర్థము.

ఓం సర్వాధారాయై నమః

136 సర్వగతా :-

సర్వమును పొందునది సర్వగత "అనేన జీవేనాత్మనానుప్రవిశ్య" (ఛా. ఉ. 6-?-2) "ఈజీవాత్మ రూపమున నేను అండజస్వేదజోద్భిజ్జములందు ప్రవేశించి నామరూపములను వ్యాకరింతును" అని శ్రుతి.

ఓం సర్వగతాయై నమః

137. సర్వావగుణవర్జితా :-

అమావనహేతువులగు గుణములు అవగుణములు. సర్వావగుణములచే ఈమె వర్జిత అవగుణములనగ సమష్టియందు అధ్యాత్మికసంబంధముచే ఆరోపింపబడిన సత్త్వగుణాదులు: వ్యష్టియందు అంతఃకరణ ధర్మములగు కామాదులు. సర్వాంతర్యామి రూపమున ఈమె అన్నిటియందున్నను ఆయా ఉపాధులందున్న ఉత్తమాధమధర్మములచే ఈమె సంబద్ధకాదు. ఘటమునందున్న ఆకాశమువలె, ఒరయందున్న ఖడ్గమువలె, ఈమె అస బద్ధముగ నుండును. "సూర్యోయథా సర్వ లోకస్య చక్షుః న లిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః ఏక స్తథా సర్వభూతాంతరాత్మా న లిప్యతే లోక దుఃఖేన బాహ్యః" (కఠ. ఉ 2-5-11) జగచ్చక్షువగు సూర్యుడు బాహ్యములగు చాక్షుష రూపములచే సంబద్ధుడుకానట్లు ఏకమగు సర్వభూతాంతరాత్మ బాహ్యములగు లోకదుఃఖములచే సంబద్ధుడు కాడు. అని శ్రుతి.

ఓం సర్వావగుణవర్జితాయై నమః

138. సర్వారుణా .-

సర్వములగు అంగములందు-అరుణ ఆరక్తముగనున్నది. "అసౌయస్తామ్రోఽరుణః" తామ్రవర్ణుడు, అరుణవర్ణమైనట్టివాడు అని శ్రుతి.

ఓం సర్వారుణాయై నమః

139. సర్వమాతా ;-

సర్వముచేత - అనగ కార్యముచేత అభేదరూపమున మాత - అనగ అనుమిత - ఊహింపబడినది. కార్యజగతుచే ఈమె అనుమిత 1 ఇదం జగత్ బ్రహ్మాభిన్న - ఈజగత్తు బ్రహ్మముకంటె అభిన్నము 2 తత్స త్తాస్ఫూర్తినియతసత్తా ప్రకాశ జ్ఞానవిషయత్వాత్ - బ్రహ్మసత్తాస్ఫూరిచే నియతమును, సత్తా రూపమనగు ప్రకాశజ్ఞానమగుటవలన 3యద్ యన్నియత సత్తా ప్రకాశవాన్ సదత భిన్నః ఏది దేనియొక్క నియతసత్తా ప్రకాశమును పొందునో అది దానికంటె అభిన్నము యథా తంతుకార్యః పటః-తంతుకార్యము పటమునకంటె అభిన్నమైనట్లు4 తథాచాయం -ఇక్కడగూడ నట్లె 5తస్మాత్ తథా; కావున అట్లే, సర్వమాతా అనగ - (సర్వం) మినోతి, అనగ సర్వమును తనకంటె అభిన్నముగ తెలుసుకొనునట్టిది

(1) తర్కమందు చెప్పిన పంచావయవ వాక్యము ననుసరించి జగత్తుబ్రహ్మాభిన్నమని చెప్పబడుచున్నది. ఇది ప్రతిజ్ఞావాక్యము. (1) హేతువాక్యము (3) ఉదాహరణవాక్యము. (4) ఉపనయవాక్యము. (5) నిగమన వాక్యము. మూలమున 1,2,3 వాక్యములే చెప్పబడినవి.

ఓం సర్వమాత్రే నమః

140. సర్వభూషణభూషితా:-

ఏయే ప్రాణులు ఏయే భూషణాద్యలంకార భోజనాదులను అనగ భోగ్య వస్తువులను తమ కొరకు సంపాదించుకొందురో వాని నన్నిటిచేత, సర్వభూషణముల చేత, ఈమెయే వానిచే అలంకృత. "ఆత్మన స్తు కామాయ సర్వం ప్రియం భవతి" (బృ. ఉ 4-4-5) ఆత్మయొక్క (తనయొక్క) కామమునకై సర్వమును ప్రియ మగుచున్నది. అని శ్రుతి లేక ఈమె సర్వదేవతాత్మిక అగుటచే భక్తజనులు తమ తమ ఇష్టదేవతలయొక్క ప్రీతికొరకు ఇచ్చునట్టిభూషణములచే ఈమెయే అలంకృత కావున సర్వభూషణ భూషిత. లేక అసంగోదాసీన స్వభావయగు ఈమె మహారాజ్ఞి యగుటచే సర్వులచేతను. అనగ సర్వభక్తజనులచేతను ఆయా అవయవములదుం భూషణములచే ఆరోపిత లేక, సర్వదేశ కాలలోకములందు ఆయా ప్రదేశములనున్న

ఉచ్చావచభూషణములచే ఆమె ఆరోపిత. హస్తి అశ్వము మొదలుగ గలిగిన దేహములను ఉపాధిగ కలిగి ఆయా అలంకారములందు జుగుప్స లేకుండునది అని అర్థము. లేక, సర్వోత్తమత్వమును ఘోషించునవి అనగ ప్రతిపాదించునవి భూషణములు అనగ వేదాంతమహావాక్యములు సర్వభూషణములచే=సర్వవేదాంత మహావాక్యములచే, ఏకతాత్పర్యమున ఈమె భూషిత-అనగ వానిచే లక్షణరూపమున ఈమెయే పర్యవసానముగ తెలియబడినది అని అర్థము.

ఓం సర్వభూషణభూషితాయై నమః

కకారార్థా కాలహంత్రీ కామేశీ కామితార్థదా
కామసంజీవనీ కల్యా కఠినస్తనమండలా ॥ 27

**141.** కకారార్థా :-

(కకారము అర్థముగ కలది) "కం బ్రహ్మ" (ఛా. ఉ. 4-10-5) అను శ్రుతిచే కకారము బ్రహ్మార్థకము కావున దానికి వ్యతిరిక్తముగ నున్నవిబాధితములు.

ఓం కకారార్థాయై నమః

**142.** కాలహంత్రీ :-

(కాలమును హరించునట్టిది.) 'ప్రాణాపాన' మను పేరుకల చంద్ర సూర్యుల నియమనమును జనులకు నియతమును పరిమితమునగు ఆయుఃస్వరూపమందును; ఇది అజపారూపము. దినమునకు 21,600 మార్గనిర్గమించి జనులకు ఆయుఃక్షయ మొందించును. ప్రాణాయామ మొనరించిన ఆయుర్వృద్ధి కలుగును సర్వప్రాణేంద్రియములను సంయమన మొనరించిన బాగుగ సమాధినొందినవారికి వృత్తిలయముకలుగును. అప్పుడు మనోన్మనీ అవస్థ నిష్పన్న మగును. 'పృథివ్యప్తేజోఽనిలఖే సముత్థితే పంచాత్మకే యోగగుణే ప్రవృత్తే, న తస్య రోగో న జరా న మృత్యుః ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరమ్' (శ్వే. ఉ, 2-12):పృథివి జలము తేజస్సు వాయువు

(1) మేరుదండమునకు వెలుపల ఎడమప్రైపున ఉన్న నాడి చంద్రనాడి (ఇడ) కుడిప్రైపున నున్నది. సూర్యనాడి (పింగళ), ఈ రెంటికి మధ్యన త్రిగుణాత్మకమై చంద్ర సూర్యాగ్ని రూపమైన సుషుమ్నానాడి ఉన్నది. ఇడాపింగళలు నాసారంధ్రమువరకు వ్యాపించి యుండును.

ఆకాశము, ఇవి సముత్థితములైనపుడు, అనగ పంచాత్మకమగు యోగాగ్ని ప్రవృత్తమైనపుడు ఆయోగికి యోగాగ్నిమయమగు శరీరము కలిగి రోగము, జర, మృత్యువు లేకుండ పోవును. అని శ్రుతి 'అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్ష శోకౌ జహాతి' (కఠ, ఉ, 5-12) విషయములనుండి మరలి ఆత్మసమాధానమొందిన ధీరుడు తనను తాను దేవునిగా భావించి హర్షశోకములను విడువును అనియు శ్రుతి కలదు, అట్టి బ్రహ్మమునుండి క్రియాశక్త్యాత్మకమగు కాలముద్భవించెను. 'తతః సంవత్సరోఽజాయత' బ్రహ్మమునుండి సంవత్సరము (కాలము) పుట్టెను. అనిశ్రుతి కావున బ్రహ్మమునందు లయమొందినపుడు(బ్రహ్మమునుండి కలిగిన)కాలముండదు. అందుచే కాలహంత్రీ అనగకాలమును బోగొట్టును, అనగ నశింపజేయును. అని ఈ నామమును నిర్వచించుట యుక్తముగ నుండును.

ఓం కాలహంత్ర్యై నమః

### 143. కామేశీ :-

కామములను అనగ భోగ్యపదార్థములను, అదృష్టానుసారముగ (ఈష్టే) ప్రేరేపించును: కావున ఈమె కామేశి.

ఓం కామేశ్యై నమః

### 144, కామితార్థదా :-

కామితములగు అర్థములనిచ్చునట్టిది. కామితార్థద "ఆప్తకామః" ఆత్మకాముడు ఆప్తకాముడు (బృహ, ఉ. 6 4 6) అని శ్రుతి. ఇక్కడ ఆత్మకు కామితత్వము (కోరబడుట) చెప్పబడెనని; సంసారదశయందు ఆత్మ అప్రాప్తమైన ఆనందము కలదగుటచే అనాప్తమైనట్లు కన్పించును, అపుడు ఆత్యంతికమగు ముక్తి నాకు కావలెనని జనులచే కోరబడును: కావున ఆత్మకు కామితత్వము చెప్పబడినది. కామితమగు అర్థమనగ జ్ఞానము. ఈ జ్ఞానము ఆవరకమగు అజ్ఞానమును బోగొట్టును. అపుడు ఆత్మ ప్రకాశించును. అనగ ప్రాప్త ప్రాప్తి రూపమున (పొందియున్నదానినే పొంది

(1) అజపామంత్రము హంసమంత్రము. జనులందరు తమకు తెలియకుండ గనే హకారముతో వాయువును పీల్చి సకారముతో విడుచుదురు. ఇట్లు జనులు ఈ మంత్రమును తెలియకుండ జపించుచుందురు.దీనిని అజపా మంత్రమందురు. ఈ మంత్రమును గాలిపీల్చు నన్నిసార్లు (అనగ 21600 సార్లు) దినమునకు సాధకులు జపింపవలెను.

(2) మనోన్మనీ - సహస్రారకములమధ్యమందు కామేశ్వరుడు కామేశ్వరీ సహితుడై సామరస్యము నొందుచు నిజానందానుసుఖమున నుండును, ఈస్థానమును మనోన్మనియందురు ఇట అహోరాత్ర విభాగము లేదట అనగ దేశకాలవస్తు బేధము లేదు. ఇది సర్వానందమయ చక్రము.

(3) తతఃసంవత్సర అస (బృహ ఉ, 3-3-4) విరాట్పురుషుని రేతస్సునుండి అండము కలిగెను. అది సంవత్సరముండెను. అనగ సంవత్సర నామక ప్రజాపతి దాని నుండి కలిగెను. అంతకుమున్ను సంవత్సరమనునది, లేదు. అనగ సృష్టిక్రమములో అపుడు సంవత్సరము కలిగినది. కేవల బ్రహ్మమునందు కాలవిభాగము లేదు.

నట్లు) కామితార్థమును ఈమె ఇచ్చును, అనగ ప్రకాశస్వరూపమును అనుభవమును కలుగజేయును,

ఓం కామితార్థదాయై నమః

145. కామసంజీవనీ ;

(కాముని సంజీవింపజేసినది) కాముడు మన్మధుడు. ఇతడు పరమేశ్వర నేత్రాగ్నిచే దహింపబడి భండాసురుడై జన్మించి అనేక కాలములందు దేవలోకము లకు శత్రువై యుండెను, కామశాస్త్రప్రయోగసమయమున, రతీదేవిప్రార్థన తపశ్చర్యా దులచే సంభవించి వానిని ఈమె తన కరుణామృతావలోకముచే సంజీవింపజేసెను, అనగ దానిని మరల సప్రాణునిజేసి, వరములొసంగి వానికి హర్షముకలుగజేసెను,

ఓం కామసంజీవన్యై నమః

146. కల్యా :-

కలయించుటకు అనగ ధ్యానించుటకు యోగ్య కావున ఈమె కల్య లేక ఈమెయొక్క సర్వోత్తమ దేవత్వముచే ఈమె ధ్యానించుటకు యోగ్య. కలిధాతువు కామధేనువు కావున దానినుండి కాపలయు అర్థమును గ్రహిపంవచ్చును,

ఓం కల్యాయై నమః

147. కఠిన స్తనమండలా:-

స్తనముల మండలములు-అనగ ఆదినుండి అంతము వరకు కల ప్రదేశములు. అవి కఠినములు, అనగ కంపము లేనట్టివి. అతిస్థిరములు. అట్టి స్తనమండలము, కలది.

ఓం కఠిన స్తనమండలాయై నమః

కరభోరుః కలానాథముఖీ కచజితాంబుదా

కటాక్షస్యందికరుణా కపాలిప్రాణనాయికా॥

148. కరభోరుః :-

కరభములవంటి ఊరువులు కలది. కరభోరు, మణిబంధాదాకనిష్ఠం కరస్య కరభో బహిః అని అమరము. మనికట్టు మొదలుకొని చిటికినవ్రేలు మొదటిదాకగల చేతి వెలుపలిచోటు కరభము.

(1) పరమేశ్వర నేత్రాగ్ని దగ్ధమైన మన్మధుని భస్మమునుండి భండాసురుడు కలిగెను. ఆతడు నపుంసకుడై బ్రహ్మశాపదగ్ధుడై లోకములను పీడించు చుండెను, అపుడు దేవతలు మహాయాగ విధానమున అగ్నినుండి లలితా దేవి నుద్భవింపజేసిరి. ఆమె, సంపత్కరి, అశ్వరూఢ మొదలైన శక్తి సమూహముతో భండాసురునిపై దాడివెడలి వానిని వధించి మరల మన్మధుని ఉజ్జీవింపజేసినది. - అని లలితో పాఖ్యానమందలి గాధ,

(2) కలివతీ కామధానూ అని వైయాకరణ సమయము, కలిసలి అను ధాతువులను ఇచ్చవచ్చిన అర్ధములో ప్రయోగింపవచ్చును.

(3) కలివతీ కామధానూ అని వైయాకరణ సమయము, కలివలి అను ధాతువులను ఇచ్చివచ్చిన అర్థములో ప్రయోగింపవచ్చును.

ఓం కరభోరవే నమః

**149. కలానాధముఖీ :-**

(చంద్రముఖి) కళలనగ చతుష్షష్టికళలు, కళలను ప్రేరేపించువాడు కళానాధుడు నిశ్వసిత మేత ద్యద్ ఋగ్వేదో యజుర్వేదఃసామవేదః వీని నిశ్వసితములే ఋగ్యజుస్సామములు అను శ్రుతివేతను (బృహ, ఉ. 4-4-10) శాస్త్రయోనిత్వాత్ (బ్ర మా. 1- -1)అను న్యాయముచేతను బ్రహ్మము నుండి వేదములు మొదలైనవి కలుగుట చెప్పబడినది. అట్టి చతుష్షష్టికళానాధునివంటి ముఖము కలది, అని గాని, లేక, కళానాధునివంటి అనగ చంద్రునివంటి ముఖముకలదనిగాని అర్థము.

ఓం కలానాధముఖ్యై నమః

**150. కచజితాంబుదా :-**

(కేశములచే జయింపబడిన మేఘములుకలది.) కచములచే అనగ కేశభారముచే లేక కబరముచే జితములు-అధరీకృతమగు అంబుదములు - మేఘములు కలది కచజితాంబుద అనగ మేఘమండలముకంటె పైనున్న శిరోరుహభారముకలది. అనగ వ్యోమకేశి అని భావము లేక కేశములందున్న నీలరూపముచే, సాదృశ్యమును సహింపక ధిక్కృతములగు మేఘములు కలది - కచజితాంబుద అని చెప్పవచ్చును.

ఓం కచజితాంబుదాయై నమః

**151. కటాక్షస్యందికరుణా ;-**

(కటాక్షమునుండి ప్రవహించుచున్న కరుణ కలది.) కరుణ అనగదీనులందు దేవతలకు గల పరిపాల్యతాబుద్ధి కరుణ అంతరమైన దగుటచే బయటకు కనుబడదు కాని, సేవాకాలమున దేవతలందు భక్తులను భక్త్యతిశయము కలుగుచున్నది. కావున కరుణాను రూపమగు సాత్త్వికవీక్షణ స్మేర సంభాషణాదులు దేవతలందుండియుండవలెను. కార్యమునందు కనుపడుచున్నది, కారణమునందుండవలెనుగదా! (భక్తులందు కరుణ చూపించుచున్నందున దేవతలందు కరుణారస ముండియుండవలెను గదా!) నవరసములందు కరుణ అంతర్భూతము. రసశబ్దము మధురాదిరసములందు రూఢము ఈరసములు అనిర్వచనీయములైనను అనుభవముచే చెరకు మొదలైన పదార్థములందున్నట్లు మనకు తెలియుచున్నది. ఈ సంబంధముచే, పరం పరగ ద్రవద్రవ్యమం

దున్న స్యందనము (జారుట) అను క్రియకు ఆశ్రయత్వము ఇట కటాక్షమునకు చెప్పబడినది, కావున కటాక్షమునుండి స్యందినియగు (జారుచున్న) కరుణ కలది కటాక్షస్యంది కరుణ,

ఓం కటాక్ష్యస్యందికరుణాయై నమః

152. కపాలి ప్రాణ నాయికా :—

కపాలము కలవాడు కపాలి - ఆనందభైరవుడు వానియొక్క ప్రాణ నాయిక కపాలిప్రాణనాయిక. ప్రాణమను పదము పంచప్రాణములకు ఉపలక్షణము. నాయిక అనగ అధిష్ఠానరూపమున ప్రేరిక (ప్రేరేపించునది) న ప్రాణేన నాఽపానేన మర్త్యో జీవతి కశ్చన । ఇతరేణ తు జీవంతి యస్మిన్నేతా వుపాశ్రితౌ ॥ (కఠ ఉ. 5.5) ప్రాణాపానమునలచే మర్త్యులు జీవింపరు : ఇవి దేని నాశ్రయించి యున్నవో దానిచేత జీవించుచున్నారు. అని శ్రుతి. అనగ ఈమె కపాలికికూడ హృదయాంతర్వర్తియగు పరమేశ్వరరూప, లేక కపాలియొక్క ప్రాణనాయిక అనగ ప్రాణ వల్లభ-ప్రియ

(1) ఋగ్వేదము మొదలైన శాస్త్రములకు బ్రహ్మమేకర్త, కావున బ్రహ్మము సర్వజ్ఞమని ఈ సూత్రమునకు అర్థము.

ఓం కపాలి ప్రాణనాయికాయై నమః

కారుణ్యవిగ్రహా కాంతా కాంతిధూతజపావలిః
కలాలాపా కంబుకంఠీ కరనిర్జితపల్లవా॥

153. కారుణ్యవిగ్రహా :—

(కారుణ్యమూర్తి) కారుణ్యమనగ వెనుకచెప్పిన కరుణయొక్క భావము: అనగ కృప కారుణ్యమే విగ్రహముగ మూర్తిగ కలది-కారుణ్యవిగ్రహా. కారుణ్యము అంతఃకరణపరిణామమగు బుద్ధిరూపము; నేత్రాంత వీక్షణము, సస్మితభాషణము మొదలైనవానిచే ఊహింపతగినదే. కాని ఆకారుణ్యమువలన కలుగుచున్న భక్త

మనోవాంఛిత ప్రదానాదులు శరీరావయవ విశేషములవలన కలుగుచున్నవి. కావున కారుణ్యము విగ్రహముగ కలది అని సమాసము చెప్పుట సమంజసముగ నుండును. మాయోపాధికమగు బ్రహ్మమునకు జగత్సృష్టికి అనుకరణమైనట్టిదియు హేతుభూతమైనట్టిదియు స్వేచ్ఛామాత్ర నిమిత్తకమైనదియు కర్మకు అధీనము కానిదియు ఘనీభూతసచ్చిదానందాత్మకమును భక్తజనముగ్రహించునట్టిదియునగు విగ్రహమును కల్పింపకున్నచో దేవతను బుద్ధియందారోపించుటకు వీలు కలుగదు సగుణోపాసమునకు వీలుకలుగదు. కావున బాధకము లేనపుడు, 'వజ్రహస్తః పురందరః' అనునట్టి స్వతః ప్రమాణ వేదవాక్యములవలన మంత్రప్రకాశితలగు దేవతలు విగ్రహవంతులని దేవతాధికరణమునందు, బ్రహ్మసూత్రములందు ప్రతిష్ఠాపింపబడినవి ఆరీతిగానె "బహుశోభమానాముమాం హైమవతీం"3 అను కేనోపనిత్తుయొక్క భాష్యమందు "హైమవతి" అనునపుడు హేమవికారములు కలిగిన భూషణములు కలది అనియు. హిమవంతుని అపత్యము స్త్రీ అనియు అర్థము చెప్పబడి పరదేవతకు విగ్రహముండుట ప్రతిష్ఠింపబడినది. కావున మహానుభావులను. స్వప్రకాశ చైతన్యరూపులను సర్వోత్తములునగు త్రిమూర్తి దేవతలకు, భక్తులకు ధ్యానాద్యుపకారములు కలుగుటకై, ఆట్టిమూర్తి కలదని చెప్పబడినందున ప్రసంగమునకు అవకాశము తొలగిపోవుచున్నది. కావున ఈ విషయములో ఇంక విస్తరింపనక్కరలేదు.

(1) నేత్రములనుండి నేత్రాంతవీక్షణము, ముఖమునుండి సస్మితభాషణము మొదలైనవానివలన కలుగుచున్నది.

(2) దేవతలకుగల ఐశ్వర్యాతిశయముచే యథేష్టమగు రూపమును గ్రహింపగలశక్తి వారికున్నదని దేవతాధికరణములో చెప్పబడినది. మేధాతిథి అను ముని ఇంద్రుని మేషరూప సంబోధింపగ ఇంద్రుడు మేషరూపమునొంది వానిని హరించెను.

(3) బ్రహ్మమువలననే దేవాసురుల యుద్ధములో దేవతలకు జయము లభించెను. కాని దేవతలు తమ ప్రభావమువలననే జయముకలిగినదని అహంకరించియుండిరి. వారి అహంకారమును పోగొట్టుటకు బ్రహ్మము ఒక యక్షరూపమున వారికగుపడెను. దేవతలకది యేమియో తెలియక తెలుసుకొనిరమ్మని అగ్నిని పంపిరి. నీకెట్టి సామర్థ్యము కలదని యక్షము నడిగెను.

ఓం కామగోపాలవిగ్రహాయై నమః

154. కాంతా :–

కన' ధాతువు దీప్తి అను అర్థము కలది, కావున కాంత అనగ అత్యంత మనోహరతమమైనది, లేక మదనగోపాలవిగ్రహము కలది అని అర్థము "కదాచి దాద్యాలలితా పుంరూపా కృష్ణవిగ్రహా వంశనాదవినోదేన కరోతి వివశంజగత్"! ఆద్యయగు లలిత ఒకప్పుడు పుంరూపముతో కృష్ణవిగ్రహయై వేణునాద వినోదముచే జగమును వివశము చేయుచుండును"—అని త్రిపురతాపనీయము.

ఓం కాంతాయై నమః

155. కాంతిధూతజపావళి :

(కాంతిచే తిరస్కృతమైన జపాపుష్పముల పంక్తికలది) జపాపుష్పముల యొక్క ఆవళి అనగ పంక్తి జపావళి - జపాపుష్పములు ఇతరములగు ఆరక్త వర్ణములగు పుష్పములకు ఉపలక్షణము. వీనిని దృష్టాంతముగ తీసికొని కవులు ఉత్ప్రేక్ష నొనరింతురు. కాంతిచే - అప్రాకృతమగు పరమానందచిద్రూప ప్రకాశముచే, ధూతములు - పరిత్యక్తములగు జపావళి కలది. జపావళులు ప్రాకృతములగుటచేతను అల్పకాంతిని కలిగియుండుటచేతను ఈమె కాంతిచే అవి పరిత్యక్తములైనవి. "నహి మహాంతోనీచై రుపమీయంతే" గొప్పదగువానికి నీచములగువానితో ఉపమానము చెప్పరు" అని న్యాయము.

ఓం కాంతిధూతజపావళ్యై నమః

నేను సర్వమును దహింతునని అగ్ని చెప్పగ "దీనిని దహింపుమని" ఒక తృణమును అగ్నికిచ్చెను. అగ్నికి సాధ్యపడలేదు. అప్పుడగ్ని వెడలి పోయెను. తరువాత వాయువు వచ్చి ఆ తృణమును కదలింపలేక వెడలి పోయెను. ఇంద్రుడు వచ్చినపుడు ఆయక్ష మదృశ్యమయ్యెను, ఆకాశము నందు హిమవంతుని పుత్రి ఉమ సాక్షాత్కరించెను. ఆమెయొద్దకు పోయి ఈయక్షమేమని ఇంద్రుడడిగెను. అదియే బ్రహ్మము, దానివలననే మీకు విజయము కలిగినది" అని ఉమ చెప్పెను. అగ్ని, వాయువు, మహేం

ద్రుడు అపుడు బ్రహ్మమును తెలుసుకొనిరి. ఆ విధముగ తెలుసుకొనుటచే వారు దేవతలలో శ్రేష్ఠులైరి—అని కేనోపనిషత్తు.

---

(1) ఈ వాక్యము తంత్రరాజములోని దని దేవీభాగవత నీలకంఠీయవ్యాఖ్యలో నున్నది. (ఇది త్రిపురతాపనీయములో కనబడలేదు) పురుషులలో కృష్ణాదులు ప్రకృతులలో దుర్గాదులు అయిదుగురు మూలప్రకృతియొక్క పూర్ణావతారములని, గోపాలసుందరీరూప శ్రీ కృష్ణునకు దుర్గాది పంచప్రకృతులకు అభేదమని, వీరే మాయాశబల బ్రహ్మరూపులని ఆవాఖ్యానములో నున్నది, పంచప్రకృతులనగ దుర్గ, రాధ, లక్ష్మి, సరస్వతి, సావిత్రి, మూల ప్రకృతియే మహిషాసురుని సంహరించినపుడు దుర్గ అని చెప్పబడినది. ఈమెయే భండాసురుని సంహరించినపుడు లలితయైనది.

156. కలాలాపా :—

కళలు చతుష్షష్టి కళలు, వానిని అలాపముగ వ్యావహారిక శబ్దముగ కలది కలాలాప. "వేదశాస్త్రమయీ వాణీయస్యాః సా పరదేవతా" వేదశాస్త్రమయమగు వాణికలది వరదేవత అని వచనము. లేక, కలః ఆనగ, అవ్యక్తమధురము, సుప్రయోజనమునగు ఆలాపః సంలాపము-ఆలాపము దీనిని కలది-కలాలాప అని చెప్పవచ్చును. "అవ్యక్తా భారతీ తథా", (మధుర) మగు పల్కులు కలిగియుండుచు మహాపురుషలక్షణము, అని వచనము.

ఓం కలాలాపాయై నమః

157. కంబుకంఠీ :—

(శంఖమువంటి కంఠము కలది) కంబు (శంఖ) శబ్దముచే శంఖమునందున్న రేఖాత్రాయము చెప్పబడుచున్నది. ఆనగ శంఖమందున్న గుణముమ రేఖాత్రితయమును కలది అనుగుణవామమిక్కడ చెప్పబడినది

ఓం కంబుకంఠ్యై నమః

158. కరనిర్జితపల్లవా :-

(కరతములచే నిర్జితమగు పల్లవము కలది) కరశబ్దముచే ఇక్కడ కరతలము చెప్పబడుచున్నది. పల్లవశబ్దముచే దానియందుండు పాటల్యము (ఎరుపుతనము)

స్నిగ్ధత లక్షణచే చెప్పబడుచున్నవి. కరముచే నిర్జితమగు పల్లవము కలది - కరనిర్జిత పల్లవ అనగ ఒకదానియందు (కరమునందు) ఉన్నగుణముచే మరియొకదానియందు (పల్లవమునందు) ఉన్నగుణము నిర్జితము,- అర్థాత్, ఒక గుణము కలదానిచేత రెండవగుణము కలది పరాజితమైనది. కావున ఈ నామము నిట్లు చెప్పట ఉపపన్నముగ నున్నది. "వివాహశ్చ వివాదశ్చ సమయో రేవ శోభతే", వివాహము వివాదము సములైనవారి మధ్య జరిగిన శోభించును" అని వచనము. ఈ నామముచే కరతలమునందు పల్లవసామ్యమున్నదని ధ్వనితము

ఓం కరనిర్జితపల్లవాయై నమః

కల్పవల్లీ సమభుజా కస్తూరీతిలకాంచితా !
హకారార్థా హంసగతిర్హాటకాభరణోజ్జ్వలా ॥ 50

159. కల్పవల్లీసమభుజా :-

(కల్పవల్లితో సమములగు భుజములు కలది) నందనోద్యానమందు అలంకారభూతములగు దివ్యవృక్షములు ప్రసిద్ధములైనట్లుగ వల్ల్యాదులు (తీగెలు) కూడ ప్రసిద్ధములైయున్నవి కల్పించునట్టివి-సంపాదించునట్టివి. కనుక కల్పములు. కల్పములగు వల్లులు కల్పవల్లులు, కల్పవల్లులతో సమమగు భుజములుకలది కావున ఈమె కల్పవల్లీ సమభుజ. కవిసంప్రదాయము ననుసరించి స్త్రీభుజములకు వల్లితో సమానత్వము చెప్పబడినదని భావింపవలెను. ఈ నామములోని సమపదస్వారస్యమున వల్లులకు కూడ వానియందున్న చైతన్యముద్వారా, చేతనపదార్థమువలె, యథాప్రారబ్ధముగ లోకవాంఛితఫలము నీయగలుగు సామర్థ్యమున్నదని ధ్వనించుచున్నది. "ఏకస్తథా సర్వభూతాంతరాత్మా రూపం రూపం ప్రతిరూపం ప్రతిరూపో బహిశ్చ" (కఠ ఉ 5-9) ఏకమగు సర్వభూతాంతరాత్మ బహువిధరూపుడై వ్యాపించెను అని శ్రుతియందును, "తత్తదేవాఽవగచ్ఛత్వం మమ తేజోంశసంభవమ్" (భగీ.10-41) సర్వపదార్థములు "నా తేజస్సుయొక్క అంశమువలన జనించినవి", అని స్మృతియందును భగవంతునిచే సర్వపదార్థములందును స్వకీయసచ్చిదానంద స్వరూపావస్థితియే చెప్పబడినది. ఇట్లు చెప్పబడినందున పరదేవీభుజములకు సామ్యము లేదుకదా అనుశంక తొలగిపోయినదని గమనింపవలెను. ఔపాధిక చైతన్యమునకు ఔపధిక చైతన్యముతోడనే సామ్యము యుక్తము.

ఓం కల్పవల్లిసమభుజాయై నమః

160. కస్తూరీతిలకాంచితా :-

కస్తూరీతిలకముచే అంచిత అనగ అలంకృత. లలాటప్రదేశమున బిందు రూపమగు మృగనాభిచే చిహ్నిత అని అర్థము.

ఓం కస్తూరీతిలకాంచితాయై నమః

161. హకారార్థా: -

హకారము ఆకాశబీజము, దానియొక్క అర్థరూపమైనది హకారార్థ అనగ ఈమె ఆకాశబీజముచే చెప్పబడిన స్వరూప చైతన్యము, ఆకాశవిగ్రహ అని అర్థము. "ఆకాశోహవై నామరూపయో ర్నిర్వహితా తే యదంతా తే యదంతరాత ద్బ్రహ్మ" (ఛా ఉ. 8-14-1) ఆకాశమనగ నామరూపముల నిర్వహించునట్టిది, అదే, నామరూపముల మధ్యను వానిచే స్పృశింపబడకుండ ఉండునట్టి బ్రహ్మము

ఓం హకారార్థాయై నమః

(162) హంసగతిః :-

(హంసగతి కలది) హన్ధాతువునుండి హంస శబ్దము ఉత్పన్నమైనది. హంతి వెళ్ళునది కావున హంస అనగ ప్రాణమునిగాని అదిత్యుడనిగాని చెప్ప వచ్చును. హంసయొక్క అనగ ప్రాణముయొక్క, గతి - గమనాగమనము కలిగినది హంసగతి. అనగ ప్రాణముచే జపింపబడు అజపామంత్ర రూపముకలది అని లక్షణచే అర్థము కలుగుచున్నది. "హకారేణ బహిర్యాతి సకారేణ పునర్విశేత్" శ్వాస, హకారముతో బయల్వెడలును, సకారముతో ప్రవేశించును, అని వచనము లేక హంస శబ్దమునకు అదిత్యుడు అని అర్థముకూడ చెప్పవచ్చును అహో రాత్ర్యాత్మక కాలస్వరూపయగు నీమెకు హంసాభిమాని దేవతారూపములును, అగ్నీ షోమాత్మకములునగు సూర్యచంద్రగతులు కలవు గాన ఈమె హంసగతి. లేక, హంతి - అనగ స్వకర్మవశముచే ఒక దేహమునుండి మరియొక దేహముని పొందు

(1) హకారము ఆకాశబీజము ఆకాశమనగ బ్రహ్మమని శ్రుతులందు ప్రసిద్ధము, కావున హకారార్థ అనినపుడు హకారముయొక్క అర్థమగు ఆత్మపదార్థమే, చైతన్య స్వరూపమే ఈమె యని తెలియుచున్నది.

చుండు జీవుడు హంసశబ్దవాచ్యుడు, ఈమె జీవునకు గతి, అనగ పొందదగిన స్థానము, అనగ ముక్తి, కావున హంసగతి అని అర్థము. "బ్రహ్మవిదాప్నోతి పరమ్" (తై. ఉ. 2-1) పరమమును బ్రహ్మవేత్త పొందును, అని శ్రుతి. "యద్గత్వా న నివర్తంతే" దీనినిపొంది మరలినారో (భ గీ 15-6) అని శ్రుతి లేక హంస అనగ పరమేశ్వరుడు, స్వకార్యభూతమగు జగతునందు ప్రవేశించునట్టివాడు కావున హంస అనగ పరమేశ్వరుడని అర్థము చెప్పబడినది. "హంస స్తు పరమేశ్వరః" అని నృసింహతాపనీయము నందున్నది చతుర్విధభక్తులచేతను 1 శరణత్వమున పొందబడునది కావున ఈమెయేగతి ఈమెయే గతియు, అని సామానాధికరణ్యసమాసము. "హంసః శుచిషత్" (కఠ. ఉ. 5-2) పరమాత్మ స్వరూపుడగు హంస దీనియందు ఆదిత్యరూపమున ఉండును, అని శ్రుతి లేక. బ్రహ్మవాహనమగు హంసయొక్క గతి (గమనము) కలిగినది కావున హంసగతి లేక, నామైకదేశమగు (నామములో ఒక భాగమగు) హంస శబ్దముచే హంసకము అను పాదకటకము (పాదముల ఆభరణము) చెప్పబడుచున్నది కావున — గతి అనగ చరణము. హంసయుక్తములగు గతి పాదారవిందములు కలది, కావున ఈమె హంసగతి-అని అర్థము లేక (హంతి) ప్రతిగ్రామముల్ ప్రతిదేశము పోవుచుండువారు హంసలు అనగ పరివ్రాజకులు. వారు నిత్యానిత్య సారాసార జడాజడాది వస్తువివేక సమర్థులు, నిష్కాములునగు చతుర్థాశ్రమిణులు. వారికి గతి, అనగ వారిచే పొందబడునది, తెలుసుకొనబడినది, సాక్షాత్కార మొందబడినది, కావున వారికీమెగతి, "సంన్యాస యోగాద్యతయ శ్శుద్ధసత్త్వాః" (ము. ఉ. 6-6.) సంన్యాస యోగముచే యతులు శుద్ధ సత్త్వులు, అని శ్రుతి. "యే పూర్వం దేవా ఋషయశ్చ తద్విదుః తే తన్మయో అమృతా వై బభూవుః" పూర్వము ఏ ఋషులు, ఏ దేవతలు బ్రహ్మము నెరింగియుండిరో వారు బ్రహ్మమయులై అమృతులైరి. అని శ్రుతి. అనగ ఈమె జీవన్ముక్తపురుషులచే అనుభవింపబడు పరమానంద రూపముక్తి యొక్క స్వరూపము కలది అని అర్థము.

ఓం హంసగత్యై నమః

163. హాటకాభరణోజ్జ్వలా :-

(సువర్ణాభరణములచే ప్రకాశించుచున్నది) హాటకమనగ సువర్ణము. దానియొక్క కార్యములు ఆభరణములు, ఆభరణములచే (బంగారు నగలచే) ఉజ్జ్వల

అనగ ప్రకాశిత, అలంకృత అని అర్థము. హాటకమునకు అనగ సువర్ణరూప బ్రహ్మమునకు ఆభరణమువలె ఈమె ఉజ్జ్వల, అనగ బ్రహ్మాండమును ప్రకాశింపజేయునట్టిది లేక బ్రహ్మాండముయొక్క సత్తాస్ఫూర్తికరి లేక సువర్ణాభరణములచే, సనాధస్త్రీమండల స్వరూపములగు మంగళసూత్రాదులచే ఈమె ఉజ్జ్వల - అనగ ప్రకాశించుచున్నది లేక, కార్య కారణద్వయరూపమగు వస్తువు[2] యొక్క ప్రధానముచేగాని జ్వలించునది కాపున హాటకాభరణోజ్జ్వల. "వసురంతరిక్షసత్" (కఠ ఉ 5-2) వసుః అనగ వాయురూపమున అందరిని వసింపచేయునట్టిది. అంతరిక్షమున నుండునట్టిది" అని శ్రుతి

ఓం హాటకాభరణోజ్జ్వలాయై నమః

హారహారికుచాభోగా హాకిని హాల్యవర్జితా
హారిత్పతిసమారాధ్యా హాఠాత్కారహతాసురా॥ 31

164. హారహారికుచాభోగా :-

(హారములు కలిగిన కుచప్రదేశము కలది) హరునకు అనగ పరమేశ్వరునకు సంబంధించినవి హరములు - అనగ ఈశ్వరత్వ ఆప్తకామత్వ నిత్యతృప్తత్వాది గుణములు వీనిని, తద్విపరీతమగు అవిద్యను కల్పించి, హరించునట్టిది కావున హారహారి. కుచముల అభోగము అనగ పర్యంతభూమి; హారహారి యగు కుచాభోగము కలది కావున హారహారికుచాభోగ. ఈశ్వరునకీమెయందు వాంఛకలిగి తదాసక్తమనస్కుడై యుండుటచే ఆమెవలన కలుగుచున్న అవిద్యకు వశుడగును, అపుడు మాయను స్వాధీనమున కలిగియుండునట్టి ఈశ్వరత్వాది గుణములతోపాటు నుండునట్టి (పైన చెప్పిన) ఆప్తకామత్వాది గుణములు అపహృతములగును. జీవేశ్వరుల

(1) చతుర్విధా భజంతే మాం జానాస్సుకృతినోఽర్జున ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ భ. గీ. 7-16 అర్థుడు, అర్థులు జిజ్ఞాసులు, జ్ఞానులు నన్ను భజింతురు.

(2) వసువనగ ధనము, సువర్ణము ఇత్యాది అర్థములున్నవి. హాటకమునకు 'వసువు' అని అర్థము చెప్పి వసురంతరిక్షసత్ అని శ్రుతి ఉదహరింపబడినది.

కొక్క తావున ఈశ్వరత్వాది ఆ ప్తకామత్వాది గుణములకు సామానాధికరణ్యముండదు. కావున ఇట్లు అపహ్యతములగును. "ఇది నాకు ఇష్టసాధనమని" అన్యపదార్థమునం దీశ్వరునకు బహూభవనరూపమున1 బుద్ధికలుగుటచే వారి జగదాకారత్వమునకు ఈకుచములు ఆధారికములు, అందుచే అధికగుణోత్ప్రేక్షకు విషయమగు ఈకుచముల అభోగము అతిశయోక్తిగ చెప్పబడినదని గ్రహింపవలెను. లేక, హారములను అనగ ముక్తాస్రజములను హరించును, గ్రహించును, కావున హారహారి. హారిహారియగు కుచాభోగము కలది, అనగ కాలోచితముగ షట్ప్రకారముక్తాహారముచే అలంకృత అని ర్థము.

ఓం హారహారికుచాభోగాయై నమః

**165. హాకినీ :–**

(పాపములను ఛేదించునది) హాక్ అను ధాతువు ఛేదము అను అర్థము కలది, కనుక హాకిని అనగ జనగుణములను ఛేదించునది అని అర్థము.

ఓం హాకిన్యై నమః

**1<sub></sub>6. హల్యవర్జితా :–**

(పాపరహిత) హలమునకు (నాగలికి) సంబంధించినది హల్యము, అనగ కృషివలన కలుగునట్టిది. హల్యములేనిది హల్యవర్జిత. అనగ ఈమె కామాదులు లేనట్టి శుద్ధచైతన్యస్వరూప అని అర్థము. లేక హల్యము అనగ కపటము; అనగ మిత్రములందు అన్యవిధముగ స్వాంతఃకరణము నావిష్కరించుట. హల్యవర్జిత అనగ కపటము లేనిది. ఈమె అవిద్యాదులు లేనట్టి తత్త్వంపదలక్ష్యార్థస్వరూప అని అర్థము.

ఓం హల్యవర్జితాయై నమః

**167. హరిత్పతిసమారాధ్యా :–**

(ఇంద్రాదులచే సమారాధ్య) హరిత్తుల యొక్క అనగ దిశలయొక్క పతులు=హరిత్పతులు మహేంద్రాదులు. హరిత్పతులచే బాగుగ, శ్రద్ధాభక్తిపూర్వక

ముగ ఆరాధింపబడుటకు యోగ్య. వారి శత్రువులను చ పుటచే వారిచే ఇష్టప్రాపక మగు దైవత మీమె యని అభిప్రాయము.

ఓం హరిత్పతిసమారాధ్యాయై నమః

(1) "బహుస్యాంప్రజాయేయ" తాను అనేకము కావలెనని ఈశ్వరునకు బహుభవనరూప సంకల్పము కలిగినది.

168. హఠాత్కారహతాసురా :-

హఠాత్కారముచే, అతి శీఘ్రముగ హతులు = పరాభూతులగు, అసురులు మహిషాదులు కలది, హఠాత్కారహతాసుర, లోకమునందు సమబలము కలిగి యున్న విరోధులందు సామాద్యుపాయములు బలాబలవిచారణ ఉండును ప్రబలుడగు వానికి దుర్బలుడగు వైరి యున్న, సింహమునకు మేషమున్నట్లు, ఎట్టి విచారణ ఉండదు. (ఈమె ప్రబల అగుటవలన అసురులను అతిశీఘ్రముగ వధించును.) కావున ఈమె అతిత్వరితముగ దేవలోకమునకే సుఖప్రదయైనపుడు ఇతరుల విషయములో చెప్పవలెనా ! అను కైముతిక న్యాయమున సుఖప్రదానకారణత్వము ధ్వనిత మగుచున్నది.

ఓం హఠాత్కారహతాసురాయై నమః

హర్షప్రదా హవిర్భోక్త్రీ హార్దసంతమసాపహా
హల్లీసలాస్యసంతుష్టా హంసమంత్రార్థరూపిణీ॥

169. హర్షప్రదా :-

(హర్షమునిచ్చునట్టిది) ఆనందము కలిగించునట్టిది హర్షము. ముఖవికాసాదికార్యమునుబట్టి ఒకరియందు హర్షమున్నదని గ్రహింపవచ్చును ఇది ఆత్మగౌరవము. ఇతర తిరస్కారము కలిగించునట్టి చిత్తవృత్తి విశేషము. కార్యమునకు కారణమునకు అవినాభావ సంబంధము. కావున హర్షప్రద అను నామమున హర్షప్రదానముచే హర్షహేతువు (సుఖము) తెలియజేయబడుచున్నది[1] కావున హర్షమునిచ్చునట్టిది, అనగ సుఖమునిచ్చునట్టిది కావున హర్షప్రద. లేక హర్షమనగ ధనయౌవనాది సుఖము. అట్టి హర్షమును, పుత్రబంధువర్గాది రూపమగు హర్షమును - (ప్రకర్షేణ ద్యతి) పరిహరించునట్టి, ఖండించునట్టిది కావున హర్షప్రద.

ఓం హర్ష ప్రదాయై నమః

170. హవిర్భోక్త్రీ :-

హవిస్సులను భుజించునట్టిది హవిర్భోక్త్రీ. "స బ్రహ్మ స శివః స హరిః సేంద్ర సోఽక్షరః పరమః స్వరాట్" (నృసి. తా. 1-4) అతడు బ్రహ్మ, శివుడు, హరి, ఇంద్రుడు, అక్షరుడు, పరముడు, స్వరాట్" అని శ్రుతిచే, అగ్ని యందు యజమానులచే ప్రక్షిప్తములైన హవిస్సులను స్వాహాముఖమున వసు. రుద్రాదిత్యాకారమున ఈమెయే భుజించును, కావున ఈమె హవిర్భోక్త్రీ. లేక హవిస్సులనగ కాలాంతరమందు కలుగు ఫలములు, ఇవి అదృష్టాత్మకములగు సూక్ష్మరూపములై యజ్ఞమొనరించిన జీవులను అవలంబించియుండును, వీనికి భూతసూక్ష్మములని పేరు. అవి సమష్టిరూపమున (మాయ అను పేరున) ఈశ్వరునకు ఉపాధియైనవి. వ్యష్టిరూపమున, అవిద్యరూపమున జీవునకు ఉపాధియైనవి. వీనిని ముక్తి పర్యంతము ఈమె భుజించును, అనగ పరిపాలించును కావున హవిర్భోక్త్రీ ఈవిధముగ అర్థము చెప్పుకున్న యెడల సంసారమునకు (ప్రపంచమునకు) అనాదిత్వతము లేకుండుట సంభవించును, అపుడు ఆదిమశరీరాద్యుత్పత్తిని అంగీకరింపవలెను, అంగీకరించినయెడల ప్రపంచమునకు ఆకస్మికత్వము (ఆకస్మాత్తుగ కలిగినదనుట) అకృతాభ్యాగము ప్రసంగము (అకృతమైనది కలిగినదనుముట) సంభవించును. ఇట్లు

(1) ఈమె సుఖస్వరూప కావున సుఖము నియగలుగుచున్నది.

సంభవింపకనుండుటకై కాలాంతరభావిఫలములు అదృష్టద్వారమునసూక్ష్మరూపములై జీవేశ్వరుల పొందియుండునని చెప్పబడినది.

ఓం హవిర్భోక్త్ర్యై నమః

171. హార్దసంతమసాపహా :-

(హృదయమందలి చీకటిని అపహరించునట్టిది) హృదయముతో కూడినది హార్దము "యో వేద నిహితము గుహాయాం") తై ఉ. 2-1) హృదయమందున్న దాని నెరిగినవాడు సర్వకాలమును పొందును" అని శ్రుతి. హార్దమగు సంతమసము- హార్దసంతమసము; హృదయమందు "తమ ఆసీత్" అను శ్రుతిచే ఆత్మవిషయమున ఆవారకమగు సంతసము (చీకటి) కలదు ఇది హృదయము నవలంబించియున్న

అనర్థకరమైన అజ్ఞానము. ఇట్టి హార్దసంతమసమును, మహావాక్యశ్రవణము వలన కలిగిన బుద్ధివృత్తి ప్రతిఫలితాకారమున, ఈమె పోగొట్టును కావున ఈమె హార్దసంతమసాపహ. నేను బ్రహ్మమును కాను, నేను సంసారిని, బ్రహ్మమనునది లేదు, భాసించుటలేదు. అను అజ్ఞానము "నేనే బ్రహ్మమును; సచ్చిదానందలక్షణుడను, అను ఏకాకారివృత్తిజ్ఞానముచే బాధింపబడుచున్నది. కావున ఈమె బాధాధిష్ఠానము[1], "నేహ నానాఽస్తికించన" ఇక్కడ అనేకమగునది లేదు, అను శ్రుతిచే చెప్పబడిన బ్రహ్మస్వరూప అని అర్థము.

ఓం హార్దసంతమసాపహాయైన నమః

172. హల్లీసలాస్యసంతుష్టా :-

(హల్లీసమను నాట్యముచే సంతుష్ట) హల్లీసమను లాస్యము అనగ వర్తనము. హల్లీసలాస్యము. చిత్రదండములను గ్రహించి ఏకతాళాది యుక్తగీత పూర్వకముగ కుమారికలు చేయునర్తనము హల్లీసము "నారీణాం మండలీ నృత్యం బుధా హల్లీసకము విదుః" స్త్రీలు చేయునట్టి మండలీనృత్యము హల్లీసకము" అని హారావళీకోశము. హల్లీసలాస్యముచే ఈమె సంతుష్ట-దానియందు ప్రీతికలది, మండలాకారనృత్య సంతుష్ట-అని అర్థము.

ఓం హల్లీసలాస్యసంతుష్టాయై నమః

(1) కార్యముకంటె కారణభిన్నమను జ్ఞానము బాధ అనగ కార్యమగు జగత్తు కారణమగు బ్రహ్మముకంటె అభిన్నము అను బాధకు (జ్ఞానమునకు) ఈమె అధిష్ఠానము, అనగ ఆధారము, అనగ కారణమగు ఈమెయే కార్యమైనది.

(2) హంసస్సోఽహం" అనునది అజపామంత్రము. ఈ మంత్రములోని హకార సకారములకు మనుజుని శ్వాసకుగల సంబంధము తెలుసుకొనిన వానికి జపింపకుండగనే హంసమంత్రమొనరించిన ఫలము కలుగును, అందుచే ఈ మంత్రమునకు అజపామంత్రమని పేరు కలిగినదని విద్యారణ్యులు సూతసంహితవ్యాఖ్యలో వ్రాసిరి.

173. హంసమంత్రార్థరూపిణీ :—

(ఈమె హంసమంత్రముయొక్క అర్థరూపమైనది) హంసలచే ఉపాసింప బడు మంత్రము - హంసమంత్రము, అనగ ప్రణవము. ఈమె హంసమంత్రము యొక్క అర్థరూపిణి; అనగ శాస్త్రబోధితమగు తత్త్వార్థరూపిణి; అనగ ఈమె వాచ్య లక్ష్యార్థస్వరూపమున తెలియబడుచున్నది. లేక హంసమంత్రమనగ అజపామంత్రము హంకార - సకారములు బోధిత త్వంపదార్థములు హంకారమునందు, సకారమునందు పరోక్షమగు దానిని చెప్పునట్టి భాగమును త్యజించు లక్షణచే ఈమె నిష్ప్రపంచనిత్య శుద్ధముక్తబుద్ధ సచ్చిదానందస్వరూప అని అర్థమగుచున్నది,

ఓం హంసమంత్రార్థరూపిణ్యై నమః

హానోపాదాననిర్ముక్తా హర్షిణీ హరిసోదరీ
హాహాహూహూముఖస్తుత్యా హానివృద్ధివివర్జితా॥

174. హానోపాదాననిర్ముక్తా :—

(స్వీకారపరిత్యాగ క్రియలు లేనట్టిది) హానము పరిత్యాగక్రియ అనిష్ట సాధనమందు హానము, ఇష్టసాధనమందు ఉపాదానము - స్వీకారక్రియ. హానోపాదా నము లనగ పరిజిహీర్ష (పరిత్యజింపవలెను ఇచ్ఛ) ఆదిత్స (గ్రహింపవలెనను ఇచ్ఛ) ఈమె హానోపాదానములచే నిర్ముక్త. "అప్రాణో హ్యమనా శుభ్రః" (ము. ఉ. 2-1-3) ఇది అప్రాణము, అమనస్కము, శుభ్రము, "అకాయం" (ఈశ. ఉ. 8) కాయములేనిది, "అశరీరం వావ సంతం ప్రియాప్రియే న స్పృశతః" (ఛా.ఉ.8-12-1) అశరీరముగ నుండువారికి ప్రియాప్రియము లంటవు, ఇత్యాది శ్రుతులు పెక్కులు కలవు కావున అశరీరమగు బ్రహ్మమునకు అంతఃకరణాది ధర్మములు ఉండవు అందుచే ఈమె హానోపాదాన నిర్ముక్త, నిస్సంగ అని అర్థము. "విముక్తశ్చ విముచ్యతే" (కఠ. ఉ. 5-1) విముక్తుడైనవాడే విమోచితుడగు చున్నాడు" అని శ్రుతి.

ఓం హానోపాదానవినిర్ముక్తాయై నమః

175. హర్షిణి :-

"ఏషహ్యేవానందయతి" (తై. ఉ. 2-7-1) ఇతడే ఆనందింపచేయునట్టి వాడు" అని శ్రుతిచే ఈమె హర్షింపచేయునట్టిది, సంతోషింపచేయునట్టిది, కనుక హర్షిణి.

ఓం హర్షిణ్యై నమః

176. హరిసోదరీ :-

హరి-కృష్ణుడు. వానిసోదరి హరిసోదరి. ఉదరమనగ-ఉత్—అరం= కొంచెము అరము, భేదముకలది. సమానమగు ఉదరముకలది సోదరి. హరికంటె కొలదిగ భిన్నమైనది. (అనగ హరితో సమానమైనది అని అర్థము . లేక, ఉత్ అనగ ఉచ్చైః—ఎక్కువగు అరము=కూటము (మాయ) కలది ఉదరము, అని అర్థము చెప్పవచ్చును. అనగ మిథ్యాభూతమగు మాయను ఉపాధిగ కలిగిన చైతన్యముయొక్క అవస్థానశేషము ఈమెకు రూపముగ కలదు అని అర్థము. "అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్" (భ. గీ. 7-5) దీనికంటె భిన్నముగ పరాప్రకృతి యున్నది. దానిచే జగత్తు ధరింపబడుచున్నది" అని శ్రుతి "దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢాం" (శ్వే. ఉ. 1-3) పరమేశ్వరునియొక్క ఆత్మభూతమై యుండి స్వగుణములచే నిగూఢమైన శక్తిని (జగత్) కారణముగ కనుగొనిరి" అను శ్రుతిచే ఈశ్వరుని యొక్క రూపభేద మంగీకరింపబడినది కావున ఈ విధముగ చెప్పబడినదని భావింపవలెను.

ఓం హరిసోదర్యై నమః

177. హాహాహూహూముఖస్తుత్యా :-

హాహా, హూహూ అను పేర్లు కలిగిన గంధర్వులు ముఖ్యులుగ కలిగిన జనులచే ఈమె స్తుత్య-గుణియందున్న గుణములను చెప్పుట స్తుతి అనబడును. స్తుతికి ఈమె ఆశ్రయముగ ప్రతిపాదింపతగినది కావున హాహాహూహూ ముఖస్తుత్య.

ఓం హాహాహూహూముఖస్తుత్యాయై నమః

178 హానివృద్ధివివర్జితా :-

అవయవముల ఉపచయరూపము (పెరుగుట) వృద్ధి: అపచయరూపము (తగ్గుట) హాని. హానివృద్ధులచే ఈమె వివర్జిత. "న కర్మణా వర్ధతే నో కనీయాన్" (బృహ ఉ. 6-4-23) బ్రహ్మవేత్తయొక్క మహిమ ఎట్టిదనిన అది (నః) కర్మముచే తగ్గదు, అని శ్రుతి హానివృద్ధులు షడ్భావవికారములకు[1] ఉపలక్షణములు. ఈవికారములు శరీరధర్మములు, కర్మములచే కలుగునవి, కావున ఇవి ఈశ్వరునియందు ఉండవు అనగ ఈమె నిర్వికార అని అర్థము

ఓం హానివృద్ధివివర్జితాయై నమః

హయ్యంగవీనహృదయా హరిగోపారుణాంశుకా

లాకారాఖ్యాలతాపూజ్యా లయస్థిత్యుద్భవేశ్వరీ॥ 34

178. హయ్యంగవీనహృదయా :-

హయ్యంగవీనము నవనీతము ఈమె హయ్యంగవీనమువంటి హృదయము కలది అని అర్థము. నవనీతదృశమని చెప్పుటచే విరళమును (పలుచనదియు) మృద్వవయమును పరిణామమున ద్రవత్యము కలదియు అని సాదృశ్యము, అనగ యోగిహృదయములందు కృపారసరూపమున పరిణామము కలది అని అర్థము. పరదేవతకు హృదయమును అవయవము లేనప్పటికిని ఈమెయుక్క సర్వాత్మరూపమున హృదయము కలది అని చెప్పబడినది. లేక. "అవాగమనాః" (ము. ఉ.2-1-1) అను శ్రుతిచే బ్రహ్మమునకు వాక్కు, మనస్సు మొదలైనవి లేవని చెప్పబడినది. కావున హృదయము అనగ దయ అని ఈపక్షము నవలంబించి అర్థము చెప్పవచ్చును. దేవతలకు ఈక్షణాదులు కలుగుట శ్రుతిచే చెప్పబడినది, అట్లే మాయాపరిణామ రూపమగు దయమే హృదయే హృదయశబ్దముచే చెప్పబడుచున్నది. హయ్యంగవీనము వలెనున్న దయారసము కలది అని అర్థము.

ఓం హయ్యంగవీనహృదయాయై నమః

(1) జనన, అస్తిత్వ, వృద్ధి, పరిణామ, అపక్షయ, నాశములు అను షడ్భావవికారములు నిరుక్తమునందు చెప్పబడినది.

180. హరిగోపారుణాంశుకా :-

(ఆర్ద్రి పురుగువలె ఎఱ్ఱనగు అంబరము కలది) హరిగోపముగ ఇంద్ర గోపము. ఇది ఎనిమిదికాళ్ళు, ఎఱ్ఱనిరంగు, మెత్తనిశరీరము కలిగిన కీటవిశేషము (ఆర్ద్రిపురుగు). వర్షాకాలమున ఆర్ద్రి మఖానక్షత్రములలో పుట్టును. హరిగోపమువలె అరుణమగు (ఎఱ్ఱనైన) అంశుకము (అంబరము) కలది హరిగోపారుణాంశుక. లేక అంశుకమును శబ్దమందు (అంశు=క) స్వార్థమున కప్రత్యయ మున్నదని చెప్పవచ్చును. అంశువే (కిరణము) అంశుకము. హరిగోపమువలె అరుణమగు అంశువులు (కిరములు) అని అర్థము.

ఓం హరిగోపారుణాంశుకాయై నమః

181. లకారాఖ్యా :-

లకారయుక్తమగు మూలమంత్రము ఆఖ్యగ (వాచకశబ్దముగ) కలది లకారాఖ్య. లేక, "సేంద్రః" (నృసిం. ఉ. 1) అతడు ఇంద్రుడు, అని శ్రుతిచే ఈమెయే ఇంద్రుడు, లకారము శక్తిబీజము కావున ఈమె లకారము వ్యాపకశబ్దముగ కలది. లేక లకారయుక్తమగు మాయాబీజముయొక్క ఆఖ్య, అనగ వాచకశబ్దము కలది, అనగ ఈమె స్తబ్ధమొందిన మాయకలది అని అర్థము.

ఓం లకారాఖ్యాయై నమః

182. లతాపూజ్యా :-

పతివ్రతలచే పూజింపబడునది (లవంతి ఇతి లతాః) వంగునట్టివి అత్యంత నమ్రములగునట్టివి లతలు. అనగ పరమపతివ్రతలగు అరుంధతి మొదలుగాగల స్త్రీలు ఆట్టి లతలచే ఇట్టి దేవతయగు ఈమె స్థిరమాంగల్యముకొరకై - పూజ్య - పూజింపతగినది. "సమారాధ్యా మహేశానీం భుక్తిం ముక్తిం చ విందతి" మహేశాని నారాధించి భుక్తిని ముక్తిని పొందుదురు అని వచనము. కావున ఈమె లతాపూజ్య. లేక, కేదారాది గౌరీ విశేషమూర్తులందు లతలచే ఈమె పూజ్య అనగ అలంకృత. ఈమె శబరి అని గాని నవదుర్గ1 అనిగాని అర్థము

ఓం లతాపూజ్యాయై నమః

183. లతాస్థిత్యుద్భవేశ్వరీ :-

(లయము స్థితి ఉద్భవములకు ఈశ్వరి) ఈ నామములోని విశేషములను వెనుకనుండి ముందు (ఉ స్థితిలయములని) మార్చవలెను. ఉద్భవించునది ఉద్భవము, అనగ కార్యరూపమున అభివ్యక్తమగుట, స్థితి అనగ (ఉన్నదను) జ్ఞానమునకు విషయమగుటకు యోగ్యమగు కాలభాగము కలది అనగ (ఉన్నదని) అనుభవము కలిగియుండుట. లయమనగ ఉత్పన్నమగు కార్యము కారణరూపముగ నుండుట (కారణములో లయమెందుట) వాచారంభణయోగ్యత అని అర్థము.2 ఇట్టి

(1) వనదుర్గాదులు దేవతలు - వనదుర్గామంత్రము వనదుర్గోపనిషత్తు నందున్నది.

(2) "యథా సౌమ్యైకేన మృత్పిండేన విజ్ఞాతేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్ వాచారంభం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" (ఛా. ఉ. 6-13)ఒక మట్టిముద్ద నెరింగినయడల మృణ్మయమైనవి సర్వము (మట్టితో చేయబడినదెల్లను) తెలియుచున్నది.

క్రియలు అచేతనమగు దానియొక్క కార్యములు కానేరవు. ఘటాది కార్యములందు చేతనమైనట్టిది ఆయా కార్యములకు నిమిత్తమగుట కనుపడుచున్నది. కాని ఈ నిమిత్త (కారణ)ము ఏకతటస్థేశ్వరత్వము కావచ్చును, లేక గోపురాదులందు నానా చేతన (దేవతా) దర్శనత్వముచే నానేశ్వరత్వము కావచ్చును, అను సంశయము కలుగుచున్నది. కాని "యతో వా ఇమాని భూతాని జాయంతే" (తై. ఉ. 3 1) దేనినుండి ఈ భూతములు జనించుచున్నవో" అను శ్రుతియందు యతః అని ఏకవచనమున పంచమీ విభక్తితో చెప్పబడినది. కావున (ఈశ్వరత్వము) ఏకము. "జనికర్తుః ప్రకృతిః" అని పాణిని సూత్రము - అనగ. కార్యమునకు ప్రకృతి (ఉపాదానము) అపాదాన సంజ్ఞకలది అని అర్థము, అనగ కార్యమునకు ఉపాదాన కారణమైనది అపాదాన సంజ్ఞ (పంచమీవిభక్తి) అగును. ఇది తటస్థ లక్షణము. కావున ఈశ్వరత్వము అభిన్న నిమిత్తోపాదాన రూపమని అర్థము 1 ఈ లక్షణములను చెప్పుటచే తెలియబడనున్న బ్రహ్మమునకు లక్షణ ప్రమాణముల అవశ్యకత్వమున్నదని అభి

ప్రాయము. నామములో మొదట లయశబ్దము చెప్పినందున ప్రపంచముయొక్క అవాదిత్వము తెలియుచున్నది. "జగతః" జగత్తుయొక్క (లయ-స్థితి-ఉద్భవము) అను శబ్దము ఈ నామమందున్నట్లుగ భావింపవలెను. కావున జగత్తుయొక్క లయ స్థితి ఉద్భవములకు ఈశ్వరి అని అర్థమగుచున్నది ఈమె కూటస్థ చైతన్యమాత్రమును సచ్చిదానందాధాయకమునగు వివర్త కారణమని అర్థము

ఓం లయస్థిత్యుద్భవేశ్వర్యై నమః

లాస్యదర్శనసంతుష్టా లాభాలాభవివర్జితా
లంఘ్యేతరాజ్ఞా లావణ్యశాలినీ లఘుసిద్ధిదా॥ 85

184. లాస్యదర్శనసంతుష్టా

నృత్యసందర్శనముచే సంతుష్ట రాజు, సంపూర్ణ కాముడైనను, ప్రయోజన మపేక్షింపకుండగనే మృగయాది (వేట) లీలా విశేషములను బాలకాది నృత్యములను చూచునట్లు, ఈమె ప్రయోజన ముద్దేశింపకుండ ఆజ్ఞలు చేయునట్టి లాస్యమును - నృత్యమును దర్శించి సంతుష్ట ఆగుచున్నది కావున లాస్యదర్శనసంతుష్ట

మట్టితో చేయబడిన ఘటాది కార్యమంతయు వాచారంభమాత్రమే అనగ కేవలము శబ్దముచేతనే చెప్పబడుచున్నది గాని నిక్కముగ కారణముకంటె భిన్నము కాదు. కార్యములగు ఘటాదులు సత్యము కావు-మట్టి సత్యమైనది. కావున మట్టి నెరిగినవాడు కార్యములగు ఘటాదులుల నెరుగును. అనగ కారణమగు సద్వస్తువు నెరింగినవాడు జగమునంత నెరిగినవాడే అగును కావున నామధేయమగు వికారము (కార్యము) వాచారంభమాత్రమే - అనగ వికారమగునది వాస్తవమైనది గాదు, ఘటము అను నామధేయము కేవలము వాక్కు నవలంబించియున్నదే గాని వాస్తవమైనదికాదు.

(1) కార్యమగు ఘటమునకు కుమ్మరి నిమిత్త కారణము, మృత్తు ఉపాదాన కారణము. జగత్తునకు నిమిత్తోపాదానకారణములు రెండును బ్రహ్మమే. సాలెపురుగునుండి దారము వచ్చినట్లుగ బ్రహ్మమునుండి జగత్తు కలిగినది, జన్మస్థితిలయ హేతువగుట బ్రహ్మముయొక్క తటస్థ లక్షణము.

ఈ లాస్యమెట్లు కలుగుననగ - ఇష్టము, అనిష్టము, మిశ్రము,ఉదాసీనమగు పదార్థ చతుష్టయముయొక్క అనుభవముచే హర్షశోకాదులు కలుగును, వానివలన మదోద్రేక శోకాతిరేకములు కలుగును.

ఈ హేతువువలన నానావిధములగు ప్రాణులయొక్క కాయనముహములు లాస్యమొనరించుచుండును, ఈ లాస్యము కరణాకరణ రూపము చరణాస్యంగపరి స్పందరూపమై యుండును. వారివారి కర్మములననుసరించి ఆయా ఫలములను ప్రేరేపించునట్టి ఈశ్వత్వము ఈమెకు కలదు కావున సర్వసమానత్వమున ప్రయోజన ముద్దేశింపకుండ లాస్యదర్శనముచే ఈమె సంతుష్ట అని అర్థము "నాదత్తే కస్యచిత్పాపం, న చైవ సుకృతం విభుః (భ గీ 5-15) ఒకరిపాపమునుగాని ఒకరి పుణ్యమునుగాని గ్రహింపబడు" అని భగవద్వచనము. లాస్యమనగ దేవతాదులచేతను వారవనితాదులచేతను తాళగీతయుక్తముగ చేయబడు నృత్యము. లాస్యముచే ఈమె సంతుష్ట అనగ ఆయా ఫలప్రదానమందు ఉన్ముఖమగు కృపారసము కలది అని అర్థము

ఓం లాస్యదర్శన సంతుష్టాయై నమః

185. లాభాలాభవివర్జితా :-

(లాభాలాభములు లేనిది) అప్రాప్తమగు దానిని పొందుట లాభము, ప్రయత్న మొనరించినను పొందకుండుట అలాభము లాభాలాభములులేనిది లాభాలాభవర్జిత. పర్యాప్తకామయు, నిత్యతృప్తయు నగుటచే ఈమె వీనిచే వివర్జిత. "న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన" (భ గీ 3-22) నాకు మూడు లోకములలోను చేయువలయునదేమియు లేదు" అని భగవద్వచనము.

ఓం లాభాలాభవివర్జితాయై నమః

186. లంఘ్యేతరాజ్ఞా :-

(ఇతరుల ఆజ్ఞలు ఈమెకు లంఘ్యములు) ఇతరులయొక్క ఆజ్ఞ ఇతరాజ్ఞ, అనగ తాను జీవుడను భ్రాంతిచే కల్పితములగు గురుమూర్తులయొక్క ఆజ్ఞ అనగ ప్రేరణ. ఇది ఉపాసనావిధిరూపమైనదిగాని కర్మవిధిరూపమైనదిగాని కావచ్చును. లంఘ్యములగు ఇతరాజ్ఞలు కలది లంఘ్యేతరాజ్ఞ. ఇతరములగు ఆజ్ఞలు ఈమెకు లంఘ్యములు అనగ అవిషయీకృతమును. ఈమె శుద్ధ చైతన్యరూపము కావున

ఈమెయందు విశిష్ట క్రియాద్యాత్మకత్వములేదు, అందుచే (బ్రహ్మము) విధికి విషయము కాదు1 లేక, కింకరీత్వ మీమెయందు లేకుండుటచే ఇతరదేవతలయొక్క ఆజ్ఞలు - ప్రేరణములు ఈమెకు ఉపేక్ష్యములు. "సర్వస్యాధిపతిః సర్వస్యేశానః" (బ్రహ్మ 4-4-22) సర్వమునకు అధిపతి సర్వమునకు ఈశానుడు, అని శ్రుతి. ఈశ్వరునకు సర్వనియంతృత్వము కలదు కావున అతడు ఇతరులచే నియమ్యుడు కాడు.

ఓం అంఘ్యేతరాజ్ఞాయై నమః

187. లావణ్యశాలినీ :-

(లావణ్యము ఒప్పుచున్నది) లావణ్యమనగ సౌందర్యము. ఈమె పరమానందస్వరూప ఆగుటచే అతిశయప్రీతి విషయత్వమును (లావణ్యమును)

(1) బ్రహ్మము ప్రతిపాదించు వాక్యములు విధివాక్యములు కావు. లక్షణ చేతనే బ్రహ్మము నెరుగవలెను.

(శాలతే) పొందును కావున లావణ్యశాలిని. లేక, సర్వావయవ సాధారణమగు సుందర-భావము కలది అని అర్థము చెప్పవచ్చును.

ఓం లావణ్యశాలిన్యై నమః

188. లఘుసిద్ధిదా :-

(తేలికగ సిద్ధినిచ్చేనట్టిది) లఘువగు (తేలిక అగు) ఉపాయముచే సిద్ధిని - వాంఛితార్థ ప్రాప్తిని ఇచ్చునట్టిది కావున ఈమె లఘుసిద్ధద - లఘుశబ్దము లక్షణచే లఘిమా సిద్ధిపరము. కావున లఘిమాద్యష్టైశ్వర్యముల నిచ్చునట్టిది అని మరియొక అర్థము. లేక, లఘువులగువారికి అనగ అత్యంతాల్పములగు జ్ఞానము, భాగ్యము, శరీరము, చర్మాదులు కలవారికి, అతి నికృష్టములగు తిర్యగ్జంతువులకు కూడ, ముక్తియోగ్య హేతువగు జ్ఞానసాధనసంపత్తిని ఇచ్చునట్టిది కావున ఈమె లఘుసిద్ధిదః ఈ జ్ఞానసాధనసంపత్తి యెట్టిదో దాని కార్యమగు (ముక్తియొక్క) మహిమాతిశయమునట్టి ఊహింపవదగును.

ఓం లఘుసిద్ధిదాయై నమః

లాక్షారససవర్ణాభా లక్ష్మణాగ్రజపూజితా
లభ్యేతరా లబ్ధభక్తిసులభా లాంగలాయుధా 36

**189; లాక్షారససవర్ణాభా :-**

(లాక్షారసమువంటి వర్ణముగలది) లాక్షారసమనగ లాక్ష (లక్క) ద్రవము. లాక్షారసముతో సమానమగువర్ణము - అనగ శోభ, కాంతి - అట్టి వర్ణము కలది. అనగ ఈమె అతి పాటల విగ్రహ ప్రతిభకలది అని అర్థము.

ఓం లాక్షారససవర్ణాభాయై నమః

**190. లక్ష్మణాగ్రజపూజితా :-**

(లక్ష్మణాగ్రజునిచే పూజిత) అగ్రమున - అనగ ముందు పుట్టువారు అగ్రజులు లక్ష్మణాగ్రజులు రామ - భరతులు ఈమె లక్ష్మణాగ్రజులచే పూజిత. జ్యేష్ఠుడగు రామునివలె, మిగిలిన సోదరులుకూడ ఆచరించి యుండుటచే దాశరథులు నలుగురిచేతను ఈమె పూజిత అని అర్థము రామునకు "శివలింగ ప్రతిష్ఠాతా" అను నామమున్నది 1 కావున శివదంపతీ పూజకత్వమున ఆ వంశమునందలి ఇతర స్త్రీ పురుషులకు కూడ అట్టిసిద్ధి కలిగినదని ధ్వని.

ఓం లక్ష్మణాగ్రజపూజితాయై నమః

**191. లభ్యేతరా :-**

(లభ్యముల్కంటె ఇతరమైనది) లభ్యములనగ లబ్ధవ్యములు అవి కర్మోపాసనావిషయములచే సాధ్యములు. అనగ భవ్యములు (ముందు రానున్నవి) ఈమె లభ్యముల - వానికంటె ఇతర - విలక్షణ అని అర్థము "తత్సత్యం స ఆత్మా" ఆత్మసత్యమైనది (ఛా. ఉ. 6-8-8) "నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానాం ఏకో బహూనాం యో విదధాతి కామాన్, తమాత్మస్థం" (కఠ.ఉ 5—13) బ్రహ్మము నిత్యమైనది, మిగిలినవి అనిత్యములు, చేతనములగు బ్రహ్మాదులకు చేతనత్వము నిచ్చు

(1) రామాష్టోత్తర శతనామములలో "శివలింగ ప్రతిష్ఠాతా" అను నామమున్నది.

న్నట్టిది. ఏకమైయుండి అనేకులకు కర్మానురూపకర్మఫలము నిచ్చునట్టిది. ఆత్మస్థ మైన ఆ వస్తువు నెరింగినవారు శాశ్వతమగు శాంతి నొందుదురు. తదితరులకు అట్టి శాంతి ఉండదు." "యత్సాక్షా దపరోక్షాద్బ్రహ్మ (బృహ. ఉ. 5-4-1) బ్రహ్మము సాక్షాద్రూపమైనది, అపరోక్షముగ నుండునట్టిదికాదు". ఈ శ్రుతులచే ఆత్మ నిత్య ప్రాప్త స్వరూపము కలది, మోక్షరూపమైనది చతుర్విధ క్రియాఫలత్వము[1] లేనిది అని గ్రహింపవలెను. లేక ఇతరములనగ ధర్మార్థ కామరూప త్రివర్గరూపములగు ఫలములు. ఇవి ఈమెవలన లభ్యములు - అనగ లబ్ధవ్యములు — ప్రాప్తవ్యములు— ఈ అర్థముకూడ పైన ఉదహరించిన శ్రుతులవలన కలుగును.

ఓం లభ్యేతరాయై నమః

192. లబ్ధభక్తిసులభా :-

(ఈమె భక్తికలవారికి సులభ) లబ్ధ భక్తులకు ఈమె సులభ. సామాన్యము విశేషము అని భక్తి రెండువిధములుగ నున్నది. ఆర్తులు జిజ్ఞాసువులు, అర్థములు కోరువారు సామాన్యభక్తిని ఆయా ఫలముల నుద్దేశించి సమయ విశేషము లందు, అప్పుడప్పుడు పొందుదురు. అట్టి లబ్ధభక్తులకు సులభ - అనగ వారివారి ఫలముల దానమునందు ఉన్ముఖమగు స్వాత్మరూపమున సన్నిహితమైయుండును. రెండవదియగు భక్తి బ్రహ్మసాక్షాత్కారము కలిగిన పురుషునిచే ఏకభక్తిరూపమున పొందబడును, "ఏకభక్తిర్విశిష్యతే" (భ. గీ. -17) ఏకభక్తి అనగ ఆత్మైకభజన తత్పరత్వము, అది విశిష్టమైనది, అని స్మృతి. అట్టి ఏకభక్తి కలవారికి ఈమె సులభ — అనగ స్వాత్మరూపమున వారిచే నిరంతరము తెలియబడుచున్నది. "జ్ఞానీ త్వాత్మైవ మే మతం" (భ. గీ. 7-28) జ్ఞాని నాయొక్క ఆత్మరూపమే", అనిగీత. లేక కంఠమందున్న చామీకరము (హారము) వలె లబ్ధమై అనగ ప్రాప్తమైయున్న ఈమె లబ్ధభక్తులచే సులభ-అనగ సుఖముగ, అనాయాసముగ, కష్టములేకుండ సాధ్యరూపమున పొందబడునది-అనగ ప్రాప్త మగునది. "భక్త్యా మా మభిజానాతి" నాయందు భక్తికలిగినవారు నా నిజస్వరూపమును (అద్వైతమును) తెలుసుకొందురు అని గీత 18-55.

ఓం లబ్ధభక్తిసులభాయై నమః

193. లాంగలాయుధా :-

(నాగలి ఆయుధముగ కలది) లాంగలము (నాగలి) ఆయుధముగ కలది లాంగలాయుధ - ఈమె శేషునిరూపమున[2] హలాయుధ "అనంతశ్చాస్మి నాగానాం" (భ గీ 10-29) నేను నాగులలో అనంతడగు (శేషుడను) అని భగవద్వచనము.

ఓం లాంగలాయుధాయై నమః

లగ్నచామరహస్త శ్రీశారదాపరివీజితా।
లజ్జాపదసమారాధ్యా లంపటాలకులేశ్వరీ॥ 37

194. లగ్నచామరహస్త శ్రీశారదాపరివీజితా :-

(చామరములు హస్తములయందు కలిగిన లక్ష్మి శారదలచే పరివీజిత) లగ్నములన్నగ సంబద్ధములైనవి, ధరింపబడినవి లగ్నములైనచామరములు కలిగిన హస్తములు - అట్టి - హస్తములు కలిగి శ్రీ అనగ మహాలక్ష్మి, శారద - వీరిచే పరివీజిత-అనగ అనాదికాలమునుండి పరిచర్యారూపమున వీరిచే పరివీజిత.

(1) ఉత్పాద్యములు (ఉత్పాదింప తగినది. కుండలు మొదలైనవి), అప్యములు పొందదగినవి. (గ్రామము మొదలైనవి), వికార్యములు (బంగారము తో ఆభరణములు చేయుట మొదలైనవి వికార్యములగును), సంస్కార్యములు - (సంస్కరింపదగినవి. ఒక గుణమును కలిగించుట గాని దోషమును పరిహరించుటగాని). ఇట్టిచతుర్విధ క్రియాఫలత్వము అవికార్యమగు ఆత్మయందు లేదు.

(2) హలాయుధుడగు బలరాముడు శేషుని అవతారము కావున శేషరూపమున ఈమె హలాయుధ

ఓం లగ్నచామరహస్త శ్రీశారదాపరివీజితాయై నమః

195. లజ్జాపద సమారాధ్యా :-

(మనస్సునందు ఆరాధింపతగినది) 'లజ్జ' అంతఃకరణ ధర్మము, అది జుగుప్సా హేతువు, గూహన సాధనము (దాచుకొనునట్లు చేయునది). లజ్జ అని

చెప్పుటచే, ఉపలక్షణమున, మనోధర్మములన్నియు చెప్పబడినవి. లజ్జకు పదము అనగ ఆశ్రయము-లజ్జాపదము. "కామః సంకల్పో విచికిత్సాఽశ్రద్ధా ధృతి రధృతిః, హ్రీ ర్ధీ ర్భీ రిత్యేతత్ సర్వం మన ఏవ". (బృహ. ఉ. 3-5-3) కామము, సంకల్పము, విచికిత్స (సంశయజ్ఞానము), శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, లజ్జ, బుద్ధి, భయము. ఇవియన్నియు మనస్సేనని శ్రుతి, కావున లజ్జాపద మందు అనగ మనస్సు నందు ఈమె సమారాధ్య, అనగ చింతింపదగినది. "య ఆత్మని తిష్ఠ న్నంతరో యమయతి" (బృహ. ఉ. 4-7) ఎవడు ఆత్మయందుండి నియమించునో; "గుహాహితం గహ్వరేష్ఠం పురాణం" (కఠ. ఉ. 2-12) గుహ (బుద్ధి) యందున్నవాడును. పురాణుడునగు వానిని "త మాత్మస్థం యే ను పశ్యంతి ధీరాః" (కఠ. ఉ. 5-12) ఆత్మయందున్నవానిని ఏ ధీరులు కనుగొనుదురో, వారికి సుఖము కలుగును, అని శ్రుతులు చెప్పుచున్నవి. లేక. లజ్జాపద మనగ జీవచక్రము (జీవ పసుహము). అందు అధిష్ఠానమనగ (ఆధారముగ) నున్న ఆనంద మభివ్యక్తి నొందుటకు ఈమె హేతువు; కావున బహిర్యాగక్రమమున ఈమె పూజనీయ అని అర్థము.

ఓం లజ్జాపదసమారాధ్యాయై నమః

## 196. లంపటా :-

(లంపట కలిగియున్నది) "లం" అను పృథివీ వాచక బీజముచే తదుపలక్షితమగు జగత్ చెప్పబడుచున్నది. పట శబ్దముచే ఆవరకధర్మము కలిగిన అవిద్య చెప్పబడుచున్నది. "లం" యొక్క అనగ జగత్తుయొక్క, పటము అనగ కారణీభూతమగు అవిద్య కలది. "మాయినం తు మహేశ్వరం" (శ్వే. ఉ. 4-10) మహేశ్వరుడు మాయనొందినవాడు, "య ఏకో జాలవాన్" (శ్వే. ఉ. 3-1) మాయను కలిగియున్న ఈశ్వరుడు సర్వశక్తులతో పాలించును, అని శ్రుతులు "అజ్ఞానేనావృతం జ్ఞానం" "జ్ఞానము అజ్ఞానముచే ఆవృతమై యున్నది" అని స్మృతి (భగీ.గీ.5-15) అనగ జగత్తునకు కారణీ భూతమగు అవిద్య కలది కావున లంపట. లేక, లంపట మనగ తం(ద్ర),-ఆలస్యము-భృత్యుడొనరించిన సేవలకు చిర విలంబన లేకుండ ఫల ప్రదానమీయవలెనని రాజు ఉన్ముఖుడై యున్నను ప్రతిబంధకములచే నత డీయ లేనట్లు, కర్మోపాసనా బాహుళ్యమున్నను ప్రతిబంధకములధికముగ నుండుటచే శీఘ్రముగ ఫలమీయవలెనను పరమేశ్వరుని ఉన్ముఖత్వమునకు లంపటము - ఆలస్యము కలుగుచున్నది. కావున లంపన - లేక, లంపటాదులు అంతఃకరణ ధర్మములు,

ఇవి అధ్యాస (ఆరోప) వశమున వానిని కలిగియున్న చైతన్యమునందు సత్త్వరజస్తమనస్సులయొక్క కార్యములుగ తెలియబడుచున్నవి, ఈమె లంపటాది ధర్మములను కలిగియున్నది, కావున లంపట.

ఓం లంపటాయై నమః

197. లకులేశ్వరీ :-

(లకులమను స్థానమునకు ఈశ్వరి) కుః అనగ, వృద్ధివి-అనగ జగత్. అది దీనియందు లయమొందునది కావున కులము. అనగ మాయోపాధిక చైతన్యము, ప్రళయమునకు అధిష్ఠానమైనది. "యత్ప్రయంత్యభిసంవిశంతి" (తై. ఉ. 3-1) దేనియందు లయమొందుచున్నవో, ప్రవేశించుచున్నవో అని శ్రుతి లయమొందునట్టి కులము లకులము. లకులమున్కనకు ఈశ్వరి లకులేశ్వరి లేక, లకులమనగ స్థాన విశేషము ఇది స్వాధిష్ఠానమందో మణిపూరకమందో కలదు. దానికి ఈశ్వరి లకులేశ్వరి. అనగ ఈమె విష్ణురుద్రాత్మిక పృధివి ఉదకమందును, ఉదకము తేజస్సునందును, తేజస్సు పరమాత్మనందును లయమొందుట భూతసృష్టి శ్రుతియందు చెప్పబడినది. "సదాయతనాః సత్ప్రతిష్ఠాః" (ఛా. ఉ. 6-8-4) జలద్వారమున తేజోమూలమును కనుగొనవలెను. తేజోద్వారమున సత్పదార్థమును కనుగొనవలెను, ఈసత్పదార్థమును సర్వప్రజలు ఆయతనముగ - అధిష్ఠానముగ కలిగియున్నారు, అని శ్రుతి లకులమను స్థానమునకు ఈశ్వరి అని గాని, ఆ స్థానమునకు సంబంధించిన విభూతి (ఐశ్వర్య) విశేషమనిగాని అర్థము.

294.532
20=00
KRI

లబ్ధమానా లబ్ధరసా లబ్ధసంవత్సరమున్నతిః
హ్రీంకారిణి హ్రీంకారాద్యా హ్రీంమధ్యా హ్రీంశిఖామణిః 88

198. లబ్ధమానా :-

ACC NO. 25077

(లబ్ధమగు పూజకలది) లబ్ధమగు మానముకలది లబ్ధమాన, అనగ సర్వప్రాణులచేతను లబ్ధమగు మానయ-అనగ1 అధ్యస్తాహంకారముకలది. "అభిమానాత్మక స్తద్వద్ అహంకారః ప్రకీర్త్యతే" అభిమానాత్మకమైనది అహంకారము. లబ్ధమాన అనగ ఈమె అధ్యాపముచే అహంకారమును అధిష్ఠానముగ కలది. లేక, మాన

ధాతువు పూజార్థకము. విద్యైశ్వర్యకుల సౌందర్యాతిశయాదివశమున సుఖహేతువగు పూజ ఏయే ప్రాణులచేత పొందబడుచున్నదో దానినంతను పూర్వమే ఆయాప్రాణు లందరియందు అంతర్యామి రూపమున ఈమెయుండుటచే, ఈమె పొందియున్నది. పూజాదులవలన సుఖాదులు కలుగును. ఈమె సుఖస్వరూప కావున ఈమెచే పూర్వమే

(1) రజ్జువునందు సర్పము అధ్యస్తము. అనగ ఆరోపింపబడినది అనగ సర్పమున్నదనునది భ్రాంతియేకాని నిక్కమైనదికాదు అట్లే బ్రహ్మము సత్యమైనది దానియందు జగత్తు (అనుభ్రాంతి) అధ్యస్తమైనది. అనగ బ్రహ్మము పైన ఆరోపింపబడినది. ఉన్నదానిపై లేని దానిని ఆరోపించుట అధ్యాసమనబడును. ఈమెకు అహంకారము అధిష్ఠానము కాదు, అది ఈమెయందు అధ్యస్తమైనది.

---

ఇది పొందబడినది అని అర్థము. లేక, మానమనగ అణుమహద్ దీర్ఘహ్రస్వభేదమున నుండు పరిమాణము "స వా ఏషమహా నజ ఆత్మా మహాన్ ప్రభు ర్వై పురుషః" (శ్వే ఉ. 3-12) ఇతడు మహత్తము కలవాడు ఆజుడు, ఆత్మరూపుడు, ప్రభువు, పురుషుడు. "అణో రణీయాన్ మహతో మహీయాన్" (కఠ ఉ. 2-20) అణువుకంటె తక్కువైనది, మహత్త్వముకల దానికంటె మహత్త్వముకలది" అను శ్రుతివాక్యములచే ఈమె జలమందు ప్రతిఫలించు సూర్యునివలె ఉపాధుల నొందుచు గజస్తంభమత్కుణసర్పాదులందు కనబడుచున్నది. లబ్ధమగు మానము అనగ పరిమాణము - అనగ ఉపాధి కలది ఉపహితరూపమున జగత్ యొక్క పరిమాణము కలది అని అర్థము.

ఓం లబ్ధమానాయై నమః

**199.** లబ్ధరసా :-

(లబ్ధమగు ఆనందము కలది) లబ్ధమగు రసమగు రసముకలది లబ్ధరస. "రసో వై సః" (తై. ఉ. 2 7) అతడు రసరూపుడు, రసము నొందియే ఆనందము నొందుచున్నాడు" అని శ్రుతి రసమువలె రసించునట్టిది అనగ సంబంధించునట్టిది అనగ అత్యంత ప్రీతి విషయమగునట్టిది—ఆనందము. అట్టి ఆనందమును ఈమె స్వస్వరూపముగ పొందినది కావున లబ్ధరస. లేక, రసమనగ శృంగరరసమని చెప్పవచ్చును. శృంగారరసమును వ్యక్తమొనరించు మంగళాభరణ పుష్పాలంకారములు

ఈమెకు కలవు కావున ఈమె లబ్ధరస లేక. రసముగ మధురరసము. "రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా సాత్త్వికప్రియాః (17-8) అను గీతవచనమున సైవేద్యాదులందు కటు-అమ్లలవణరసములు నిషిద్ధములు. ఈమె శుద్ధసత్త్వ ప్రధానమగు మాయోపాధికరూపమగుటచే ప్రీతివిషయముగ మధురరసము ఈమెచే లబ్ధము కావున లబ్ధరస.

ఓం లబ్ధరసాయై నమః

200. లబ్ధసంపత్సమున్నతిః :-

(లబ్ధమగు సంపదచే సమున్నతి కలిగినది) లబ్ధములైన సంపదలు - లబ్ధసంపత్, సంపదలుగ స్వస్వరూపముచే స్వతస్సిద్ధములగు సత్యకామత్వాదులని గాని, సచ్చిదానందాదులనిగాని చెప్పవచ్చును, లబ్ధసంపత్తుచే సమున్నతి - సర్వోత్కృష్టత కలిగినది, లబ్ధసంపత్సమున్నతిః - బ్రహ్మముయొక్క గుణములు కేవలము మాయోపాధిచే అభివ్యక్తమగును అవి కర్మములవలన కలిగినవికావు. కావున అవి అనాకస్మికములుగనుండును అనగ అకస్మాత్తుగ కలిగినవి కావు, కావున అవి బ్రహ్మము యొక్క సర్వోత్కృష్టత్వమును తెలియజేయును. "త మీశ్వరాణాం పరమం మహేశ్వరం తం దేవతానాం పరమం దైవతం పతిం పతీనాం పరమం పురస్తాత్ విదామ దేవం భువనేశ మీడ్యం" (శ్వే. ఉ. 6-7) ఇతడు ఈశ్వరులందు పరమమహేశ్వరుడు ప్రభువులందు పరముడు, భువనేశ్వరుడని ఎరిగియుంటిమి. "సత్యకామః సత్యసంకల్పః" (ఛా. ఉ. 8-15) ఇతడు సత్యకాముడు సత్య-సంకల్పుడు, "ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోంతర్యామ్యేష యోనిః సర్వస్య" (మాం. ఉ. 6) ఇతడు "సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు. అంతర్యామి, అన్నిటికిని కారణము, "గతిర్భర్తా ప్రభు సాక్షి" (భ గీ. 9-1.) ఇతడు "గతి, భర్త. ప్రభువు సాక్షి" అను శ్రుతిస్మృతిశతములచే "ఏష నిత్యోమహిమా బ్రాహ్మణస్య"1 అని శ్రుతి ప్రసిద్ధమగు నిత్యోత్కర్షత్వమును కలిగియుండుటయే బ్రహ్మస్వరూపమగును కావున ఈ విషయమును వేరుగ విచారింపనక్కరలేదని తాత్పర్యము.

(1) బ్రహ్మము ఉపాధివశమున పరిమాణము కలిగియున్నది, నిక్కముగ పరమాణము లేనిది.

ఓం లబ్ధసంపత్సమున్నత్యై నమః

201. హ్రీంకారిణీ :-

హ్రీంకారమును, మంత్రమునందు ద్వితీయఖండ సమాప్త్యవయవముగ, వాచ్యవాచక సంబంధమున కలది హ్రీంకారిణీ.

ఓం హ్రీంకారిణ్యై నమః

202. హ్రీంకారాద్యా :-

(ఈమె వేదములకు ఆద్య) ఇక్కడ హ్రీంకార శబ్దముచే తత్కార్యభూతములగు వేదములు చెప్పబడుచున్నవి. వేదములకు అర్థరూపమున అనగ కారణరూపమున ఈమె ఆద్య; అనగ ఈమె వేదములకు పూర్వమున్నదని అర్థము. శబ్దమునకు అర్థవిషయమున ప్రవృత్తి యున్నది. శబ్దశక్తిని కలిగియుండు కావ్యాదికృతులందు అర్థజ్ఞానపూర్వకమగు శబ్దప్రయోగము కనబడుచున్నది కావున శబ్దముకంటె అర్థము పూర్వమున్నదని చెప్పబడినది.

ఓం హ్రీంకారాద్యాయై నమః

203. హ్రీంమధ్యా :-

(వ్యవహారకాలమున హ్రీంకలది) జగత్తునకు అభిన్న నిమిత్తోపాదాన కారణభూతమగు మాయవిశిష్టచైతన్యము హ్రీంబీజముచే చెప్పబడుచున్నది. కావున ఈ బీజము అట్టిచైతన్యమునకు ప్రతీకము. ఈ బీజమందున్న గుణవత్త్వమంతయు దానినుపాసింపగ అభివ్యక్తమగును. ఇట్లభివ్యక్తము గాకున్నయెడల మంత్రపురశ్చర్యలందు సిద్ధి లేకుండుట ప్రసక్తమగును. వెనుకటినామములలో (202) అనభివ్యక్తమగు (ప్రకటమొందని) శబ్దజాలమునకు హ్రీంబీజరూపమున అర్థవత్త్వము కలదని చెప్పుటవలన అర్థమునకు పూర్వభావిత్వము చెప్పబడినది. ఇపుడు అభివ్యక్తస్వార్థరూపమున వివర్తవాదము నాశ్రయించి వాచారంభణాకారముతో2 నామరూప

(1) కర్మములచే తగ్గనిది హెచ్చనిది - బ్రహ్మజ్ఞానియొక్క నిత్యమగు మహిమమిట్టిది.

(2) నామధేయము వాచారంభణపూర్వకమగు వికారము, ఇది సత్యపదార్థము కాదు. 183 నామముక్రింద వాచారంభణ శ్రుతి వివరింపబడినది.

(శబ్దార్థ) ద్వయము కలిగియుండుట చెప్పబడుచున్నది. హ్రీంకార శబ్దముచే హ్రీంకార బీజార్థమే లక్షింపబడుచున్నది. మధ్యే అనగ వ్యవహారకాలమున హ్రీంకలది హ్రీం మధ్య ఘటాదులగు వస్తువులందుకూడ సచ్చిదానంద ప్రీతి యుండుటచే వ్యవహార కాలమందు కూడ ప్రపంచకారణమగు బ్రహ్మము అనుస్యూతముగ భాసించుచు జగత్కారణమగుట తెలియజేయుచున్నది. ఇందువలన అచేతన - పరిణామ - ఆరంభావి వాదములు1 పైకి యుక్తియుక్తములుగ కనుపించినను నిక్కముగ నిష్ప్రమాణము లని త్రోసివేయబడినవని గ్రహింపవలెను.

ఓం హ్రీంమధ్యాయై నమః

204. హ్రీంశిఖామణిః :-

(హ్రీంకారమను శిఖామణిగ కలది) సర్వాంగములందుంచిన ఆభరణములకంటె ఉత్తమాంగమున నుంచిన చూడామణి అతివిలక్షణమైన ప్రకాశాదులు కలిగి యుండును అందుచే చూడామణిని ధరించిన పురుషుడు మహదైశ్వర్యము కలవాడని తెలియుచున్నది, అట్లే సర్వశబ్దజాలరూపమైనదియు తద్వాచ్యార్థరూపమైనదియు, చిజ్జడ సంబంధరూపమగు ప్రపంచమును చెప్పునట్టిదియు, అతిసూక్ష్మరూపమైనట్టి దియునగు హ్రీంవర్ణాత్మక శ్రీవిద్యారాజబీజమునకు ఈమె జ్ఞానానందాత్మమగు లక్ష్యార్థభూతయగుచు, ఈ బీజమును జపించువారిలకు సర్వార్థముల నిచ్చి వారికి పారమైశ్వర్యము కలుగుట తెలియచున్నది. ఇట్లు చెప్పుటచే ఈ నామము గుణయోగమున2 చెప్పబడినది. హ్రీంయొక్క శిఖామణి అనగ హ్రీంబీజముచే పరమతాత్పర్యమున ఈమె జ్ఞాపకము చేయబడుచున్నది.

ఓం హ్రీంశిఖామణయే నమః

హ్రీంకారకుండాగ్నిశిఖా హ్రీంకారశశిచంద్రికా
హ్రీంకారభాస్కరరుచిః హ్రీంకారాంభోదచంచలా 36

205. హ్రీంకారకుండాగ్నిశిఖా :-

(హ్రీంకార మను కుండమున ఈమె అగ్నిశిఖ) హ్రీంకారమే కుండము. అందు వాచ్యవాచక సంబంధమున పరబ్రహ్మమే ఆహవనీయాది (అగ్ని) సదృశ్యము ఈమె హ్రీంకారకుండమందలి అగ్నిశిఖ, "ఉద్దీప్తేగ్నౌ జుహోతి", ఉద్దీప్తమగు

అగ్నియందు హోమము చేయవలెను, అను ప్రమాణమునకు "ఆహవనీయే జుహోతి" "ఆహవనీయాగ్నియందు హోమము చేయవలెను" అను విధివాక్యమును సంబంధింపచేయువలయును, అపుడు హోమధారత్వము, కేవలమగు అహవనీయ

(1) "అస్తిభాతిప్రియం రూపం నామ చేత్యంశ పంచకం అద్యత్రయం బ్రహ్మ రూపం జగద్రూపం తతోద్వయమ్"॥- అని సరస్వతీరహస్యోపనిషత్తు. ఉన్నది, భాసించుచున్నది, ప్రియముగనున్నది" అను నీమాడు అంశములు బ్రహ్మముయొక్క అంశములు నామరూపములను కలిగియుండుట జగత్ యొక్క లక్షణము. ఘటాదివస్తువుల విషయములోకూడ- ఘటమున్నది (సత్), ఘటము భాసించుచున్నది (చిత్), ఘటము ప్రియముగనున్నది (ఆనందము), అను ప్రతీతి కలదు. కావున సచ్చిదానంద లక్షణములు కలిగినవి బ్రహ్మము జగత్ యొక్క అంశములతోబాటు ప్రతీకమగుచు జగత్కారణముగ తెలియబడుచున్నది. ఉపాదానకారణమగు బ్రహ్మమును గురించి మూడువాదములున్నవి-అవి వివర్త, పరిణామ, అరంభ వాదములు. ఒక వస్తువు మరియొకవస్తువుగ కల్పించుట వివర్తము; ఉదా-రజ్జువు సర్పమువలె కనుపడుట. ఒక వస్తువే అవస్థాంతరము నొందుట పరిణామము; ఉదా-పాలు పెరుగుగ మారుట ఒకదాని నుండి మరియొక వస్తువుగ కలుగుట అరంభము. ఉదా—కారణమగు తంతువు స్వస్వరూపమును విడచి పటముగ (వస్త్రముగ) మారుట. అవయవరహితమగు బ్రహ్మమునందు అవయవయుక్తములగు పరిణామారంభకార్యములు వర్తింపవు. మూల కారణము అచేతనమైనదని చెప్పుట అచేతనవాదము. బ్రహ్మముయొక్క చేతనత్వము కనుబడుచుండుటచే బ్రహ్మము అచేతనము కాదు. కావున వివర్తవాదము ననుసరించి అచేతనారంభాదివాదములు నిరసింపబడినవి; అనగ మాయచే బ్రహ్మము జగత్ వలె భాసించుచున్నదేగాని జగత్తు నిక్కమైనదికాదు. బ్రహ్మ సత్యం, జగన్మిధ్య.

(2) ఆయా గుణముల యోగమున ఈ నామము చెప్పబడినది. అనగ ఆయా గుణములతో ఏకత్వచింతనము గుణయోగము. అకార ఉకార మకార బిందు నాద శక్తి శాంతలను స్థూలత్వ సూక్ష్మత్వ కారత్వ సమత్వ నిర్వి

మునకుగాక, అగ్నిజ్వాల కలిగిన ఆహవనీయముననే కలుగుచున్నది. అంతట అదృష్ట ద్వారమున స్వర్గసంబంధము హోమమొనరించినవానికి కలుగును. ఇట్లు జ్ఞాపక మొనరించు వేదవాక్యములకు, స్వార్థకతచే, పురుషార్థ సంబవిధిత్వము కలుగుచున్నది, ఇందుచే ఆహవనీయమందున్న హోమధారమగు దీప్తాగ్నిజ్వాలకు ఆధారభూతమగు కుండమునకు సార్థక్యము కలుగుచున్నది, ఆ రీతిగనే స్వవాచకబీజమగు హ్రీంకారమునకు "మంత్రై రుపాసీత" "మంత్రములచే ఉపాసింపవలెను, అను విధివాక్యముచే చెప్పబడిన దేవతోపాసనా సాధకములగు మంత్రములగు స్వవాచక రూపమున సార్థక్యము సంపాదింపబడుచున్నది. హ్రీంకారమను కుండమున ఈ పరదేవత అగ్నిశిఖ" అని అర్థము.

> శేషత్వ శాంతత్వగుణములతో క్రమముగ ఏకత్వచింతనము గుణయోగమని ప్రపంచసార వివృతికర్తయగు పద్మపాదాచార్యులు వ్రాసెను. అట్లే ఇక్కడ మహదైశ్వర్యాది గుణయోగమున ఈ నామముచే పరదేవతకు సంభావింపవలెను. గుణముల నుపసంహరించి అనుసంధాన మొనర్చుట సంహారయోగము, ఇంకను క్రియా యోగము మొదలైనవి వివృతియందు చెప్పబడినది.

ఓం హ్రీంకారకుండాగ్నిశిఖాయై నమః

206. హ్రీంకారశశిచంద్రికా :-

(ఈమె హ్రీంకారమను చంద్రునియొక్క వెన్నెల) హ్రీంకారమే శశి-చంద్రుడు, ఈమె హ్రీంకారశశియొక్క చంద్రిక (వెన్నెల). "చంద్రిక" అను పదముచే చంద్రుని స్వరూపముకంటె అభిన్నమగు ప్రకాశచైతన్యమే ఉపమాన రూపమున చెప్పబడినది. చంద్రస్వరూపభూతమును, అమృతప్రసారభూతమునగు జ్యోత్స్న దేవాది సర్వలోకములకు సంజీవకత్వముక ఉపకరించునట్లు ఈ ప్రకాశచైతన్యము దృఢతరభక్తి పరవశులగు పురుషధౌరేయులకు ఉపకరించును. ఈ ప్రకాశచైతన్యమే హ్రీంకారవాచ్యార్థ రూపముననుండి, జగత్కంటె అభిన్నమై జగద్వివర్తకారణమై సచ్చిదానందములను కలిగించి సంజీవన మొనర్చునని భావము.

ఓం హ్రీంకారశశిచంద్రికాయై నమః

207. హ్రీంకారభాస్కరరుచి :-

(ఈమె హ్రీంకారభాస్కరునియొక్క కాంతి) (భాసఃకరోతి) కాంతిని కలుగచేయును కనుక భాస్కరుడు లోకోపకారమునకై సూర్యుని కాంతి ప్రసరింప చేయును భాస్కరుని రుచి అనగ ప్రచండ భానుడు. ఈమె హ్రీంకారమను భాస్కరునియొక్క రుచి లోకములో వర్షాకాలమున అతి గాఢతరముగ ప్రసరించు వర్షధారలచే దిగంతరాళములు వ్యాప్తములైనపుడు పగలు సూర్యుడున్నను, ఇదిగోనని చెప్పగలిగిన చాక్షుషజ్ఞానమునకు గోచరముకాడు, ఆ సమయమున శిష్టులకు భోజనాదిసంజీవనవ్యవహారముండదు. సూర్యుడు కనుపించినయడల వారు ప్రసన్నమనస్కులై యుందురు. అట్లే జ్ఞానమార్గమున ఆనధికారులును, మోక్షమార్గోపాయభూత దేవతారూపమగు హ్రీంకార మెరుగని జనులకు బహుతర పుణ్యమహిమచే, మహావాక్యముచే మేఘావళి దూరీకృతమై చండభానుని ప్రకాశమొంది సుఖసాధనమగునట్లుగ, గురుకృపాపాంగాలోకరూపమగు దీక్షావశముచే ప్రతిబంధకములగు దురితములు నశించును, అపుడు వారికి పరదేవతారూపమగు హ్రీంకారము, పురశ్చర్యచే, సాక్షాత్తుగ వాచ్యార్థముయొక్క పరోక్ష జ్ఞానహేతువగును. చిరకాలముగ నిరంతర భావనాప్రకర్షచే హ్రీంకార దేవతాభిముఖులైయున్నవారికి హ్రీంకారలక్ష్యార్థమగు పరమానందచిత్కళ అభివ్యక్తమై ఆనందానుభవామృతము నిచ్చి సుఖమును కలుగించును.

ఓం హ్రీంకారభాస్కరరుచయే నమః

208. హ్రీంకారాంభోదచంచలా :-

(హ్రీంకారమను మేఘమునందు ఈమె మెరుపు) అంభస్సులను-అమృతమును, ఇచ్చునట్టిది. అంభోదము-హ్రీంకారమును అంభోదము. కామములను వర్షించునట్టిది కావున హ్రీంకార అంభోదముతో (మేఘముతో ఉపమింపబడింది, ఈమె హ్రీంకారాంభోదమునందు చంచల-అనగ విద్యుల్లత. మేఘములందు అభిన్నముగ విద్యుల్లత ప్రకాశించుచు వర్షోదకద్వారమున తనయొక్క సస్యాద్యుత్పాదకత్వమును వ్యక్తమొనరించుకొనును. అట్లే హ్రీంకారవాచ్యయగు పరదేవత హ్రీంకారభిన్నయై ఈమెయొక్క స్వరూపవిచారణమునందు శుద్ధలక్ష్యార్థ స్వరూపయై అనిర్వచనీయమును స్వవాచక. మంత్రప్రకాశితమగు దేవతారూపమున స్వాభీష్టపురుషార్థప్రాప్తిహేతువగునని అభిప్రాయము.

ఓం హ్రీంకారాంభోదచంచలాయై నమః

హ్రీంకారకందాంకురికా హ్రీంకారైకపరాయణా
హ్రీంకారదీర్ఘికాహంసీ హ్రీంకారోద్యానకేకినీ॥ 40

209. హ్రీంకారకందాంకురికా :-

(హ్రీంకారమను కందమునందు ఈమె మొలక) హ్రీంకారమే కందము అనగ దృఢతరబీజభావము (దుంప). ఈమె హ్రీంకార కందమునందు అంకురిక అనగ ప్రసవము, నూతనాభివ్యక్తి (మొలక) అని అర్థము. లోకమున అంకురాత కంద (దుంప) లోనున్న ఉత్పాదశక్తి నతిక్రమింపకుండ స్కంధ శాఖాపత్ర పుష్ప ఫలరూపమున వివర్తమొంది కందయందున్న సామర్థ్యమును ప్రకటించు కారణమగుచున్నది. అట్లే హ్రీంకారము, వేదైకదేశమగుటచే (వేదములో నొకభాగమగుటచే, ఇతర ప్రమాణము నపేక్షింపకుండ స్వవాచ్యార్థజ్ఞాపనముచే స్వతఃప్రామాణ్యమును కలిగియున్నది. హ్రీంకారమువలన కలుగునట్టి జ్ఞానమునకు విషయమగు రూపమునను, నానాప్రకారజగత్పరిణామ హేతుత్వ సాధకముగను, అఘటితఘటనాపటీయమగు మాయకు ఉపాధికత్వమునను ఈమె వాచ్యవాచకార్థరూప అగుచు అంకురికా ప్రమాణముచే తెలియజేయబడుచున్నది.

ఓం హ్రీంకారకందాంకురికాయై నమః

210. హ్రీంకారైకపరాయణా :-

(హ్రీంకారమే ఏకమగుపరాయణముగ కలది) హ్రీంకారమే ఏకమును పరమును అగు ఆయనముగ కలది. ఏకమనగ అనితరసాధారణము, హ్రీంకారమే చతుర్విధపురుషార్థసాధక మగుటచే దానినే పరమగు అయనముగ అనగ జ్ఞాపకముగ, ప్రమాణముగ, పరాయణముగ కలది. ఈ బీజముయొక్క వాచ్యార్థము మాయ, అది నిరధిష్ఠానముగ (ఆశ్రయరహితముగ) సిద్ధింపదు. కావున మాయకు ఆశ్రయరూపమునను, మాయకు విషయరూపమునను మాయరహితమైనదియే హ్రీం బీజముచే జ్ఞాపక మొనరింపబడుచున్నదని భావము.

ఓం హ్రీంకారైకపరాయణాయై నమః

211 హ్రీంకారదీర్ఘికాహంసీ :-

(హ్రీంకారమను దిగుడుబావియందు ఈమె హంసి) హ్రీంకారమే దీర్ఘిక (దిగుడుబావి) రాజోద్యానమందు క్రీడావాపి; సంసారకాననమందు సంచరించువారికి హ్రీంకారము విశ్రాంతికారణమగుటచే దీర్ఘికతో ఉపమానము చెప్పబడినది "ఆరామ మస్య పశ్యంతి న తం పశ్యతి కశ్చన" (బృహ. ఉ 6-1-14) ఆత్మయొక్క ఆరామమును (ఆత్మనిర్మితమగు గ్రామ నగర వనితాదులను) జనులు చూచెదరు కాని ఆత్మ అని శ్రుతి ఆ-అనగ అంతటను రమింతురుకనుక ఆరామము అనగ జగత్ జగత్తునందు ఉపాసనాదులచే పరమానందప్రాపకరూపమున హ్రీంకారము ఉపమింపబడినది. ఈమె హ్రీంకార దీర్ఘికయందు హంసి-స్త్రీ హంస. లోకమందు సారాసార వివేచనమొనర్చు హంసియున్న వాసిని (దీర్ఘికను)చూచిన పిమ్మట అది ఆధారసువర్ణాదులు కలిగినదని, మహారాజ సంబంధిని అని తెలియుచున్నది; అట్లే ఈమె హ్రీంకారయొక్క వాచ్యార్థ రూపమున ప్రకాశించుచున్నసంబంధి బీజమునకు, (హ్రీంకారమునకు) సుఖోత్పాదకమోక్షహేతుత్వముండుట తెలియజేయుచున్నది.

ఓం హ్రీంకారదీర్ఘికాహంస్యై నమః

212. హ్రీంకారోద్యానకేకినీ :-

(హ్రీంకారమను ఉద్యానవనమందు ఈమె కేకిని) హ్రీంకారము ఫలము నిచ్చునట్టిదగుటచే ఉద్యానవనము వంటిది. ఈమె హ్రీంకారోద్యానమునందు కేకిని-అనగ మయూరి. లోకమునందు అనేకములగు ఆరణ్యపక్షులున్నను రూపధ్వనులచే సుఖకరమగుటచేతను, దర్శనశ్రవణాదులచే ప్రమోదమును కలుగజేయునట్టి దగుట చేతను మయూరికి ఉద్యానవనము నలంకరించునట్టి స్వభావముండుట చెప్పబడినది; అట్లే హ్రీంకారోద్యానమందు ఈమె కేకిని అని చెప్పబడినది. హ్రీంకారరూప దేవత యొక్క ధ్వనికిని, సచ్చిదానంద రూపమగు హ్రీంకారవాచ్యార్థమునకును, పరమపురుషార్థమునకును వాచ్యార్థసాధకత్వమున భేదము లేనప్పటికిని ఈమె బ్రహ్మ విష్ణు రుద్రాదిమూర్తులందును. ఉద్యానవనమందలి తరువల్లి (తీగె) కక్ష (తృణము) గుల్మము (పొద)లవలె ఉత్తమ-నీచములగు దేవతిర్యఙ్మనుష్యాదులందును, మయూరి వలె, స్వేచ్ఛగ, సర్వవ్యాపకత్వమున, తదాత్మరూపమున, శరీరేంద్రియ ప్రాణాదులకు

ఆధారమును పరమప్రేమాస్పదము నగు పరమానంద రూపమున, ప్రత్యగ్గోచరమగు అహంవృత్తివ్యాప రూపమున ఈ బీజముచే ప్రకాశించుచున్నదని భావము.

ఓం హ్రీంకారోద్యానకేకిన్యై నమః

హ్రీంకారారణ్యహరిణీ హ్రీంకారావాలవల్లరీ
హ్రీంకారపంజరశుకీ హ్రీంకారాంగణదీపికా॥ 40

213. హ్రీంకారారణ్యహరిణీ :-

(హ్రీంకారమను అరణ్యమునందు ఈమె హరిణి) హ్రీంకారవాచ్యార్థము నందు ఏకదేశభూతమగు (ఒకభాగమగు) మాయయు, అవిద్యయు వానియొక్క కార్యములును బంధరూపములగుటచే హ్రీంకారమునందు భయహేతువున్నది, అందుచే హ్రీంకారమునకు, వ్యాఘ్రములుండుటచే దుష్ప్రవేశమగు, అరణ్యముతో సామ్యము చెప్పబడినది అరణ్యమువలె హ్రీంకారము - హ్రీంకారారణ్యము, అది ఉపమానోత్తర పద సమాసము. హ్రీంకారారణ్యమందు ఈమె హరిణి (లేడి). అరణ్యమునకు జనిన జనునకు హరిణి కనబడినపుడు ఆ అరణ్యమున వ్యాఘ్రాదులు లేకుండుట వానికి గమ్యమగును, హరిణిని పొందగల సాధనత్వమపుడు ధీరపురుష నకు తెలియుచున్నది అట్లే నిరంతరభక్తిభజనపరులగు ప్రాణులకు, వారియొక్క ఉపాసనాపరిపాక మహిమచే, ఈమె వారిభయమును తొలగించి అపరోక్షీకృతమును, అజ్ఞాననివృత్తిపూర్వకమునగు ఆనందమును కలుగజేయును. కనుక ఈమె హరిణితో ఉపమింపబడినది "త మేవ విదిత్వాఽతిమృత్యు మేతి" (శ్వే. ఉ. 3-8) ప్రకాశ స్వరూపునిగ ఆత్మను తెలుసుకొనినవాడు మృత్యువు నతిక్రమించును అని శ్రుతి.

ఓం హ్రీంకారారణ్యహరిణ్యై నమః

214. హ్రీంకారావాలవల్లరీ :-

(హ్రీంకారమను ఆవాలమున ఈమె వల్లరి తీగె) హ్రీంకారమంత్రము యొక్క వాచ్యవాచకతా సంబంధమైన అర్థమే పరదేవతాస్వరూపము. ఈమె హ్రీంకారోపాసనకు విషయమగు ఫలదానమందు సమర్థ, అందుచే హ్రీంకారమను ఆవాలము (పాదు) నందు ప్రవృద్ధమైన వల్లరి (తీగె) అని ఈమెకు ఉపమానము చెప్ప

బడినది. అనగ వల్లరిని ఆవాలమందు రక్షించునట్లు హ్రీంకారమును సర్వదా జపాదులచే రక్షింపవలయునని తాత్పర్యము.

ఓం హ్రీంకారావాలవల్లర్యై నమః

215. హ్రీంకారపంజరశుకీ :-

హ్రీంకారమను పంజరమునందు ఈమె శుకి (చిలుక). పార్వతీ ప్రతీకమగు హ్రీంకారము మందాధికారులకు కూడ ఉపాసనాయోగ్యముగనున్నది, బాలురను (మందాధికారులను) లాలించునట్టి ధర్మమును పురస్కరించుకొని హ్రీంకారమునకు పంజరముతో సామ్యము చెప్పబడినది. పంజరమందున్న శుకి తన సంలాపముచే మనుష్యుల చిత్తములను రంజింపచేయును, అట్లే ఈమె ఉపాసకుల అదృష్టమునను సరించి వారికి ఫలమునిచ్చుచుండును, కావున శుకితో ఉపమింపబడినది. హ్రీంకారము పంజరమువలెనున్నది, అందు శుకి అనగ ఈమె హ్రీంకారమునకు సార్థక్యము కలుగించునట్టిది - అని అభిప్రాయము.

ఓం హ్రీంకారపంజరశుక్యై నమః

216. హ్రీంకారాంగణదీపికా :-

హ్రీంకారమను అంగణము,[1] అందు ఈమె దీపక (దీపమువలె) నున్నది. అంగణము సర్వసాధారణమగు విశ్రాంతిస్థానము, హ్రీంకారముకూడ అట్టిదే, అందుచే అంగణముతో ఉపమానము చెప్పబడినది హ్రీంకారాంగణమందు దీపికా, అంగణమందున్న దీపిక బాహ్యములును అభ్యంతరములునగు వస్తువులను ప్రకాశింపచేయుచు అక్కడనున్న జనులకు అంధకారనివర్తనపూర్వకమగు అభీష్ట వ్యవహారహేతువగుటచే అందరకు ఉపకారకమగును, కావున అందరచే సంరక్షింపబడుచుండును, అట్లే హ్రీంకార బీజార్థముల నిరంతరాభ్యాసముచే, శ్రవణ మనన నిదిధ్యాసనలచే అపరోక్షీకృతమగు స్వయం ప్రకాశానందరూపయగుచు ఈమె స్వసేవకులకు సర్వోత్కర్ష కలుగజేయును, కావున ఇట్లు ఉపమానము చెప్పబడినది.

(1). ముంగిలి=ఇంటిముందు వసారా.

ఓం హ్రీంకారాంగణదీపికాయై నమః

హ్రీంకారకందరాసింహీ హ్రీంకారాంభోజభృంగికా
హ్రీంకారసుమనోమాధ్వీ హ్రీంకారతరుమంజరీ 41

217. హ్రీంకారకందరాసింహీ :-

(హ్రీంకార కందరమునందు ఈమె సింహి) పర్వతశిఖరాగ్రమందున్న గుహయే కందర — అనగ దరి - అని అర్థము. వేదమౌళి (ఉపనిషత్) పరితమగు హ్రీంకారమునందు గ్రామ్యవిషయములను పొందదలచిన ప్రాణులకు ప్రవేశార్హత లేదు. కావున కందరోపమానము చెప్పబడినది. హ్రీంకార కందరమందు సింహ. సటాదులచే (జూలు మొదలైనవానిచే) ఇది సింహమని తెలియును. కాని సింహమున్న కందరమును ప్రవేశించుటకు క్షుద్ర మృగములు భయమొందును, ధీరుడు మాత్రము సింహముయొక్క ఆశ్రయమును పొంది, సింహనఖనిర్ఘాతములై ఆ పరిసరములందు పడియున్న ముక్తాఫలాదులను పొందును అట్లే, మందభక్తి, ఆలస్యము బుభుక్ష మొదలైనవానిచే కలుషితులైన వారికి చొరరానిదైన హ్రీంకారము ఇతర దేవతాసాధారణము కాబట్టి ఈ పరదేవతను ప్రతిపాదించి స్వదేవతతో ఏకభావమును కామితార్థమును కలుగునట్లుచేయును, కావున హ్రీంకారకందరమునందు సింహితో భావమును ఉపమానము చెప్పబడిది.

ఓం హ్రీంకారకందరాసింహ్యై నమః

218. హ్రీంకారాంభోజభృంగికా :-

(హ్రీంకారమను అంభోజమునందు ఈమె భృంగిక - తుమ్మెద.) అష్టైశ్వర్యాత్మక పురుషార్థసాధనమగు నానాశక్తులుకలిగి యుండుట చేతను, నానాప్రకారములగు వర్ణాంతరములచే (హ, ర, ఈం అను వర్ణములచే) ఘటింపబడినదగుట చేతను హ్రీంకారమునకు పరాగపరిమళాదికములు కలిగిన కమలముతో ఉపమానత్వము చెప్పబడినదని భావింపవలెను. మధుమాత్రహరగ్రహిణి యగు భృంగి సర్వపుష్పములయందలి మధువును గ్రోలుటయందు సర్వసమ అయినప్పటికిని కమలమునందు ప్రభూతమగు మధువుండుటచేత దానియొక్క ఆధిక్యమును తెలియగోరి అందే ఎక్కువ ఆసక్తిని కలిగియుండును. అట్లే, పరదేవత సర్వ మంత్రబీజములచే చెప్ప

బడు దేవతాస్వరానుగతయైనను, విశిష్టగుణములు కలదియు సర్వోపాదానకారణమగు సుగుణబ్రహ్మమును ప్రతిపాదించునట్టియు నగు హ్రీంకారమందు, పరదేవతాస్వరూప తటస్థలక్షణములు కలిగియుండుటచేతను, పరదేవతాఽభిన్నస్వరూపత్వముచేతను, సర్వశబ్దజాలమునకు ప్రకృతి అగుటచేతను హ్రీంకారమందు, లక్షణ చేతగాని రూఢి చేతగాని సంబంధము కలదై హ్రీంకారోపాసకులకు హ్రీంకారమందు అధిష్ఠానము కలిగియున్నట్లు కనుపించును. కావున ఈమెకు భృంగితో సామ్యము వర్ణింపబడినది.

ఓం హ్రీంకారాంభోజభృంగిర్యై నమః

## 219. హ్రీంకారసుమనోమాధ్వీ :-

(ఈమె హ్రీంకారమను సుమనస్సులందలి (పుష్పములందలి) మాధ్వీ - మధువు) వాంఛితఫలప్రదానసాధకమగుటచే హ్రీంకారమునకు సమస్సులతో సాదృశ్యము చెప్పబడినది లేక, అతిమృదువులగుటచే పుష్పములు బహుమాన్యములు, కావున వానియందు వ్యవహరించునపుడు బహుసావధానముతో నుండవలెను. అట్లే హ్రీంకారము నుపాసించువేళలందు, ఈ బీజము పరబ్రహ్మమును చెప్పునట్టిది గనుక, ప్రయత్నపూర్వకముగ ఏకాగ్రమగు మనస్సును కలిగియుండి దీనిని దేవతాఽభిన్నముగ ధ్యానింపవలెను. ఈ విషయమును సంపాదించుటకై పుష్పముతో ఉపమానత్వము చెప్పబడినది. ఎండ, గాలివలన కొన్ని పుష్పము లెండిపోయి నిర్మధువులై ఫలజనశక్తిలేక ఫలోత్పాదములుగాకుండ రాలిపోవును. మరికొన్ని పుష్పములు మధుసహితములై యుండి ఫలజనకములగుట లోకమందు కానవచుచ్చున్నది. పుష్పరసము పృథివీకారణభూతమైన ఉదకన్మాత్ర స్వరూపమగు మధురరసాత్మకమగుటవలన మాధ్వీ అని చెప్పుటచే పుష్పములయొక్క ఫలజనశక్తిజ్ఞాపకము చేయబడుచున్నది. అట్లే ఈమె హ్రీంకారముయొక్క సర్వజనకతాశక్తిని కలిగించునట్టి అధిష్ఠానరూపమగు సచ్చిదానందస్వరూప అగుచు, ఈ మంత్రము నొందినవారికి యథోక్తమగు ఫలహేతువగుచు, హ్రీంకారమందుండును, కావున ఈమెకు మాధ్వీసమానధర్మము చెప్పుట యుక్తముగ నున్నదని తెలుసుకొనవలెను.

ఓం హ్రీంకారసుమనోమాధ్వ్యై నమః

220. హ్రీంకారతరుమంజరీ :-

ఈమె హ్రీంకారమను తరువునందు మంజరి (పుష్పగుచ్ఛము). తరువు అనగ ఫలార్థులై (చెట్టు) మీద కెక్కినవారిని పడకుండ ప్రతిబంధకములచే (శాఖలచే) తరింపచేయును, అనగ వారిని పారమునొందించును, ఫలలాభముచే సంతుష్టులను చేయును. హ్రీంకారమునకు కల్పతరువు దృష్టాంతముగ చెప్పబడినది. శాఖోపశాఖాగ్రగతమైన పుష్పమంజరి, గ్రహణశక్తిగలవారలకు సంవాది ప్రవృత్తిజనకమగుచు.[1] దానియందు ఫలకారణయోగ్యత ఉండుట వారికి తెలియచేయును అట్లే, ఈమె పురుషార్థములను కోరువారికి అసంశయప్రవర్తక అగుచు, ప్రత్యగ్రూపయగుచు, గురూపదిష్ట మంత్రదేవతాత్మకముగ వారిని మంత్రోపాసనయందు అభిముఖులను చేయుచు, వారికి పురుషార్థములను కలిగించును. కనుక పరదేవతకు మంజరీ సాదృశ్యము చెప్పబడినది.

ఓం హ్రీంకారతరుమంజర్యై నమః

సకారాఖ్యా సమరసా సకలాగమసంస్తుతా
సర్వవేదాంతతాత్పర్యభూమిః సదసదాశ్రయా॥ 42

221. సకారాఖ్యా :-

సకారయుక్తమగు - శ్రీవిద్యానామకమగు ఆఖ్య - వాచకశబ్దము కలది. సకారాఖ్య.

ఓం సకారాఖ్యాయై నమః

(1) సంవాది ప్రవృత్తి 112 నామముక్రింద వివరింపబడినది.

222. సమరసా :-

(సమమగు రసము కలది సమరస -) సమమగు రసమనగ ఏకమగు రసము. మధురరసము కలిగిన గుడపిండము (బెల్లపు ముద్ద) నందున్నట్లుగ కార్యమునందు ఈమె ఏకరూపమున వ్యవస్థితయై యుండును. లేక, సంసారదశయందు సర్వజ్ఞత్వకించిజ్ఞత్వాది — విశేషణ భేదములచే భిన్నరసములున్నట్లుగ, భిన్నస్వభా

వములున్నట్లుగ కనుపించునట్టి ఈశ్వరజీవులందు, వేదాంత శ్రవణాదులచే కలిగిన అఖండాకారవృత్తి వ్యాప్తిచే "అహం బ్రహ్మాఽస్మి" అను అభేదానుభవము కలుగగ, అందు ఈమె ఏకరూపమున సాక్షాత్కరించును, కనుక ఏకరస. లేక, "రసో వై సః" (తై. ఉ. 2-7) అతడు "రసరూపుడు" అని శ్రుతి. రసశబ్దమునకు పరబ్రహ్మమని అర్థము. పరబ్రహ్మమును శమముగ అనగ అభిన్నముగ కలది కావున ఏకరస అనగ తైత్తిరీయోపనిషత్తునందు ప్రతిపాదింపబడినట్టిదని అర్థము.1

ఓం సమరసాయై నమః

**2.3. సకలాగమసంస్తుతా :-**

(సకలాగమములచే ఈమె సంస్తుత) ఆగమములనగ, ఆ=అంతటను, గమనము=జ్ఞానమును కలుగజేయునట్టివి, అనగ సకల పదార్థములను గోచరింప

(1) భృగువు తండ్రియగు వరుణిని సమీపించి బ్రహ్మమనగ నేదియో తెలియజెప్పుమని అడిగెను. ఈ భూతము లెందుండి కలుగుచున్నవో, దేనివలన జీవించుచున్నవో అది బ్రహ్మమని అతడు చెప్పెను. అపుడు భృగువు తపస్సు చేసి అన్నమునుండి సమస్తము కలుగుచున్నందున అన్నము బ్రహ్మమని తెలుసుకొని మరల తండ్రికడకు వచ్చెను. తపస్సు బ్రహ్మము. తపస్సుచే బ్రహ్మమునుతెలుసుకొనుము అని తండ్రి చెప్పెను. భృగువు మరల తపస్సుచేసి ప్రాణము బ్రహ్మమని తెలుసుకొనెను. ఇట్లు అనేక పర్యాయములు తండ్రికడకు వచ్చి మరల మరల తపస్సుచేసి మనస్సు బ్రహ్మమని, విజ్ఞానము బ్రహ్మమని తెలుసుకొని చివరకు ఆనందము బ్రహ్మమని కనుగొనెను. అనగ అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ. ఆనందమయ కోశములు ఆత్మగాదని కేవలానందమే ఆత్మయని భృగువు తెలుసుకొనెను. బ్రహ్మము సుకృతమని చెప్పబడినది. అనగ ఇది రసపదార్థము, ఇట్టి సచ్చిదానందైకరసమునను భవించినపుడు ఆనందము కలుగును. ఈ రసము హృదయాకాశమునందు ఆనందరూపమై యున్నది. అని తైత్తిరీయోపనిషత్తు. అన్నమయకోశము స్థూలశరీర శబ్దవాచ్యము, ప్రాణమయ విజ్ఞానము కోశములు సూక్ష్మశరీర శబ్దవాచ్యములు, ఆనందమయకోశము కారణ శరీర శబ్దవాచ్యము,

ఉపాధి విశేషములచే ఆయాకోశములు బ్రహ్మరూపములని చెప్పబడు చున్నవి, ఆనందమయ మగునదికూడ ఉపాధి విశిష్టమే, ఇందు మలిన సత్త్వ ప్రధానమగు అవిద్య ఉపాధి, నిరతిశయానందమే ఆత్మయొక్క స్వరూపమని సూతసంహిత వ్యాఖ్యలో విద్యారణ్యులు వ్రాసిరి. "సర్వాంతరేణ సంపూర్ణో బ్రహ్మ నా న్యేన కేనచిత్॥ యదిదం బ్రహ్మ పుచ్ఛాఖ్యం సత్యజ్ఞానాద్వయాత్మకం। సరసః సర్వదా సాక్షాన్నాన్యథా సురపుంగవాః॥ ఏతమేరసం సాక్షాల్లబ్ధ్వా దేహీ సనాతనం। సుఖీభవతి సర్వత్ర నాన్యథాసురసత్తమాః॥" అని సూత సంహిత-విద్వాదను భవము వలన ఆత్మయొక్క రసాత్మకత్వము నిరూపింపబడుచున్నది ఇట్టి ఆనంద రూపమగు బ్రహ్మము సర్వహృదయములందు భాసించుచునే చెప్పబడుచున్నదని సూతసంహిత వ్యాఖ్యాతయగు విద్యారణ్యులు వ్రాసిరి.

చేయనట్టివియును సవికల్పక నిశ్చయ జ్ఞానములను కలుగించునట్టియునగు వేదములు. సకలపను శబ్దముచే అన్యూనాతిరిక్తములును (సంపూర్ణములును) ఇతిహాస పురాణ సహితములునును, అంగోపాంగ రహస్యసహితములగు వేదములు చెప్పబడుచున్నవి. సకలాగములచే ఈమె సంస్తుత - ఈమెకంటె భిన్నమైనది లేదని నిశ్చయపూర్వకముగ స్తుత, గుణియందున్న గుణములను వేదములను చెప్పుట స్తుతి- ఈ విధముగ వేదము లీమెను ఉపజీవించియున్నవి. సర్వార్థ ప్రకాశములగు వేదములకు సర్వజ్ఞత్వమున్నది కావున వానిచే "ఈమె ఇట్టిది" అని స్తుతివిషయత్వముప అనగ శుద్ధచైతన్యాత్మకముగ, మోక్ష కారణీభూతజ్ఞాన స్వరూపముగ తెలియ బడుచున్నది, అని ధ్వనితార్థము.

ఓం సకలాగమసంస్తుతాయై నమః

## 224. సర్వవేదాంతతాత్పర్యభూమిః

(ఈమె సర్వ వేదాంతములయొక్క తాత్పర్యములకు భూమి అనగ విషయము). వేదములయొక్క అంతము అనగ అవసానము అనగ తత్త్వమస్యాది మహావాక్యములు - వేదాంతములు. సర్వవేదాంతములయొక్క తాత్పర్యమనగ సామా

నాధికరణ్యము - సమన్వయము. సర్వవేదాంత తాత్పర్యమునకు ఈమె భూమి అనగ విషయము, అనగ వానిచే జ్ఞాపకము చేయుబడునట్టిది.

"ఉపక్రమోపసంహారావభ్యాసోఽపూర్వతా ఫలం।
అర్థవాదోపపత్తీచ లింగం తాత్పర్యనిర్ణయే॥

ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము, ఉపపత్తి[1] - ఇవి తాత్పర్యమును నిర్ణయించుటకు ఉపకారము లనునట్టి వచనముగ చెప్పిన తాత్పర్య-నిర్ణాయక ప్రమాణములచే, అతీంద్రియములగు ధర్మములను గోచరింపజేయు వాక్యములందున్నట్లుగ ఉపాసనా జ్ఞాన విధులను చెప్పునట్టివిగాక మిగిలిన వేదాంతవాక్యములు కర్మ శేషత్వమును[2] బోధించుచున్నవను (పూర్వపక్ష) వాదము నిరసింపబడి, వేదాంతశాస్త్రమునందు బ్రహ్మమును చెప్పునట్టి శబ్దములన్నియు సమన్వయముచే అద్వైతబ్రహ్మముననే చెప్పుచున్నవనియు. కర్మోపాసనాకాండ ద్వయము మోక్షహేతు జ్ఞానము కలిగించుటకు ఉపకరించుచున్నదనియు, వేదాంతము లన్నియు తాత్పర్యవిషయముగ అఖండచైతన్యమునే బోధించుచున్నదనియు "తత్తు సమన్వయాత్" (బ్ర. సూ 1-1-4) అను అధికరణమున ప్రతిష్ఠింపబడినది. కావున

(1) ఉపక్రమము - ప్రతిపాద్యమగు విషయము(బ్రహ్మము)గ్రంథావసానారంభములందు ఐక్యమని చెప్పుట
అభ్యాసము - ప్రతిపాద్య విషయమును (నీవే బ్రహ్మమని) పెక్కుసార్లు చెప్పుట
అపూర్వత - మరియొక ప్రమాణముచే ఈ విషయములు తెలియజేయబడకుండుట, బ్రహ్మము వేదాంతము చేతనే తెలియబడుచున్నది.
ఫలము-ఈ విషయమును తెలుసుకొనుటవలన కలుగుఫలము(మోక్షము).
అర్థవాదము - ఈ అర్థమునే స్తుతించుట
ఉపపత్తి - యుక్తివలన ఈ విషయమునే సాధించుట.

(2) వేదవాక్యములన్నియు ప్రవృత్తి నిషేధ పరములగు విధిరూపములనియు, కావున బ్రహ్మమును చెప్పునట్టి (వేదములోని ఒక భాగమగు) వేదాంత వాక్యములుకూడ ఉపాసనావిధిని చెప్పునట్టి వాక్యములు కావలయును, లేక జ్ఞానవిధిని చెప్పునట్టి వాక్యములు కావలయును

ఇట విస్తృతముగ చెప్పుటలేదు. "సామానాధికరణ్యం ।1 విశేషణతా, లక్ష్యలక్షణ భావశ్చ పదార్థ ప్రత్యగాత్మనామ్" - అను న్యాయముచే సామానాధికరణ్యసంబంధమున, లక్ష్యలక్షణ భావసంబంధమునకు వేదాంతములు (పరమాత్మ ప్రత్యగాత్మల యొక్క అభేదమను) అఖండార్థమునే బోధించుచున్నవి అని తాత్పర్యము.

ఓం సర్వవేదాంతతాత్పర్యభూమయే నమః

225. సదాశ్రయా :-

(సత్, అసత్తులకు ఈమె ఆశ్రయము) సత్, అనగ పృథివ్యప్తేజోభూత త్రయము, అపరోక్షమున కలవను ప్రతీతికి విషయములగుట చేతను, వ్యవహరింప సత్, అనుదానియొక్క కార్యమునకు రూపాదికము కలుగుటచేతను, వ్యావహారిక సత్తాశ్రయము కలిగియుండుట చేతను ఈ భూతత్రయము సత్పదవాచ్యము లగుచున్నవి. సద్భిన్నముగ నుండి పరోక్ష జ్ఞానముచే తెలియపడు నట్టివియగు వాయువు, ఆకాశము మొదలగునవియు వాని కార్యములును, రూపాది భిన్నగుణములకు ఆశ్రయములుగ నుండి అసత్పదవాచ్యములగుచున్నవి. ఈమె సత్ - అసత్తులకు ఆశ్రయమైనది, అనగ వీనికి ఈమె ఉపాదాన కారణము, అధిష్ఠానమని అర్థము ఆరోపితమగు దాని యందు అధిష్ఠాన సత్తాకంటె భిన్నమగు సత్తాలేనందునను, అధిష్ఠానమే ఆరోపితమునకు సత్తాస్ఫూర్తిని కలుగజేయునట్టి దగుటచేతను సర్వదా అధిష్ఠానము ఆరోపితమందు అనుస్యూతమై యుండునని భావింపవలెను.

ఓం సదసదాశ్రయాయై నమః

సకలా సచ్చిదానందా సాధ్వీ సద్గతిదాయినీ।
సనకాదిమునిధ్యేయా సదాశివకుటుంబినీ॥ 44

226. సకలా :-

(కళలు కలది సకల) కళలు ఆరోపింపబడినవి, అనగ ఉపాసనార్థము కల్పింపబడినది. జాబాలిచే సత్యకామునకు చెప్పబడిన షోడశ కళాయుక్త పురుషోపాసన ప్రతిపాదకమగు ఛాందోగ్యోపనిషద్వచనము ప్రకారముగ1 కళలచే చెప్పబడునట్టి అవయవములచే వర్తించునట్టిది. కనుక ఈమె సకల. లేక, సకల అనగ చతుష్షష్టికళలు కలదని గాని చంద్రికళలు కల దనిగాని చెప్పవచ్చును. లేక, కళాశబ్దము

సుఖాదులచే కలుగుచున్న కాంతిని చెప్పునని అర్థము చెప్పవచ్చును. అట్టి కాంతిని కలిగియున్నది కావున ఈమె సకల.

లేక, అవి కర్మశేషత్వమున (కర్మములకు అంగములుగ, అంగాంగి భావమున) జెప్పబడినవని అంగీకరింపవలెనని చెప్పెడి పూర్వపక్ష వాదమును ఖండించి వేదాంత వాక్యములు సమన్వయముచే సిద్ధమగు అద్వైత బ్రహ్మమునందే పర్యవసన్నమైనని "సత్తు సమన్వయాత్" అను వేదాంత సూత్ర భాష్యమున శంకరులు స్థాపించిరి. కావున బ్రహ్మము అవికార్యములు, క్రియాసాధ్యము కానిది, జ్ఞానవిధికి విషయము కానిది, నిత్యము సిద్ధమునగు పదార్థము, వేదాంత వాక్యములన్నియు సిద్ధమగు బ్రహ్మమునే చెప్పుచున్నవి, కావున వేదమునందు విధి నిషేధ ప్రతిపాదకమగు భాగమేగాక సిద్ధవస్తు ప్రతిపాదకమగు భాగముకూడ కలదని తాత్పర్యము.

(1) జీవభావమునకు బాధనొందించి బ్రహ్మభావము నొందుట సామానాధికరణ్యము. నేను కర్తనుగాను, బ్రహ్మము నేనని తెలుసుకొనుటను బాధా సామానాధికరణ్య మందురు.

ఓం సకలాయై నమః

227. సచ్చిదానందా :—

(ఈమె సచ్చిదానందాము స్వరూపముగ కలది) సత్ + చిత్=సచ్చిత్ సచ్చిత్ + ఆనందము=సచ్చిదానందము. సత్త్వమనగ కాలత్రయమునందు బాధింపబడకుండుట (ఎల్లకాలముండుట), చిత్త్వమనగ స్వప్రకాశమునకంటె ఇతరమగు ప్రకాశముచే ప్రకాశింపబడకుండుట, ఆనందత్వమనగ పరమ ప్రేమమునకు ఆస్పదమగుట. "సత్యం జ్ఞాన మనంతం" (తై. ఉ. 2-1) బ్రహ్మమును సత్యము జ్ఞానము అనంతమైనది. "విజ్ఞానమానందం బ్రహ్మ" బ్రహ్మము - విజ్ఞానము ఆనందము. "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" ఛా. ఉ 6-2-1) సృష్టికి ముందు సత్పదార్థ మొక్కటియే ఉన్నది. "ప్రజ్ఞా ప్రతిష్ఠా, ప్రజ్ఞానం బ్రహ్మ ఆనందం బ్రహ్మేతి వ్యజానాత్" (తై. ఉ. 3-5) ఆనందమే బ్రహ్మమని తెలుసుకొనవలెను. "ఆనందం బ్రహ్మణో విద్వాన్న బిభేతి కుతశ్చన" (తై. ఉ. 3-5) బ్రహ్మానంద

మెరిగినవాడు దేనివలనను భయమొందడు - అని శ్రుతులందు చెప్పిన సచ్చిదానంద ములను ఈమె స్వరూపముగ కలిగియున్నది అనగ వేదాంత శాస్త్రోక్తమగు బ్రహ్మస్వరూపలక్షణములచే ఈమె తెలియబడినది - అని అర్థము.

ఓం సచ్చిదానందాయై నమః

228. సాధ్వ్యా :-

(సాధ్యమగునట్టిది సాధ్య) కర్మోపాసనాదులచేత, మహా వాక్యముల శ్రవణము వలన కలిగిన బ్రహ్మ విద్యారూపమున సాధన చతుష్టయ సంపన్నుడగు అధికారిచే ఈమె, ఫల స్వరూపమగుటవలన, అపరోక్షత్వమున సాధించుటకు అనగ తెలుసుకొనుటకు యోగ్య, కావున సాధ్య. సాధ్వీ అను పాఠాంతరమున, సాధువు యొక్క స్త్రీ, సాధ్వీ - అని అర్థము. సాధువు - అనగ సత్త్వగుణసంపన్నుడు అనగ సకల విద్యాపారత్వము కలిగి సదాచార సంపన్నుడై దైవీసంపత్తు కలవాడు అని అర్థము. అట్టి శివునియందు ఏకనిష్ఠమై పరమ పతివ్రతయగుచు స్త్రీలకు పాతివ్రత్య సంప్రదాయ ప్రవర్తిక అగుచున్నది కావున సాధ్వీ

(1) బ్రహ్మము యొక్క నాలుగు పాదములు ఛాందోగ్యము నందు ఈ విధముగ వర్ణింపబడినవి (1) ప్రాక్ ప్రతీచీ. దక్షిణోత్తరములు ఈ దిక్కులు నాలుగు మొదటి పాదమునందలి దిక్కళలు. వీని నుపాసించు వారు ప్రకాశము (ప్రఖ్యాతి) నొందుదురు. (2) పృథివి, అంతరిక్షము, ఆకాశము, సముద్రము, ఇవి రెండవ పాదమునందలి కళలు. వీని నుపాసించువారు అనంతులై లోకములను, జయింతురు. (3) అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్, ఇవి మూడవ పాదమందలి కళలు. వీని నుపాసించువారు జ్యోతిష్మంతులై, లోకములను జయింతురు. (4) ప్రాణము, చక్షువు, శ్రోత్రము, మనస్సు, ఇవి నాలుగవ పాదము నందలి కళలు, వీనిని ఉపాసించువారు ఆయతనవంతులగుదురు. అనగ సర్వకరణోపహృతభోగముల నొందుదురు. ఇట్లు జగత్తునంతను 16 భాగములుగ విభజించి అందు బ్రహ్మదృష్టి విధించిరి.

ఓం సాధ్వ్యై నమః

(229) సద్గతిదాయినీ :-

(సద్గతిని ఇచ్చునట్టిది.) సద్గతి అనగ పునరావృత్తి రహితము, సమీచీనము, సుఖమాత్రరూపమునగు గతి. లేక, గతి అనగ గమ్యతే-పొందబడునది, తెలియబడునది అని అర్థము. ఏది తెలియబడుచున్నదో అదియే గతి తదన్యమైనది అజ్ఞాతమగుటవలన గతి శబ్ద వాచ్యముకాదు దీని ఫలమిది అని తెలిసినపుడు దానియందు ఇచ్ఛ కలిగి పురుషుడు తత్సాధనములందు ప్రవర్తించును; అంతియే కాని ఫలసాధనములు అజ్ఞాతములైన దానియందు ప్రవర్తింపడు - అని అన్వయ వ్యతిరేకములు. "బ్రహ్మవిదాప్నోతి పరమ్" (తై. ఉ 2-1) బ్రహ్మవేత్తపరమగు దానిని పొందును. "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ముం ఉ 3-2-2) బ్రహ్మ మెరిగినవాడు బ్రహ్మమగును. "యే పూర్వం దేవా ఋషయ శ్చ తద్విదుః తే తన్మయా అమృతా వై బభూవుః" (శ్వే. ఉ. 5-6) పూర్వము బ్రహ్మము నెరిగిన దేవతలు ఋషులు తన్మయులై అమృతులైరి. ఇత్యాది శ్రుతులచే పరదేవతా స్వరూపమే ముక్తి స్వరూపమగుట వలన సద్గతి అనబడును. సద్గతికి ఆవరికముగనున్న అజ్ఞానమును పోగొట్టి స్వరూపానందమును వ్యక్తము చేయునట్టిది సద్గతిదాయిని. గతియు దానమును భిన్నార్థకములు కావు. అయినను "తదాత్మానం స్వయమకురత" తనను తాను చేసుకొనెను, అను ప్రయోగములందువలె ఇక్కడ కర్మకర్తృ ప్రయోగము యుక్తముగనున్నదని చెప్పవచ్చును. [1] లేక, సద్గతిని. అనగ సత్త్వగుణయుక్త దేవయానాది గతిని ఇచ్చునట్టిది కావున ఈమె సద్గతి దాయిని.

ఓం సద్గతిదాయిన్యై నమః

---

(1) స్వవ్యాపారములో కర్త స్వతంత్రుడు. కాని సౌకర్యాతిశయమును సూచించుటకై కర్మాదులను కర్తగా చెప్పుట కర్మ కర్తృ ప్రయోగము. ఇక్కడ సద్గతిని ఇచ్చునట్టిదియు, పొందునట్టియు ఒక్కటే అంతయు బ్రహ్మమే కనుక ఇట్లు చెప్పబడినది. బ్రహ్మమే చేయునది, చేయబడునది:

(230) సనకాదిమునిధ్యేయా :-

(సనకాది మునులచే ఈమె ధ్యానింప తగినది) మననశీలము కలవారు మునులు. మననశబ్దము లక్షణచే సాక్షాత్కారమును చెప్పును, కావున మునులనగ సాక్షాత్కారము నొందినవారు, అని అర్థము. బ్రహ్మయొక్క మానసిక పుత్రులును జ్ఞాన వైరాగ్యాది సంపన్నులును మోక్షమార్గ ప్రవర్తకులును, సనకుడు ఆదిగ కల వారు సనకాదిమునులు. సనకసనందన సనాతన సనత్కుమార ప్రముఖులు. వీరు ఏషణారహితులు, చింతారహితులు. వారిచే ఈమె ధ్యేయ. అనగ అత్యాదరమున స్వాత్మకంటె అభిన్నమను జ్ఞానమున సర్వదా విషయీకృత, "త్వం వా అహ మస్మి భగవో దేవతే అహం వై త్వమసి" (దేవత! నీవే నేను, నేనే నీవు) అని శ్రుతి. "క్షేత్రజ్ఞం చాఽపి మాం విద్ధి" (నేనే క్షేత్రజ్ఞుడనని తెలియుము) అని భగవద్గీత. "ఆత్మానం చేద్విజానీయాద్ అహ మస్మీతి పూరుషః" (బృహ. ఉ. 6-4-12) (ఆత్మను శుద్ధబుద్ధముక్తస్వభావముగ నెరిగినవాడు), "అథయోఽన్యాం దేవతాముపాస్తేఽన్యో సావన్యోఽహమస్మీతి న స వేద యథా పశుః" (బృహ. ఉ 1-4-10), ఆత్మాతిరిక్తమైన ఇతర దేవతల నుపాసించువాడు, తాను దేవతకంటె భిన్నుడనుకొని అజ్ఞుడగుచున్నాడు. అట్టివాడు పశువువలె పశ్వకర్మలందు (దేవత లచే) నియుక్తుడగుచున్నాడు. "మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" (కఠ. ఉ. 2-4-10) అనేకముగ చూచువాడు మృత్యుపరంపర నొందును. ఇట్టి శ్రుతిస్మృతులనేకములు స్వాత్మాభిన్నధ్యానమును చెప్పుచున్నవి.

ఓం సనకాదిమునిధ్యేయాయై నమః

(231) సదాశివకుటుంబినీ :—

సదాశివుడు కుటుంబముగ ఈమెకు కలదుకావున ఈమెసదాశివ కుటుంబిని;

ఓం సదాశివకుటుంబిన్యై నమః

సకలాధిష్ఠానరూపా సత్యరూపా సమాకృతిః
సర్వప్రపంచనిర్మాత్రీ సమానాధిక వర్జితా॥ 45

(232) సకలాధిష్ఠానరూపా ;—

(సకలమునకు అధిష్ఠాన రూపమున ఈమె యున్నది.) "అథాత ఆదేశో నేతి నేతి" (బృహ, ఉ. 4 - 3 - ) సత్యముయొక్క సత్యమగు బ్రహ్మము, నేతినేతి, ఇదికాదు, ఇదికాదు అని ఆదేశింపబడెను "నేహ నానాస్తి కించన" (కఠ ఉ 2 - 4 - 10) అక్కడ నానారూపమైన వస్తువులేదు ఇట్టి నిషేధ శ్రుతులచే ఈమె (బ్రహ్మము) తెలియబడుచున్న "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇది అంతయు బ్రహ్మము. ఇత్యాది బాధావాక్యములందు కారణ కార్యములకు సామానాధికరణ్యము తెలియుచున్నది బాధ అనగ కార్యము కారణముకంటె అభిన్నమగు జ్ఞానము భ్రమరూపమైనదే. "నేతినేతి" అని చెప్పిన శ్రుతి నిషేధమునకు ఎక్కడనో ఒకచోట అవధియొక్క అపేక్ష ఉన్నది, ప్రకృత్యాదులు బ్రహ్మము కాదని తత్త్వజ్ఞానముచే తెలియుచున్నది. అనాది యగుటచే ఈమెయే నిషేధమునకు అవధి యని, సర్వాధిష్ఠాన రూపమైనదని తెలియుచున్నది, అని భావము. 1

ఓం సకలాధిష్ఠానరూపాయై నమః

(1) నేతినేతి, అను నిషేధమునకొక అవధి యున్నది. అనగ బ్రహ్మము ఇది కాదు ఇది కాదు అని చెప్పుచు పోయి ఎక్కడనో ఒకచోట ఆగి ఇదియేనని చెప్పవలెను. ప్రకృతియే బ్రహ్మమని చెప్పుటకు వీలులేదు. ఏలనన తత్త్వజ్ఞానముచే ప్రకృత్యాదులు నిషేధముయొక్క పరిధిలో పడుచున్నవి. కావున పరదేవతయే నిషేధమునకు అవధి అని చెప్పవలెను.

---

(233) సత్యరూపా ;—

(సత్యమగు రూపము కలది) సత్యమనగ జడానృతములు లేనిది. అనగ సచ్చిదానందరూపములు కలది. పరిణామవాదము నాశ్రయించిన యడల సత్, అనగ అపరోక్ష జ్ఞానయోగ్యములగు పృథివి, జలము తేజస్సులు. త్యత్, అనగ పరోక్ష జ్ఞాన విషయములు నిత్యానుమేయములగు వాయువు ఆకాశము, "సచ్చ త్యచ్చాభవత్" (తై ఉ. 2 -6.) అది సత్యత్తు అయినది, అని శ్రుతి. సత్యమగు రూపము కలది సత్యరూప.

ఓం సత్యరూపాయై నమః

(284) సమాకృతిః ;—

(సమమగు ఆకృతి కలది) సమమగు - అభిన్నమగు అనగ సచ్చి దానందరూపైకరసమగు, ఆకృతి — మూర్తి కలది సమాకృతి. లేక, సమమగు మూర్తి కలది అనగ లేకుండ యథాశాస్త్రప్రమాణమగు విగ్రహము కలది. లేక, గుణ బలవీర్యయశో గాంభీర్యధైర్య - ఇంగితాక పరిజ్ఞానసర్వజ్ఞత్వాదిబహుశధర్మ విశేషములచే సదాశివునితో సమానమగు మూర్తికలది. కావున సమాకృతి. లేక, చతుర్విధభూత సమూహమునందు 1 వారి వారి ప్రారబ్ధానుసారముగ వారియందు సమముగ నున్నది. అనగ ఆయా ప్రాణులందు నివాసయోగ్యమగు మూర్తికలదిం లేక' కర్మాధ్యక్షత్వము కలిగిన ఈమె ఆయఫలముల నిచ్చుటయందు సమమగు పక్షపాత రహితమగు మూర్తి కలది కావున సమాకృతి. లేక, సమమైన మూర్తి అనగ బాల్యవృద్ధత్వాదిభావవికారములు లేకుండ ఏకప్రకారముగ నుండునట్టి నిత్య యౌవనశాలియగు మూర్తికలది సమాకృతి, "సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్" ( 18 - 54 ) - సర్వభూతములందు సమముగ ఆత్మౌపమ్యమున నుండువాడు నాయందు పరమమగు భక్తి నొందును. అని భగవద్గీత. "అంగుష్ఠ మాత్రం పురుషోంతరాత్మా, సదా జనానాం హృదయే సంనివిష్టః" (కఠ. ఉ 1-1ి. అంగుష్ఠమాత్రుడును అంతరాత్మయునగు పురుషుడు జనుల హృదయమందు ఎల్లప్పుడుండును. ఈ స్మృతి శ్రుతులచే ఈమె ఏకరూప అని తెలియుచున్నది. ఓం సమాకృతయే నమః

(285) సర్వప్రపంచనిర్మాత్రీ :—

(ఈమె సర్వ ప్రపంచముయొక్క నిర్మాత్రి) ప్రవచింపబడునది అనగ విస్తరింపబడునది గనుక ప్రపంచము - సర్వమగు ప్రపంచము సర్వప్రపంచము. సంసారము అనాది అగుటచేతను, మోక్షస్థితికి కారణమగుట చేతను, భూతభవిష్య ద్వర్తమాన కాలములందుండుటచేతను, సంసారమునకు సర్వమను విశేషణము చెప్ప బడినది "ఏకం బీజం బహుధా యః కరోతి" (శ్వే. ఉ. 6-12) ఏకమగు బీజ మును అనేకముగ చేయునట్టివానిని కనుగొనిన వారు, అని శ్రుతిచే ప్రవచింప

బడునది ప్రపంచము. అట్టి సర్వప్రపంచముయొక్క నిర్మాత్రి నిర్మాణమనగ అభివ్యక్తి. ప్రపంచాభివ్యక్తికి ఈమె నిమిత్తకారణమగుటచే ఈమెయందు కర్తృత్వము, "దేవదత్తుడు వండుచున్నాడు" అను వాక్యమునందు వలె, లక్షణచే కలుగుచున్నది.

ఓం సర్వప్రపంచనిర్మాత్ర్యై నమః

(236) సమానాధికవర్జితా :-

(సమానులు అధికులు లేనట్టిది) కులశీలజాతి గుణాదులచే తుల్యమైన వారు సమానులు: అట్టి గుణాదులచే ఎక్కువైనవారు అధికులు. సమానులచే కాని అధికులచే కాని ఈమె వర్జిత - అట్టి వారు లేనట్టిది. "న తస్య ప్రతిమాఽస్తి" (శ్వే. ఉ. 4–19) వానికి ఉపమానముగ నుండునది లేదు. "విశ్వాధికో రుద్రో మహర్షిః" (శ్వే. ఉ. 3-4) ఇతడు (రుద్రుడు) విశ్వమునకు అధికుడు సర్వజ్ఞుడు. "సర్వాధిపత్యం కురుతే మహాత్మా" (శ్వే. ఉ 5-3) ఇతడు సర్వాధిపత్యము కలవాడు. "ఏకమేవాఽ ద్వితీయమ్" (ఛా ఉ 6–2–1) మొదట ఏకము అద్వితీయమగునదియే ఉన్నది. "న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయే" (భ. గీ. 11-43) నీకు సముదేలేడు. నీకంటె అధికుండుడెట్లు? అని శ్రుతి స్మృతులు చెప్పుచున్నవి ఈమెయొక్క దృష్టియందు ఈమెకు సమాననీయుడగు సమానుడు గాని పూజనీయుడగు అధికుడుగాని లేడు. కావున ఈ ఉభయులనే ఈమె వర్జిత. "ఏకమేవాఽద్వితీయంబ్రహ్మ" అని శ్రుతి.

(1) అండజ, స్వేదజ, జరాయుజ. ఉద్భిజ్జములందు.

ఓం సమానాధికవర్జితాయై నమః

సర్వోత్తుంగా సంగహీనా సగుణా సకలేష్టదా
కకారిణీ కావ్యలోలా కామేశ్వరమనోహరా॥ 46

(237) సర్వోత్తుంగా ;—

(సర్వముకంటె ఈమె ఉత్తుంగ—ఉన్నతమైనది.) కార్యముకంటె కారణము అధికము. కావున సర్వకారణ మగునట్టి ఈమె సర్వముకంటె ఉత్తుంగ — ఉన్నత "పాదోఽస్యవిశ్వా భూతాని త్రిపాదస్యాఽమృతం దివి" 1 (ఛా. ఉ. 3-12-6)

సర్వభూతములు బ్రహ్మముయొక్క అంశమాత్రములే, మిగిలిన మూడు పాదములను కలిసి గాయత్రాత్మయై అమృతుడగు పురుషుడు స్వాత్మయందు అవస్థితుడై యున్నాడు అని శ్రుతి.

ఓం సర్వోత్తుంగాయై నమః

(238) సంగహీనా :—

(నిస్సంగ) అవయవత్వము, కారణత్వము, గుణత్వము ఇవి లేకుండుటచే గాని, నిత్య శుద్ధబుద్ధముక్త స్వరూపత్వమొందియుండుటచే గాని సంగముఅనగ సంబంధము లేనట్టిది కావున సంగహీన. "అసంగో నహి సజ్జతే" (బృహ ఉ. 6—2—4) ఇతడు అసంగుడు, శక్తి లేనివాడు "న చాస్య కశ్చి జ్జనితా న చాధిపః" (శ్వే. ఉ 6— ) వీనికొక జనితకాని ఆధిపుడుకాని లేడు" అను శ్రుతులచే ఈమె సంగహీన.

ఓం సంగహీనాయై నమః

(239) సగుణా :—

(గుణములచే వర్తించునట్టిది) సద్గుణములగు గుణములు కలది సగుణ. అనగ ఏకప్రకారమైన సత్యకామత్వాది గుణములు కలది అని అర్థము. "గుణీ సర్వవిద్యః" (శ్వేఉ 6-1-6) ఎవడు గుణము కలవాడో, సర్వవేత్తయో అని శ్రుతి. "సత్యకామః సత్య సంకల్పః" (ఛా. ఉ. 8-15) ఇతడు సత్యకాముడు, సత్యసంకల్పుడు అని శ్రుతులచే గుణిత్వము చెప్పబడినది. లేక, త్రిమూర్తిస్వరూపమున సత్త్వ రజ స్తమోగుణములచే వర్తించునట్టిది కావున ఈమె సగుణ అని చెప్పవచ్చును.

(1) బ్రహ్మము పాదచతుష్టయాత్మకము, ఆ పాదములేవనగ అవిద్యాపాదము సువిద్యాపాదము, ఆనందపాదము, తురీయపాదము. ఇందు అవిద్యా శబలితమైనది. మిగిలిన పాదత్రయము శుద్ధబోధానందస్వరూపమగు అమృతమని మహానారాయణోపనిషత్తు, నాలుగుపాదములు కలిగిన గాయత్రీ మంత్రముచే చెప్పబడిన పురుషుడు మహామహిమ కలవాడని, వానిలో పాతికభాగము సర్వభూతాత్మకమని మిగిలిన ముప్పాతిక వాని అమృతస్వరూపమని ఛాందోగ్యము.

ఓం సగుణాయై నమః

(240) సకలేష్టదా :—

(సకలములగు ఇష్టములను ఇచ్చునట్టిది) ఇచ్ఛకు విషయభూతములగు నవి ఇష్టములు, అనగ కామ్యములు సకలములగు ఇష్టములు - సకలేష్టములని అభేదసమాసము, ఇట్లు అర్థము చెప్పుకొనిపోయిన యెడల జీవాదులకున్నట్లు పర దేవతకు కూడ ఒకానొక్క విషయమున అసామర్థ్యమున్నదను శంక కలుగవచ్చును. ఏకమగు పదార్థమునందు అనేకులకు ఇచ్ఛ కనబడుచున్నందున అట్టి శంక కలుగ వచ్చును. కాని అట్టి శంకకు తావులేదు ఏకమగుదానియందే కామన ఉన్నను దానితో కూడియున్న వానినన్నింటిని ఈమె కలుగించును కావున బహుఫలప్రదా తృత్వమున అత్యంత విశ్వసనీయతచే పరదేవతయొక్క అతిశయము తెలియజేయ బడుచున్నది. లేక, పరిచ్ఛిన్న పరిమిత భాగ్యములు కలిగిన ప్రాణులకు అన్నింటి యందును కోరిక ఉన్నప్పటికిని ఏవి శాస్త్రావిరోధమున స్వబుద్ధిచే వాంఛింపదగి నదో వానినన్నిటిని మాత్రమే ఈమె ఇచ్చును. జనులకు గల ఇచ్ఛ బహుప్రకార కము, దుష్పూరణీయము. అందుచే పైనచెప్పిన దానికంటె అధికముగ ఈమె కల్పింపదు. లేక, సర్వ ప్రాణులకు ఇష్టిచే - ఇజ్యచే - పూజచే విషయీకృతయై లేక యజ్ఞముచే సమారాధితయై ఈమె ఫలప్రద అగుచున్నది, కావున సకలేష్టద; "అహం చ సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభు రేవచ" (భ గీ. 6-24) నేను సర్వ యజ్ఞములకు భోక్తను ప్రభువును. "ఏష హ్యేవ సాధు కర్మ కారయతి య మేభ్యో లోకేభ్య ఉన్నినీషతి" (కౌ. ఉ. 3-8) ఎవరి నుద్ధరింపదలచునో వానిచే సాధుకర్మ చేయించును, అను స్మృతి శ్రుతులచే పరమేశ్వరారాధ నబుద్ధితో చేయు కర్మముల మోక్ష ఫలప్రదములు: కావున అవియే శుభఫలములు. కామ్యఫలార్థుల కర్మములు జన్మమరణాది బంధకములు. కావున స్వల్పఫలములు, అనాదరణీయములు. లేక, కళలచే అనగ అవయవములచే, అనగ తరతమభావములచే సహితము లైనట్టివి— సకలములు, అట్టి ఇష్టములైన ఫలముల నిచ్చునట్టిది కావున సకలేష్టద, అనగ ఆనంద స్వరూపములగు మనుష్యానందాది బ్రహ్మానంద పర్యంతములగు ఫలముల నిచ్చునట్టిదని అర్థము.

ఓం సకలేష్టదాయై నమః

(241) కకారిణీ :—

మంత్రమున తృతీయఖండమునందలి ద్వితీయ వర్ణరూపమగు కకారము అవయవముగ - వాచకముగ కలది కకారిణీ.

ఓం కకారిణ్యై నమః

(242) కావ్యలోలా ;—

వాల్మీకి వేదవ్యాసాదులు చేసిన కావ్యములందు ఈమె లోల, కావున కావ్యలోల, అనగ అందు వాచ్యలక్ష్యార్థ భేదములచే సంబద్ధయై యున్నదని అర్థము. లేక కవులొనరించిన స్తుతివిశేషములందు ప్రీతి కలదని అర్థము చెప్పవచ్చును.

ఓం కావ్యలోలాయై నమః

(243) కామేశ్వరమనోహరా ;—

కామేశ్వరుని మనస్సును హరించునట్టిది కావున కామేశ్వరమనోహర.

ఓం కామేశ్వరమనోహరాయై నమః

కామేశ్వరప్రాణనాడీ కామేశోత్సంగవాసినీ
కామేశ్వరాలింగితాంగీ కామేశ్వరసుఖప్రదా॥ 47

(244) కామేశ్వరప్రాణనాడీ :—

ఈమె కామేశ్వరునియొక్క ప్రాణనాడి, అనగ నాడీద్వారా ప్రాణము వ చరించునట్లు ఈమె వానియందుండును, అనగ ఈమె వానియొక్క జీవనాడి అని అర్థము. "ఇడయా తు బహిర్యాతి" ఇడా నాడీద్వారమున (ప్రాణవాయువు) బయల్వెడలును, అని లయఖండవచనము ననుసరించి జీవనాడి అని అర్థము చెప్పబడినది. లోకమున యజ్ఞమందు పశువులు పట్టుచుండగ పుండరీకాకారమును, మాంసఖండాత్మకమును, లోపల ఛిద్రములు కలిగినదియు, అష్ట దళములు కలదియు,

(1) జీవుడు నేత్రములందున్నప్పుడు జాగ్రదవస్థకలుగును, కంఠమునందున్నప్పుడు స్వప్నావస్థ కలుగును, హృదయమందున్నప్పుడు సుషుప్త్యవస్థ కలుగును.

అంగుష్ఠపరిమాణరంధ్రయుక్తమగు అధోభాగమును కలదియును. మధ్యను కర్ణిక (బొడ్డు) కలదియునగు హృదయము కానవచ్చును. కర్ణికయందు కేసరములవలె నున్న (వెంట్రుకలవలెనున్న) నాడ్యంకురములు నూరు కలవు. వీని మూలములు హృదయమును చుట్టియున్న పురీతత్ అను నాడియొక్క రంధ్రము నందున్నవి అక్కడ మూలాధారము మొదలుకొని బ్రహ్మరంధ్రపర్యంతము పోవుచున్న సుషుమ్నయందు మూలాధారాది షట్చక్రములున్నవి. ఒక్కొక్క చక్రమునకు విధింపబడిన మాతృకా వర్ణములచే, యోగశాస్త్రోక్త దళముచే, ఈ చక్రమును ఆచ్ఛాదితమై యుండును. సుషుమ్నయొక్క మూలమునందు తామరతూడులోని దారమువలె సన్నదైనదై పృథ్వీదేవతయును, ఆవరణశక్తియునైన కుండలిని దోముఖముగ నిద్రించుచుండును. సుషుమ్నా నాడికి ఎడమప్రైపున ఇడానాడి కలదు. అది భ్రూమధ్యము వరకు ప్రసరించియున్నది. సుషుమ్నకు కుడివైపున పింగళ అను పేరు గల నాడి కలదు. జీవుడు జాగ్రదావస్థలో నేత్రములందు దంపత్యాత్మకముగ నుండునని, శ్రుతియందు కలదు అట్లే స్వప్నమునందు మనస్సును ఉపాధిగ కలిగియుండును. 1 సుషుప్తియందు అజ్ఞానమును ఉపాధిగ కలిగియుండును. జాగ్రదవస్థయందు స్థూలశరీరాభిమానియై విశ్వసంజ్ఞ కలిగియుండును. స్వప్నమందు సూక్ష్మాభిమానియై తైజస సంజ్ఞ కలిగియుండును సుషుప్తియందు కారణాభిమానియై ప్రాజ్ఞ సంజ్ఞ కలిగియుండును. సుషుప్తియందు అద్యోపాధిని పొందియున్న ఇంద్రియములు జాగ్రతయందు స్థూలసూక్ష్మశరీరజన్యమగు భోగసాధనప్రారబ్ధకర్మవశముచే పురీతత్తునుండి నాడీమార్గమున మరల ఆయా ఇంద్రియ గోళములను ప్రవేశించును. అపుడు వీనియందు, ఉపరతమైయున్న ప్రారబ్ధము మరల ఉద్భోధమొందును. ఉయ్యాలయందున్న రాజు గృహాంతరమందున్న సోపానమార్గము ద్వారా ప్రాసాదమును చేరి అందు విహరించి పిమ్మట అంతఃపుర పర్యంతమందు నిద్రించునట్లు, జీవుడు మరల నాడీద్వారమున పురీతత్తును ప్రవేశించి అందు హృదయోపాధికముగ నున్న పరమాత్మయందు ప్రవేశించినపుడు సుప్తుడని చెప్పబడుచున్నాడు. అపుడు లింగశరీరము కారణ రూపముగ లయమొందును ప్రాణాదివాయువులు లయమునొందిన వృత్తులు కలవై అయుఃస్వరూపమున శరీరమును రక్షించును. కావున సుషుప్తియందు ప్రాణధారణమొనరించునది సోపాధికమగు చైతన్యమే. ఇట్లుండుటచేతనే తరువాత కలుగనున్న జాగ్రత్ స్వప్నావస్థలయందు మరల ప్రారబ్ధము ననుభవించుటకు వీలగుచున్నది. ప్రాణధారణ యోగ్యత సోపా

కచైతన్యమున కుండుటచేతనే నాడులకు ప్రాణసంచార యోగ్యత కలుగుచున్నది. "న ప్రాణేన నాఽపానేన మర్త్యో జీవతి కశ్చన, ఇతరేణ తు జీవంతి యస్మి న్నేతా వుపాశ్రితౌ" (క ఠ. ఉ. 5-5) ఏమర్త్యుడును ప్రాణముచే గాని అపానముచే గాని జీవింపడు. ఈ వాయువులు దేవి నాశ్రయించి యున్నచో దానిచేత జీవించును : అని శ్రుతి చెప్పుటచేతను, జీవధాతువునకు ప్రాణధారణము అర్థముగ ధాతుపాఠ మున చెప్పుటచేతను, ప్రాణనాడీ శబ్దమునకు, లక్షణచే, పరమాత్మ అని అర్థము కామేశ్వరునకు ప్రారబ్ధకర్మ జన్యమగు శరీరము లేనప్పటికిని, ఘృతకారిన్య న్యాయ మున మూర్తి కలిగియుండుటచే వానియందు అంతర్యామిగ ఈమె యున్నదను భావ నచే ఈమె కామేశ్వరునియొక్క ప్రాణనాడి లని చెప్పబడినది. అనగ ఈమె కామే శ్వరునకు అధిష్ఠానమైన చైతన్యమని ఫలితార్థము.

ఓం కామేశ్వరప్రాణనాడ్యై నమః

(245) కామేశోత్సంగవాసినీ :—

కామేశుని ఉత్సంగమున అనగ వామాంకమున ఈమె వసించును. "అనేక మన్మథాకారకామేశోత్సంగవాసినీ" అనేక మన్మథాకారుడగు కామేశుని ఉత్సంగమున ఈమె నివసించును అని లలితాతాపనీయము నందున్నది.

ఓం కామేశోత్సంగవాసిన్యై నమః

(246) కామేశ్వరాలింగితాంగీ :—

కామేశ్వరునిచే ఆలింగతము, అనగ అంగీ, కృతమగు అంగము కలది.

ఓం కామేశ్వరాలింగితాంగ్యై నమః

(247) కామేశ్వరసుఖప్రదా :—

కామేశ్వరునకు సుఖమును కలుగజేయునట్టిది కావున కామేశ్వరసుఖప్రద లేక, కామేశ్వరునియొక్క సుఖమనగ సచ్చితానంద సాక్షాత్కారాత్మకమైన సుఖము. అట్టి సుఖమును కలుగజేయునది, అని అర్థము. "దేవో భూత్వా దేవా నప్యేతి" (బృహ. ఉ. 6 - 1 - 2) తాను దేవుడై దేవులను పొందును అను శ్రుతియందు చెప్పిన న్యాయముచే ఈమె స్వకీయ భక్తులకు కామేశ్వరాఽభేదమున సచ్చిదానందా త్మకమగు మోక్షము నిచ్చును, అని అర్థము.

ఓం కామేశ్వరసుఖప్రదాయై నమః

కామేశ్వరప్రణయినీ కామేశ్వరవిలాసినీ
కామేశ్వరతపఃసిద్ధిః కామేశ్వరమనఃప్రియా॥

(248) కామేశ్వరప్రణయినీ :—

(కామేశ్వరునియొక్క ప్రణయని) కామేశ్వరునకు పరమానందఘనమగునట్టి స్వస్వరూపమునందు ఎట్టి ప్రీతికలదో దానికి విషయభూత అయినది కనుక ఈమె కామేశ్వరప్రణయిని.

ఓం కామేశ్వర ప్రణయిన్యై నమః

(249) కామేశ్వరవిలాసినీ :—

కామేశ్వరునియొక్క విలాసమనగ కార్యాత్మకమగు (జగదాత్మకమగు) వివర్తము. అట్టి విలాసము కలది.

కామేశ్వరవిలాసిన్యై నమః

(250) కామేశ్వరతపస్సిద్ధిః :-

కామేశ్వరునియొక్క తపస్సు అనగ జగత్తును సృష్టించవలెనను ఆలోచనాత్మకమగు తపస్సు. అట్టి కామేశ్వర తపస్సునకు ఈమె వలన సిద్ధింపగలుగును. "విధ్యతి అనయా" దీనిచేత తద్ధించును: అను అర్థమును సిద్ధిశబ్దము చెప్పబడినది. అనగ ఈమె కామేశ్వర తపస్సునకు సాధనభూతమైనది; స్త్రీ పురుష రూపమున భేదకల్పన మొనరించి జగత్ సృష్టికి సాధనభూత అయినది అని అర్థము.

ఓం కామేశ్వరతపస్సిద్ధ్యై నమః

(251) కామేశ్వరమనః ప్రియా ....

ఈమె కామేశ్వరుని మనస్సునకు ప్రియ -అనగ ఈమె వానికి నిరవధిక ప్రేమాస్పద.

ఓం కామేశ్వరమనఃప్రియాయై నమః

కామేశ్వరప్రాణనాథా కామేశ్వరవిమోహినీ
కామేశ్వరబ్రహ్మవిద్యా కామేశ్వరగృహేశ్వరీ॥ 49

(252) కామేశ్వరప్రాణనాథా ....

(కామేశ్వరుడు ప్రాణనాథుడుగ కలది) కామేశ్వరునియొక్క ప్రాణము-కామేశ్వరప్రాణము - అనగ హిరణ్యగర్భుడు వానిని పాలించువట్టిది, కనుక ఈమె కామేశ్వర ప్రాణనాథ. లేక, కామేశ్వరుడు ప్రాణనాథుడుగ - వల్లభుడుగ కలది కామేశ్వర ప్రాణనాథ.

ఓం కామేశ్వరప్రాణనాథాయై నమః

(253) కామేశ్వరవిమోహినీ ;—

(కామేశ్వరుని విమోహింపజేయునట్టిది) విమోహింపజేయునది, కనుక ఈమె విమోహిని. తాను భిన్న విగ్రహమునొంది "మనము దంపతులము" అను ద్విప్రకారక జ్ఞానమును కామేశ్వరున కీమె కలుగజేయును. అభేదజ్ఞానము కలిగిన వానికి తద్విపరీతజ్ఞానము (భేదజ్ఞానము) కలుగుట మోహము. అట్టి మోహము నీమె వానికి కలుగజేయును: లేక, ఒక్క విషయమునే అవలంబించియుండి తదన్యములకు విషయమునుండునట్టి బుద్ధిని మోహమందురు. పరమేశ్వరుడు స్వస్వరూప పరదేవతా పరమానంద సాక్షాత్కారమొంది స్థాణువువలె నిశ్చలముగనుండును. ఈ అవస్థనే, ఉపచారమున, (లక్షణచే) మోహమని చెప్పవచ్చును. ఇట్లాదతకు మోహింపబడి యుండగ వానికి తదితరమగు ప్రపంచాకారమును, కర్మములకు ఆశ్రయమైన దానిని మోహింపజేయుచున్నదని గాని లేక ఈమె మోహింపజేయుచున్నట్లుగ కనిపించుచున్నదని గాని అర్థము చెప్పవచ్చును. అంతఃపురగతుడైన రాజును స్త్రీలు మోహింపజేసినట్లుగ ఈమె కామేశ్వరుని మోహింపజేయుచున్నది.

ఓం కామేశ్వరవిమోహిన్యై నమః

[254] కామేశ్వరబ్రహ్మవిద్యా ....

(ఈమె కామేశ్వరునియొక్క బ్రహ్మవిద్య) ఈమె కామేశ్వరునియొక్క తత్త్వం పదార్థసాక్షాత్కారరూప అయినది, అని అర్థము. "యస్సాక్షాదపరోక్ష

ద్బ్రహ్మ" (బృహ. ఉ. 5 - 4 - 1) బ్రహ్మము సాక్షాద్రూపమైనది: అపరోక్షముగ నుండునట్టిదికాదు, అని శ్రుతి.

ఓం కామేశ్వరబ్రహ్మవిద్యాయై నమః

[255] కామేశ్వరగృహేశ్వరీ ....

(ఈమె కామేశ్వరునియొక్క గృహేశ్వరి). గ్రహింపబడనది గ్రహము - అనగ సర్వజ్ఞానమని అర్థము. గ్రహమునకు ఈశ్వరి గృహేశ్వరి 1 కామేశ్వర - సంబంధమగు జ్ఞానమునకు విషయమగుటచే ఈమెయే అధిష్ఠానత్వమున నియామిక అని అర్థము. కావున కామేశ్వర గృహేశ్వరి లేక, "గృహిణీ గృహముచ్యతే" గృహిణియే గృహము అను న్యాయమున కామేశ్వరుడే గృహేశ్వరుడు, వానిని తనయొక్క అధిపతిగ కలది, అని అర్థము.

ఓం కామేశ్వరగృహేశ్వర్యై నమః

కామేశ్వరాహ్లాదకరీ కామేశ్వరమహేశ్వరీ

కామేశ్వరీ కామకోటినిలయా కాంక్షితార్థదా॥ 50

[256] కామేశ్వరాహ్లాదకరీ ....

(కామేశ్వరునకు ఆహ్లాదమును కలుగజేయునట్టిది.) తృప్తివలన కలిగెడు సుఖమును ఆహ్లాద మందురు. పరదేవతాత్మకయగు నీమె పరమేశ్వరునియొక్క నిత్యతృప్తి అను స్వరూపము కలదై వానికి ఆహ్లాదమును కలుగించును.

ఓం కామేశ్వరాహ్లాదకర్యై నమః

(1) కామేశ్వర గ్రహేశ్వరి, అనుపాఠమున ఈ అర్థము చెప్పబడినది

(257) కామేశ్వరమహేశ్వరీ ....

(ఈమె కామేశ్వరునియొక్క మహేశ్వరి.) గొప్పదగు ఈశ్వరి మహేశ్వరి: అనగ నిరూపాధికమగు ఐశ్వర్యము కలదని అర్థము. "మహాన్ ప్రభువు, అని శ్రుతి. కామేశ్వరునియొక్క మహదైశ్వర్యము ఈమెకు కలుగు; అనగ ఈమె భగవతి అనిఅర్థము. "ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశః శ్రియః జ్ఞానవైరాగ్యయో శ్చ షణాం భగ ఇతీరణా" సమగ్రమగు ఐశ్వర్యము, వీర్యము, య

సస్సు, శ్రియము, జ్ఞానము, వైరాగ్యము - ఈ ఆరును భగశబ్దవాచ్యములు: ఈమె వీనిని కలిగియున్నది: కావున భగవతి. "త మీశ్వరాణాం పరమం మహేశ్వరం" శ్వే. ఉ. 6 - 7) ఈశ్వరులగు వైవస్వతయమాదుల కీతడు పరమ మహేశ్వరుడు, అని శ్రుతి.

ఓం కామేశ్వరమహేశ్వర్యై నమః

[258] కామేశ్వరీ ....

మన్మథునిచే ఉపాసింపబడిన కాదివిద్యారూప అని అర్థము.

ఓం కామేశ్వర్యై నమః

(259) కామకోటినిలయా ....

96 పీఠములందు కామకోటి పీఠమొకటైయున్నది. దానిని నిలయముగ అనగ శ్రీ చక్రము నిలయముగ కలది, అని అర్థము.

ఓం కామకోటినిలయాయై నమః

[260] కాంక్షితార్థదా ....

(కాంక్షితములగు అర్థముల నిచ్చునట్టిది) కాంక్షితములనగ కాంక్షకు విషయీభూతములైనవి. కాంక్ష అనగ ప్రాప్తమైన ఇచ్ఛకు సజాతియగు ఇచ్ఛ. అట్టి కాంక్షకు గోచరమగు పదార్థముల నిచ్చునట్టిది కనుక ఈమె కాంక్షితార్థద. "ఉపాస్యదేవత నాయందు ప్రసన్న అగుగాక" అని ఉపాసకునిచే కాంక్షిత అగుచు ఆ కోరికచే చిరకాలము ఉపాసింపబడి ఈమె, ప్రార్థింపబడని కోరికలనుకూడ, అన్ని పురుషార్థములను సచయముగ నిచ్చును.

ఓం కాంక్షితార్థదాయై నమః

లకారిణీ లబ్ధరూపా లబ్ధధీ ర్లబ్ధవాంఛితా
లబ్ధపాపమనోదూరా లబ్ధాహంకారదుర్గమా॥ 51

(261) లకారిణీ ....

(లకారము కలది) మంత్రమందలి తృతీయఖండ తృతీయవర్ణత్వమున ఈమెకు వాచకత్వము కలదు కావున లకారిణీ.

ఓం లకారార్ణాయై నమః

(262) లబ్ధరూపా ....

(లబ్ధమగు రూపము కలది) వీనిచే రూపింపబడునవి, తెలియజేయబడు నవి కనుక రూపములు, అనగ స్వరూప తటస్థ భేదముచే సగుణ నిర్గుణ పరము లగు లక్షణములు: అట్టి రూపములను పొందినది కావున ఈమె. లబ్ధరూప లేక, నిరూపింపబడునది, తెలియజేయబడునది, రూపము - అని అర్థము. ఇది నామము నకు కూడ ఉపలక్షణము. లబ్ధములగు నామరూపములు కలది, అని అర్థము. మొదట స్వీయముగ మాయోపాధిచే శబ్దార్థభావమును పొంది తరువాత నామరూప వ్యాకరణ మొనరించెనని భావము.

ఓం లబ్ధరూపాయై నమః

[263] లబ్ధధీః ....

(లబ్ధమగు బుద్ధులు కలది) నిశ్చయాత్మకములు సంకల్పనాత్మకములునగు అంతఃకరణ వృత్తులు ధీ శబ్దముని చెప్పబడుచున్నవి. అట్టి బుద్ధులను ఉపాధిరూప మున ప్రతిబింబమునకు ఆధారముగ పొందినది అని అర్థము. 1 సాక్షియగు ప్రత్య గాత్మ స్వప్రకాశుడైనను ఘటాది వస్తువులనలె బుద్ధి వృత్తిచే వ్యాపింపబడుచున్నాడు జ్ఞానమనగ వృత్త్యారూఢమగు చైతన్యము, లేక చైతన్యవ్యాప్తమగు వృత్తి అని వేదాంతసిద్ధాంతము. జడములగు ఘటాది విషయములను గ్రహియించుటయందు బుద్ధివృత్తులకు సామర్థ్యమున్నదని అంగీకరింపవలెను: లేకున్న జంగధాంధ్యము ప్రసక్తమగును. స్వరూప చైతన్యము అంతఃకరణాదులందు ఉపసహితమైయుండి అట్టిచైతన్యత్వముచే ఫలమును చెప్పబడు జీవుని (చిదాభాసుని) ప్రకాశింపజేయును. కావున "బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తిర్వ్యాప్తి రిహేష్యతే" బ్రహ్మము విషయ ములో అజ్ఞాననాశము కొరకు బుద్ధివృత్తి వ్యాప్తి అంగీకరింపబడినది, అను న్యాయ మున్నది. అందుచే తత్త్వమస్యాది మహావాక్య శ్రవణము వలన కలిగిన వృత్తి వ్యాప్తిచే లబ్ధమగు బుద్ధికలది అని అర్థము పర్యవసన్న మగుచున్నది. 2 లేక, ధీ శబ్దముచే సర్వజ్ఞతాదిబుద్ధి చెప్పబడుచున్నది. అట్టి బుద్ధిని పొందినది కావున లబ్ధధీః

అని చెప్పవచ్చును. "యః సర్వజ్ఞః సర్వవిత్" (ము ఉ 1-9) ఎవడు సర్వజ్ఞుడో సర్వవేత్తయో అని శ్రుతి.

(1) అంతఃకరణమందు ప్రతిఫలించిన చిద్రూపమే జీవుడు. జీవునకు ఆత్మకు ఈశ్వరునకు బ్రహ్మమునకు చైతన్యాంశమున అభేదము. ఈమె, బుద్ధి యందు ప్రతిఫలించిన చిద్రూపమని అర్థము.

(2) ప్రత్యగాత్మయు పరమాత్మయు ఒక్కటే, కాని ప్రత్యగాత్మ అజ్ఞాన మావరించి యుండును. మహావాక్య విచారణము వలన "నేను బ్రహ్మమును" అను బుద్ధి వృత్తి ప్రత్యగాత్మయందు వ్యాపింపవలెను. ప్రత్యగాత్మ ప్రకాశరూపుడు కావున మరల ఫలవ్యాప్తి అనగ చిదాభాసుని వ్యాప్తి అక్కరలేకుండగనే జ్ఞానము కలుగును. అనాత్మ రూపములగు ఘటాదుల జ్ఞానమందు బుద్ధివృత్తియు, అందు ప్రతిఫలించు చిదాభాసుని యొక్క వృత్తియు వ్యాపించి పిమ్మట ఘటసంబంధమగు అజ్ఞానము నశించుచున్నది అనాత్మయగు ఘటాదికము జడము కావున ఈ ఉభయ వృత్తుల వ్యాప్యత్వము ఇందు అంగీకరింపబడినది. కాని ప్రత్యగాత్మ స్వరూపముచే, చైతన్యరూపుడు అనగ ప్రకాశస్వరూపుడు: కనుక తద్విషయమగు అజ్ఞానము పారద్రోలుటకు బుద్ధివ్యాప్తి యొక్కటేచాలును. ఫలవ్యాప్తి (చిదాభాసుని వ్యాప్తి) అక్కరలేదు చీకటిలోనున్న ఘటము నెరుంగుటకు చక్షువుండవలెను, దీపముండవలెను కాని ప్రకాశ స్వరూప మగు దీపము నెరుంగుటకు చక్షువొక్కటే చాలును అట్లే ప్రకాశ స్వరూపుడగు ప్రత్యగాత్మను తెలుసుకొనుటకు బుద్ధివృత్తి వ్యాప్యత్వము నంగీకరించిన చాలును: ఫలవ్యాప్యత్వ మక్కరలేదు.

ఓం లబ్ధధియే నమః

[264] లబ్ధవాంఛితా ....

(లబ్ధమగు వాంఛితము కలది) వాంఛకు విషయభూతమైనది వాంఛితము అనగ ఇష్టఫలము: దానిని పూర్వమే ఈమె పొందియున్నది: అనగ ఈమె ఆప్తకామ అని అర్థము.

ఓం లబ్ధవాంఛితాయై నమః

[265] లబ్ధపాపమనోదూరా ....

(పాపములనొందిన మనస్సు కలవారలకు ఈమె దూరముగ నుండును.) పాపప్రధానములగునట్టి మనస్సులు పాపమనస్సులు. లబ్ధములగు పాపమనస్సులు కలవారు లబ్ధపాపమనస్సులు - అనగ పాపచింతకులు. వారికిదూర - అవేద్య (తెలియనిది) అని అర్థము. "అన్యత్ర ధర్మా దన్యత్రాఽధర్మా దన్యత్రాఽస్మాత్ కృతాఽకృతాత్" (కఠ. 2. 14) ధర్మాధర్మములకంటె భిన్నమైనది, కార్యకారణ ములకంటె భిన్నమైనది అను శ్రుతిచేతను: "త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి" (బృహ. ఉ. 6-4-22) వేదముననుసరించి అనగ నిత్యస్వాధ్యాయమున బ్రాహ్మణులు బ్రహ్మమును తెలియగోరుదురు" అను శ్రుతిచేతను ఆయా వర్ణాశ్ర మములకు విధింపబడిన ధర్మములను ఈశ్వరార్పణబుద్ధిచే నొనరించినయెడల అవి ఆత్మజ్ఞానసాధనములగునని తెలియుచున్నది. కావున పాపవాసనలు ప్రధానముగ నున్నవారికి ఈమె దురధిగమ (పొందరానిది) అని అర్థము,

ఓం లబ్ధపాపమనోదూరాయై నమః

[266] లబ్ధాహంకారదుర్గమా ....

(అహంకారమొందినవానిచే పొందరానిది) అహంకారమనగ అభిమా నము. ఇది అహంకారముచే కలుగునట్టి అసురసంపత్తి విశేషములకు కూడ ఉప లక్షణము, లబ్ధమగు రాజసతామసాత్మకమగు అహంకారము కలవారు లబ్ధాహంకా రులు: వారికి ఈమె దుర్గమ: దుఃఖముచే అధికప్రయత్నముచే చేయబడుచున్న సాధనకలాపముచే పొందుటకు అనగ తెలియుటకు శక్యము కానిది: కావున దుర్గమ. సత్త్వగుణమున్నప్పుడు సుఖప్రకాశాది గుణములు వ్యాపించియుండును; సత్త్వ గుణములేనప్పుడు సుఖప్రకాశవ్యాప్తి యుండదు: అప్పుడు మనుజునకు మనఃస్థైర్య ముండదు. సత్త్వగుణము లేనపుడు రజస్తమస్సులు ప్రవర్తించును: రజోగుణము కార్యప్రవర్తకము, విక్షేపకము: తమోగుణము ఆవరణప్రధానము: వివేకజ్ఞానము లుదయింపకుండ ప్రతిబంధకము నుండును :దీనివలని నిద్ర, ఆలస్యములు కలుగును

(1) దంభము, దర్పము, అభిమానము, క్రోధము, పారుష్యము, అజ్ఞానము, ఇవి అసురసంపదలని భగవద్గీతలో చెప్పబడినవి. (16—4)

రజస్తమోగుణములచే శ్రేయోమార్గసాధనములను జామిత్వము (సోమరితనము) కలిగి గురువులందు వేదములందు శ్రద్ధ సన్నగిలి, మనస్సు బాహ్యవిషయసంపాదన మందు వ్యగ్రమగును: అప్పుడు లాభము కలిగినయడల హర్షము, నష్టము కలిగిన యెడల శోకము కలుగును; అంతట మనస్సు రాగద్వేషపరమైయుండును: అట్టి అనాత్మజ్ఞులను, అసురసంపత్తి కలవారు నగు మనుజుల మనస్సులందు ఈమె భాసింపదని ఆశయము "తానహం ద్విషతః క్రూరాన్" (భగీ. 16.19) అట్టి క్రూరులకు, ద్వేషబుద్ధికలవారికి నేను అసురజన్మ కల్పింతును" అను భగవద్వాక్యముచే అటివారు జనన మరణ ప్రవాహరూప గు సంసారమునందు పడుదురు. కావున, ఈమె అభిమానరహితుడగు పురుషునిచే స్వాభీష్టలాభముకొరకు చిత్తమందెల్లప్పుడు చింతింవ తగినది అని ఈ నామమునకు అర్థము, "యతయః శుద్ధసత్త్వాః" (ము ఉ. 2-6) వేదాంతవిజ్ఞానముచే నిశ్చయమగు బ్రహ్మజ్ఞానము నొంది సర్వకర్మసన్యాస మొనరించి యత్నశీలురైన శుద్ధసత్త్వులే ముక్తులగుదురు ఇత్యాది శ్రుతు లిందుకు ప్రమాణములు.

ఓం లబ్ధాహంకారదుర్గమాయై నమః

లబ్ధశక్తి ర్లబ్ధదేహా లబ్ధైశ్వర్యసమున్నతిః

లబ్ధవృద్ధి ర్లబ్ధలీలా లబ్ధయౌవనశాలినీ॥ 52

(267) లబ్ధశక్తిః :—

లబ్ధమైనశక్తి కలది లబ్ధశక్తి. అనగ ఈమె సకలసామర్థ్యములు కలిగి యుండుటకు హేతుభూతమగు మాయారూపశక్తిని కలిగియున్నది. "తే ధ్యానయోగానుగతా దేవాత్మశక్తిం స్వగుణై ర్నిగూఢామ్" (శ్వే. ఉ. 1.3) మహేశ్వరుని యొక్క ఆత్మశక్తియే జగత్కారణమని ధ్యానయోగమున ఋషులు కనుగొనిరి. ఈ శక్తి ప్రకృతికార్యములగు (రజస్సత్త్వాది) గుణములచే ఆవరింపబడియున్నది" అని శ్రుతి.

ఓం లబ్ధశక్త్యై నమః

(268) లబ్ధదేహా ....;

లబ్ధదేహము అనగ స్వవిగ్రహముకలది లబ్ధదేహ, ఈమెకు జీవత్వము లేదు, కావున ఈమె కర్మఫలములకు అధీనమై యుండదు. కరిగియున్న నేయి పేరు

కొనినట్లు (ఘృతకాఠిన్య న్యాయమున) స్వేచ్ఛచే ఈమెమూర్తిని గై కొనినది. ఆరోపింపబడిన మాయాశక్తికి భేదకల్పన మొనరించు స్వభావము కలదు. "పతి శ్చ పత్నీ చాఽభవతామ్" (బృహ. ఉ. ?.4.3) ఏకమగు ఆత్మయే పతియని పత్నియని ద్వితాభూతమయ్యెను" అను శ్రుతిచే ఈమెయే (బ్రహ్మమే) దంపతిమూర్తినొందినది అని అభిప్రాయము.

ఓం లబ్ధదేహాయై నమః

(269) లబ్ధైశ్వర్యసమున్నతిః ;—

(లబ్ధమగు ఐశ్వర్యసమున్నతి కలది) ఐశ్వర్యములయొక్క సమున్నతి అనగ ఆధిక్యము, అనగ పర్యవసానము: అట్టిది కలది "త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్" శ్వే (ఉ; 6.7) వైవస్వతయమాదీశ్వరులకు పరమ మహేశ్వరుడును ఇంద్రాదిదేవతలకు పరమదైవతమగు వానినెరుగుదుము' అను శ్రుతియు, "నాంతోఽస్తి మమ దివ్యానాంవిభూతీనాం పరంతప" (భ గీ. 10-0) నాయొక్క దివ్యములగు ఐశ్వర్యములకు అంతములేదు" అను స్మృతియు "సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽంతర్యా మ్యేష యోనిః సర్వస్య" (మా. ఉ. 6) అతడు సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు అంతర్యామి అన్నిటికిని కారణుడు" అను శ్రుతియు ఇందులకు ప్రమాణములు. ఈశ్వరుని ఉపాసించిన అగస్త్యాది మహర్షులకే నిరుపాధిక మహదైశ్వర్య సంపత్తి కలిగియుండుట చెప్పబడినపుడు ఈశ్వరునియొక్క మహదైశ్వర్యము నిరవధికమని వేరుగ చెప్పవలెనా ! అని భావము.

ఓం లబ్ధైశ్వర్యసమున్నత్యై నమః

(270) లబ్ధవృద్ధిః :—

(లబ్ధమగు వృద్ధికలది లబ్ధవృద్ధి) వృద్ధిఅనగ వ్యాప్తి - పరిపూర్ణత, అంతియే గాని అవయవముల వృద్ధిరూపమైనదని ఇక్కడర్థముకాదు: అట్లైయినయెడల అట్టిది కర్మములవలన కలుగునది అగుటచే వినాశ హేతుత్వము కలది యగును. స వా ఏష మహానజ ఆత్మా న వర్ధతే కర్మణా" (బృహ. ఉ. 6.4.2.) ఈ ఆత్మ కర్మములచే వృద్ధిచెందదు, అని శ్రుతివచనము. "నిష్క్రియం నిష్కళమ్" (శ్వే ఉ 6.19) ఇది క్రియారహితము అని శ్రుతిచే బ్రహ్మమునకు అవయవములు కలిగి

యుండుటయో నిషేధింపబడినది. కావున లబ్ధవృద్ధి అనగ లబ్ధమగు సర్వవ్యాపకత కలది అని అర్థము. ఈమె స్వస్వరూపమున నుండి ఈమె నాశ్రయించియున్నవియు, ఈమెవలన కలుగుచున్నవియు నగు ఉపాధులచే అభివ్యక్త అగుచున్నది: అంతియేగాని లేనిదానియందు ఆరోపింపబడుటలేదని నిష్కృష్టార్థము.

ఓం లబ్ధవృద్ధ్యై నమః

(271) లబ్ధలీలా ;—

(లబ్ధమగు లీలలు కలది) లీలలు అనగ అన్యప్రయోజనకరమగు వ్యాపారములు కావచ్చును: లేక తనయొక్క హర్షము వలన కలుగుచున్నవి కావచ్చును: లేక, తత్తతాలోచితమగు నవరసాంగీకారసమయమందవి ఉచితభంగివిశేషములు కావచ్చును. లబ్ధమగు లీలలు కలది లబ్ధలీల.

ఓం లబ్ధలీలాయై నమః

(272) లబ్ధయౌవనశాలినీ —

(ఈమెలబ్ధమగు యౌవనముచే ప్రకాశించుచున్నది) అస్తిత్వము, జననము, వృద్ధి — ఇట్టి భావవికారము కలిగిన అవస్థ బాల్యము; పరిణామము, అపక్షయము, నాశము - ఇవి కలిగిన ఉత్తరావస్థ - జర. దేహములేనందున, ఈరెండవస్థలు లేకుండ ఈమెయుండును. అనగ యౌవనమున నుండును. యౌతి-గచ్ఛతీతి యువా, అనగ దృఢ బలవీర్యములు కలవాడు; వానిభావము యౌవనము. ఈమెకు జరాబాల్యములు లేవు కావున ఏకస్వరూపత కలదు. యౌవనముకలది యౌవనశాలిని. "అజరోఽమృతోఽభయో బ్రహ్మ" (బృహ. ఉ. 6-4-25) బ్రహ్మము, అజరము అమృతము అభయము; అను శ్రుతిచే ఈమె సర్వదా ఏకప్రకారస్వరూపముకలది, అని అర్థము.

ఓం లబ్ధయౌవనశాలిన్యై నమః

లబ్ధాతిశయసర్వాంగసౌందర్యా లబ్ధవిభ్రమా
లబ్ధరాగా లబపతి ర్లబ్ధనానాగమస్థితిః ॥ 58

(273) లబ్ధాతిశయసర్వాంగసౌందర్యా :—

సర్వాంగములందు లబ్ధమైన సౌందర్యాతిశయము కలది) సుందరముగ రుచిరము. సుందరమైనదానియొక్క భావము సౌందర్యము. సర్వాంగములయొక్క అతిశయసౌందర్యము. అట్టిసౌందర్యము ఈమెచే లబ్ధమైనది: అనగ యథాశాస్త్రోక్తమగు అవయవవిన్యాసవిశేషము కలది సర్వమనోహరమగు మూర్తి నాందియున్నది' అని అర్థము. "న తస్య ప్రతిమాఽస్తి" (శ్వే ఉ. 4-13) ఈశ్వరునకు ఉపమానభూతమైనది లేదు, అని శ్రుతి

ఓం లబ్ధాతిశయసర్వాంగసౌందర్యాయై నమః :—

(274) లబ్ధవిభ్రమా :—

(లబ్ధమగు విభ్రమము కలది) విభ్రమమనగ బాలక్రీడ విభ్రమమును పొందినది కావున ఈమె లబ్ధవిభ్రమ. ఈమెయొక్క సర్వాత్మకత్వమును, సర్వకర్తృత్వము నుద్దేశించి ఈ నామము చెప్పబడినది.

ఓం లబ్ధవిభ్రమాయై నమః

(275) లబ్ధరాగా :—

(లబ్ధమగు రాగముకలది) సజాతీయముగు రాగమును అనగ కామమును ఈమె కలిగియున్నది "సోఽకామయత" (తై. ఉ. 2-6) అతడు అనేకముగ కావలెనని కోరెను. అను శ్రుతిచే జగత్తుయొక్క సృష్టి కామనాపూర్వకమని ప్రతిపాదింపబడినది. జగత్తును సృజింపవలెనను కోరిక ఈమెకు కలిగినది కావున లబ్ధరాగ.

ఓం లబ్ధరాగాయై నమః.

(276) లబ్ధపతిః :—

స్వేచ్ఛచే స్వయంవరమున లబ్ధమైన కామేశ్వరుడను పతికలది కావున లబ్ధపతి.

ఓం లబ్ధపతయే నమః

(277) లబ్ధనానాగమస్థితిః :—

(లబ్ధమగు అనేకములైన ఆగమములయొక్క స్థితికలది) ఆ + గమ— అంతటను, నానాప్రకారములగు కర్మోపాసనాజ్ఞానకాండలచేతను, వాని అంగముల

చేతను పార్థములను గమనమగునట్లు చేయునట్టివి, అనగ ప్రకాశింపచేయునట్టివి కావున ఆగమములు — అనగ వేదములు: అనేక శాఖలు కలిగి భిన్నములైన సామాదులు నానాశబ్దముచే చెప్పుచున్నవి; స్థితి అనగ పరిపాలనము; నానాగమముల యొక్క స్థితి ఈమెచే లబ్ధమైనది. లేక, నానాగమస్థితి అనగ వేదచతుష్టయము చెప్పిన మర్యాద, అది కర్మోపాసనాజ్ఞానకాండములందు చెప్పబడినది. అట్టి స్థితిని పరిపాలనములను ఈమె పొందినది. వేదములు స్వతః ప్రమాణములు; అనగవానికి ప్రమాణాంతరమక్కరలేదు. "సర్వే వేదా యత్రైకం భవంతి" సర్వవేదము లెవనియందు ఏకమగుచున్నవో అను శ్రుతిచే వేదములు బ్రహ్మస్వరూపములు. సంసారము (ప్రపంచము) అనాది కావున అట్టి వేదములను ఈమె మహాప్రళయము నందు సంరక్షించి సృష్ట్యాదియందు ఉద్భవించిన హిరణ్యగర్భునకు సంపూర్ణముగ ప్రతిభాసింపచేయును: తాను దంపతీరూపమును ధరించి వేదోక్తములగు ధర్మములను స్వయముగ తానసుష్ఠించి ఇతరులచే అనుష్ఠింపజేయును. "వేదశాస్త్రే మమైవాజ్ఞే వర్త ఏవ చ కర్మణి యద్యహం న వర్తేయం జాతు కర్మ ణ్యతంద్రితః ఉత్సీదేయు రిమే లోకా నకుర్యాం కర్మ చేదహమ్" (భగీ. 3_23,-1) వేదశాస్త్రములు నా ఆజ్ఞలు. నేను జాగరూకుడనై కర్మములందు ప్రవర్తింతును, నేనట్లు ప్రవర్తింప కుండిన ఈ లోకములన్నియు నశించును అని భగవద్వాక్యము.

ఓం లబ్ధనానాగమస్థిత్యై నమః

లబ్ధభోగా లబ్ధసుఖా లబ్ధహర్షాభిపూరితా
హ్రీంకారమూర్తి ర్హ్రీంకారసౌధశృంగకపోతికా॥ 54

(278) లబ్ధభోగా

(లబ్ధమగు భోగము కలది) భోగమనగ సుఖమనే అనుభవించుట. అట్టి సుఖానుభవము మాత్రమే ఈమె కలిగియున్నది. దుఃఖానుభవముకూడ కలదని చెప్పిన జీవుని ప్రసక్తికూడ కలుగును. కావున లబ్ధమగు భోగము అనగ సుఖానుభవమే) కలది, అని అర్థము. ఇష్టపదార్థమును అనుభవించినపిమ్మట జీవునకు క్రమ క్రమముగ సుఖము కలుగును: ఈమెకట్లు కలుగదు; ఈమె ఆనందస్వరూప, కావున సిద్ధస్వరూప. అందుచే ఈమెకు క్రమికమగు సుఖానుభవమే గాకుండ నిత్యమగు సుఖానుభవమే యుండును. (సుఖ) సాధనభూతమైనది గూడ ఈమె విషయములో సిద్ధమనియే చెప్పవలెను.

ఓం లబ్ధభోగాయై నమః

(279) లబ్దసుఖా —

లబ్ధమగు సుఖముకలది. అనుకూలత్వమున తెలియునదియు [1] స్వస్వరూపభూతమునగు సుఖము, సుఖసాధనముగు ధర్మము ఈమెచే లబ్ధములైనవి.

ఓం లబ్ధసుఖాయై నమః

(280) లబ్ధహర్షాభిపూరితా —

(లబ్ధమగు హర్షముచే అభిపూరిత) హర్షమనగ తృప్తివలన కలుగునట్టి చిత్తోల్లాసవిశేషము. ప్రసన్నముఖము శరీరపుష్టి కలిగినవానికి హర్షము కలదని ఊహింపవచ్చును, ఇదియే అభీష్టమైన పదార్థము ననుభవింపకలుగునట్టి సంతోషమని జగత్తునందు ప్రసిద్ధము అట్టి హర్షముచే ఈమె అభిపూరిత అభితః - అంతటను అన్యూనాతిరేకముగ (ఎక్కువతక్కువలు లేకుండ), అవిచ్ఛిన్నరూపమున పూరిత - అనగ నింపబడినది. ఈమెకు దుఃఖాదులు కలుగనందున హర్షమునకు మాత్రమే ఆశ్రయముగనుండి ఈమె నిత్య ప్రసన్నముఖి యగుచున్నది.

ఓం లబ్ధహర్షాభిపూరితాయై నమః

(1) అనుకూలతయా వేదనీయం సుఖం అని సుఖముయొక్క నిర్వచనము.

(281) హ్రీంకారమూర్తిః —

వాచ్యమునకు (చెప్పబడినదానికి అనగ అర్థమునకు) వాచకమునకు (చెప్పునట్టిదానికి అనగ శబ్దమునకు) అభేదసంబంధమున హ్రీంకారమును మూర్తిగ అనగ విగ్రహముగ కలది.

ఓం హ్రీంకారమూర్త్యై నమః

(282) హ్రీంకారసౌధశృంగకపోతికా :

(హ్రీంకారమను సౌధముయొక్క శృంగమున ఈమె కపోతిక (పావురము.) సుధా (సున్నము) మయమగునది సౌధము - అనగ సుధావికారమగు అట్టాలిక (ప్రాసాదము). సౌధశృంగమనగ సౌధశిఖరము — అనగ చంద్రశాలాదిభిత్తి (గోడ) యొక్క ఉపరిభాగము. నిరుపాధికమగు విశ్రాంతివలన కలుగునట్టి సుఖానుభవమునకు హ్రీంకారము హేతువు, అందుచే దీనికి సౌధముతో పోలిక చెప్పబడి

నది. (సౌధము విశ్రాంతిని కలుగజేసి సుఖమును కలుగజేయునట్లు హ్రీంకారము విశ్రాంతి సుఖములను కలుగజేయును.) హ్రీంకారమందలి హకారము శ్వేతవర్ణము. కావున దానికి ప్రాసాద సాదృశ్యము: రేఫము లోహితవర్ణము కావున ఇటుకలచే కట్టబడిన అధోభిత్తితో దానికి ఉపమానము: హకారముపైనగల ఈకారము పైనుం డుటచే దానికి శృంగారముతో ఉపమానము: దానిపైనున్న బిందువు సర్వప్రకృతిభూత మగు శబ్దార్థాత్మకమయ్యు అందొక అవయవముగ నుండుటచే విచిత్ర స్వరూపమై సూక్ష్మముగనుండి, గూటియందున్న అడుపావురమువలె జాగరూకమై ఉన్నది. కావున పరదేవతకు కపోతికతో ఈ అర్థమున ఉపమానము చెప్పబడింది.

ఓం హ్రీంకారసౌధశృంగకపోతికాయై నమః

హ్రీంకారదుగ్ధాబ్ధిసుధా హ్రీంకారకమలేందిరా
హ్రీంకారమణిదీపార్చిః హ్రీంకారతరుశారికా॥ 55

(233) హ్రీంకారదుగ్ధాబ్ధిసుధా ....

(హ్రీంకారమను పాలసముద్రమందు ఈమె సుధవంటిది) దోహము (పితుకుట) వలన కలుగునది దుగ్ధము. దోహమనగ గోస్తనగతమగు క్షీరమును తమకొరకై చేతితో పిండుట. దుగ్ధమగుట దోహనాదులన్నిటికిని (పాపీయములకు) ఉపలక్షణము కావున ఇట ప్రదీపాలంకారము సిద్ధమైనది 1 అనంతమగు (ఉద కము కలిగి మిగుల లోతుగనున్న ప్రదేశమును అబ్ధి. (సముద్రము) అందురు. అప్ (నీరు) దీనియందుండును కావున అబ్ధి. దుగ్ధాబ్ధి అనగ క్షీరసముద్రము, దీనియందు సంజీవకత్వమున్నది. శిశువులస్తన్యాదులదుం సంజీవము కలుగుచున్నదిగదా! అట్లే శ్వేతవర్ణమగు హకారముతో యుక్తమగుటచేతను అమృతహేతువగుటచేతను హ్రీంకారమునకు దుగ్ధాబ్ధి సాదృశ్యము చెప్పబడినది హ్రీంకారదుగ్ధాబ్ధియందు సుధ (అమృతము) ఉన్నట్లుండుటచే ఈమె సేవించు వారలందు నిత్యత్వము బహువిధ మహిమాశాలిత్వముండుట కానవచ్చుచున్నది.

ఓం హ్రీంకారదుగ్ధాబ్ధిసుధాయై నమః

(234) హ్రీంకారకమలేందిరా —

(హ్రీంకారమను కమలమునందు ఈమె ఇందిర - లక్ష్మి). హ్రీంకార బీజము విచిత్రవర్ణము కలది కావున పరమప్రీతివిషయమగుచున్నది, అందుచే హ్రీం

కారమున క్రమలముతో ఔపమ్యము చెప్పబడినది. హ్రీంకారముయొక్క వాచార్థము పరదేవత అగుటచేతను, సర్వపురుషార్థములను ఈమె కలుగజేయుటచేతను ఈమె హ్రీంకారముపైని లక్ష్మియున్నట్లుగ ఉన్నదని ఔపమ్యము చెప్పబడినది ఇందిరకు పద్మము ఆలయము కనుక ఈమె హ్రీంకారమును పద్మమునందు ఇందిర, అనగ తదధీనమగు బ్రహ్మవిద్య.

(1) ఒకశబ్దము దీపమువలె అనేకములగు అర్థములను భాసింపజేయుట ప్రకీపాలంకారము.

ఓం హ్రీంకారకమలేందిరాయై నమః

(285) హ్రీంకారమణిదీపార్చిః —

(ఈమె హ్రీంకారమను మణిదీపమందు అర్చిస్సు (వెలుగు). అధిదైవికమును (గాలి, వాన) మొదలుగాగల ఉపద్రవములచే ప్రమాదమునొందకుండ మణిదీపము చిరకాలము నిలచియుండును; కావున హ్రీంకారమునకు మణి దీపముతో సాదృశ్యము చెప్పబడినది ఈమె హ్రీంకారమణిదీపముయొక్క ప్రకాశము; అన్యసాధారణముకానట్టి మహాతిశయమును కలిగియుండుటచే ఈ ప్రకాశముయొక్క విలువ ఎక్కువని తెలియుచున్నది. ఈమెయే నిరవధికమగు మహాత్త్వమును కలిగిన హ్రీంకారముయొక్క వాచ్యార్థము; కావున హ్రీంకారోపాసకులకు ఈమె ప్రకాశమగుచున్నది; అనగ హ్రీంకారము నుపాసించిన వారికి నిరంతరమగు తమస్సు తొలగి ఇష్టపదార్థము లభ్యమై సుఖము కలుగునని ఫలితార్థము.

ఓం హ్రీంకారమణిదీపార్చిషే నమః

(286) హ్రీంకారతరుశారికా —

(హ్రీంకారమను వృక్షమునందు ఈమె శారిక (చిలుక) తరువనగ తరింపజేయునట్టిది: అనగ ఫలార్థులై తనపై కెక్కినవారిని (కొమ్మలు మొదలైన వానిచే పడకుండ రక్షించును కావున తరువు. తరువుపై ఈమె శారిక - ఎఱ్ఱని కాళ్ళు కలిగిన ఆడచిలుక. చిలుక అభ్యాసాతిశయముచే మనుష్యభాషయందును కూడ మాట్లాడును: భూతభవిష్యద్వర్తమానమగు లోకయాత్రను తెలుసుకొని స్వభాషలో శుభాశుభప్రాప్తిని మనకు తెలియజేయును హ్రీంకారబీజమునకు పరదేవతయే వాచ్యార్థమగుటచే ఈమె హ్రీంకారసంబంధిని యగుచు వేదవాక్కుచే సర్వమును ప్రకాశింపచేయుచున్నదని అర్థము.

ఓం హ్రీంకారతరుశారికాయై నమః

హ్రీంకారపేటకమణి ర్హ్రీంకారదర్శబింబితా
హ్రీంకారకోశాసిలతా హ్రీంకారస్థానర్తకీ ॥ 56

(287) హ్రీంకారపేటకమణిః —

(హ్రీంకారమను పేటిక (పెట్టె) యందు ఈమె మణి) గూహనసాధనముగ (దాచుకొనుటకు వీలగు సాధనముగ) హ్రీంకారము పేటికతో దృష్టాంతీకరింపబడినది. వజ్రములు మొదలైనవానిని పేటికయందు దాచినను అవి బాహ్యాంతరములను ప్రకాశింపజేయుచు ఇతరపేటికలకంటె విలక్షణముగ కనబడునట్లు చేయును అట్లే హ్రీంకారబీజము తనయొక్క వాచకత్వముచే ఇతరబీజములకంటె విశిష్టమైనదని నితతిశయ మహిమనే వానికంటె భిన్నమని తెలియుచున్నది.

ఓం హ్రీంకారపేటకమణయే నమః

(288) హ్రీంకారదర్శబింబితా —

(హ్రీంకారమను ఆదర్శ (అద్ద) మందు ఈమె ప్రతిబింబిత) ఇతర ప్రమాణాపేక్ష లేనట్టి వేదమందు హ్రీంకార మంత్రరత్నము; అందుచే నిర్దుష్టము కావున ఆదర్శసామ్యము చెప్పబడినది. హ్రీంకారాదర్శమందు ఈమె ప్రతిబింబిత. మాయయందు ప్రతిబింబించిన చైతన్యమునకే జగత్కారణత్వము చెప్పినందున, దర్పణమందు ముఖమువలె, ఈమె హ్రీంకారాదర్శమందు ప్రతిఫలించుచున్నది అని తాత్పర్యము.

ఓం హ్రీంకారాదర్శబింబితాయై నమః

(289) హ్రీంకారకోశాసిలతా —

(హ్రీంకారమను కోశమునందు ఈమె అసిలత అనగ ఖడ్గధార). హ్రీంకారమే కోశము, దానియందు ఈమె అసిలత; అతిదీర్ఘ ఖడ్గమని అర్థము. సర్వవిరోధులవలన కలుగు దుఃఖములు ఖడ్గధారచే నివర్తింపబడుచున్నవి: అట్లే పరదేవతచే దుఃఖములు నివర్తింపబడును ఖడ్గమును బయటనుంచకూడదు, ఒరయందుంచవలెను. అట్లే వాచకశబ్దమగు హ్రీంకారమును కోశము, తనయందు అర్థరూపముననున్న పరదేవతను అచ్ఛాదించియుండుటచే దానికి అసికోశముతో సమానత్వము చెప్పబడినది. ఈమె హ్రీంకారకోశమునందు ఖడ్గమువలెనుండి దుఃఖనివా

రణశక్తి కలిగియుండి, భక్తులకు అభయము నిచ్చుచున్నది. 'అసి' అను పదము (వజ్రము మొదలగు) సర్వాయుధములకు ఉపలక్షణముగ ప్రయోగింపబడినది. "మహ ద్భయం వజ్రముద్యతమ్" (కఠ. ఉ 1-2) జగత్కారణమగు ఈశ్వరుని వలన భయముచే చంద్రసూర్యాదులు ప్రవర్తించుచున్నారు. అతడు ఉద్యతమగు వజ్రముకలవాడు భీషాఽస్మాద్వాతః పవతే" (తై ఉ. 2-8) వీనిభయమువలన వాయువు వీచుచుండును అని శ్రుతులు.

ఓం హ్రీంకారకోశాసిలతాయై నమః

[290] హ్రీంకారాస్థాననర్తకీ ;—

(హ్రీంకారమను ఆస్థానమందు ఈమె నర్తకి) ఆస్థానమనగ సభా మండపము. హ్రీంకారమను ఆస్థానము – హ్రీంకారాస్థానము. అందు ఈమె నర్తకి నర్తనమనగ నటనసంబంధమును, తాళానుసారియునగు హస్త్యాద్యంగ చేష్టనము. ఈమె అట్టి నర్తనము చేయునట్టి నర్తకి; ఈమె హ్రీంకారమునకు వాచ్యార్థము; మాయ మొదలైనవాని సంబంధము కలుగుటచేత ఈమె విచిత్రతరకార్యోత్పాదన వ్యాపారముకలిగిన స్వరూప వికారములనొందును; మాయాదిసంబంధము లేనప్పుడు అవికారిన్వస్వరూపము కలిగియుండును; (నర్తనము) చూచువారల మనోవృత్తిభేదముచే వారిలో కొందరకు తీవ్రము, కొందరకు మందము, కొందరకు మందతరమగు ప్రీతి కలుగును; అట్టి ప్రీతిరూపమగు భక్తికి ఈమె విషయమై కొందరకు స్వాభీష్టములకు కలుగజేయును, కొందరకు కలుగజేయదు; ఈవిధముగ వారివారి పుణ్యతారతమ్యము ననుసరించి వారివారి బుద్ధిశుద్ధిభేదము ననుసరించి ఈమె వారికి ప్రతిభాసించును. ఈ కారణములచే ఈమె హ్రీంకారమందు నర్తకి యని చెప్పబడినది.

ఓం హ్రీంకారాస్థాననర్తక్యై నమః

హ్రీంకారశుక్తికాముక్తామణి ర్హ్రీంకారబోధితా
హ్రీంకారమయసౌవర్ణస్తంభవిద్రుమపుత్రికా ॥ 57

[291] హ్రీంకారశుక్తికాముక్తామణిః —

హ్రీంకారమను శుక్తికయందు ఈమె ముక్తామణి - ముత్యము. హ్రీంకారమే శుక్తిక - ముత్యపుచిప్ప - వెనుకవైపున స్త్రీలవర్ణముగనుండి త్రికోణాకా

రమై యుండునది శుక్తిక. దీనియందు ఈమె ముక్తిక (ముత్యము)వలె అనగ ముక్తాఫలమువలె అభివ్యక్తమగును. మేఘసంఘమునుండి సర్వప్రదేశములందు స్వాతీనక్షత్రమున జలబిందువులు పడును; కాని అవి కొన్ని సముద్రవిశేషము లందు శుక్తి కలందుపడి ముక్తాకారమున పరిణమించును. అట్లే చైతన్యము సర్వ గతమైనను సత్త్వరజస్తమోగుణాత్మక హ్రీంబీజమునందు మనోహరమును, వాచా మగోచరమగు సుందరతరపరదేవతాకారమున విశేషముగ అభివ్యక్తమగును. మౌక్తి కములను కోరువారికి శుక్తికాగ్రహణమెట్లు అవశ్యకమో అట్లే పరదేవతా సాక్షాత్కా రమును కోరువారికి హ్రీంకారగ్రహణ మావశ్యకమని భావము.

ఓం హ్రీంకారశుక్తికాముక్తామణియే నమః

(292) హ్రీంకారబోధితా :—

(హ్రీంకారముచే ఈమె బోధింపబడినది) ఒక పదార్థము (సాధ్యముకా కుండ) సిద్ధమైయున్నప్పుడు దానియందు ఇంద్రియాది సంబంధము కలిగినపుడు వెం టనే స్వతః జ్ఞానోత్పత్తి కలుగుచున్నది. అట్టి జ్ఞానము కలుగుటయందు ఒక క్రియ చేయుట దానికి ఫలముకలుగుట అనునవి లేవు, గావున జ్ఞానవిషయమున విధి అపేక్షింపబడలేదు 1 నిత్యత్వాపరోక్షత్వాది ధర్మములు కలిగిన జ్ఞానము (బ్రహ్మము) వలె నున్నట్టిదియే, అనగ శుద్ధబ్రహ్మముకంటె అభిన్నమైనదియే, వేదములో నొకభాగమగు హ్రీంకారముచే బోధింపబడుచున్నది. అజ్ఞాతమైనదానిని తెలియజేయునట్టి వేదమునకు స్వతః ప్రామాణ్య మంగీకరింపబడినది: తెలియబడ మన్న పరచైతన్యము పరమానందరూపమగుటయే దానికి పురుషార్థరూపత్వమున్నది: కావున వేదములో నొకభాగమును, మూలామంత్రాత్మకమునగు హ్రీంకారముచే ఈమె బోధిత అనగ జ్ఞాపకమొనరింపబడుచున్నది. (హ్రీంకారములోని) హకార రేఫ ఈకారములు విడిగానున్నప్పుడు భిన్నములగు అర్థములు కలది. అవి మిళిత

(1) బ్రహ్మము సిద్ధమగు పదార్థము. అదియే జ్ఞానము. కేవల జ్ఞానరూప మగు బ్రహ్మము యొక్క విషయమున విధి ఉండదు. యజ్ఞయాగాదుల వలె ఒకక్రియయు దానికి ఫలము కలుగుటయు ఉండునపుడు వేదము విధిరూపయిన ఉండును. బ్రహ్మప్రతిపాదకమగు వేదభాగము కేవలము సిద్ధవస్తు ప్రతిపాదకమే, ధివినిషేధాది రూపము కాదు.

ములై హ్రీంకారరూపమున పరిణమించినపుడు సచ్చిదానందస్వరూప అగు శ్రీ త్రిపురసుందరీ రూపమున భాసించును; అనగ తద్వర్ధమగు అద్వైత స్వరూపమున భాసించును. "నాఽన్యోఽతోఽస్తి ద్రష్టా" (బృహ. ఉ. 4- -8) ఇదియంతయు ఆ ఆత్మయే: "ఏక ఏక తు భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః, ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్" (అమృతబిందు ఉ 12) ఒకే భూతాత్మ అన్నిభూతములందు, జలమున చంద్రునివలె ఏకరూపమున బహురూపమున ప్రకాశించును — అని శ్రుతులు. "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" [బృహ ఉ. [4-4-5] ఆత్మమే ద్రష్టవ్యము; "తద్విజిజ్ఞాసస్వ" తై. ఉ. 3-1) దానినే తెలిసికొనుము, "ఆత్మానం పశ్యేత్" ఆత్మను చూడవలెను"—ఈ శ్రుతులందున్న లిఙ్ లోట్ తవ్య ప్రత్యయములు విధిత్వ ప్రతిపాదకములు కావున అవి కేవలము అర్థవాదార్థకములు, కావున బ్రహ్మవిషయములో విధిత్వయిలేదు, అని సిద్ధాంతము.

ఓం హ్రీంకారబోధితాయై నమః

(293) హ్రీంకారమయసౌవర్ణస్తంభవిద్రుమ పుత్రికా —

(హ్రీంకారమయమగు సౌవర్ణస్తంభమందు ఈమె పగడపుబొమ్మ)
పింగళవర్ణమగు పృథ్వీరేణువు సువర్ణము. సువర్ణము పార్థివమని 1 చెప్పుటకు కారణములేమనగ : అగ్ని మొదలగు నిమిత్తములచే (కరగించినపుడు) విచ్ఛేద రహితమగు ద్రవత్వము సువర్ణము నందున్నప్పటికి దీపకాంతి మొదలగు అన్యతేజః స్వరూపములందు సువర్ణము లేకుండగనే తేజస్సు కలుగుచున్నది. సువర్ణమునకు మరియొక పదార్థమును జేర్చినపుడు, అత్యధికముగ అగ్నితప్తమైనపుడు, అది రజతాదులవలె భస్మమగుచున్నది; వజ్రము మొదలగువానికి లోహముతో పూతపూయుటకు వీలులేనప్పటికిని అవి ప్రార్థివములని అంగీకరింపబడినవి, అట్లే సువర్ణము ప్రార్థివమగుటకు బాధ ఏమియులేదు. సువర్ణము అగ్నితప్తమైనపుడు ద్రవత్వమొందుట దానిని తైజసమని చెప్పుటకు కారణముకాదు. ఏలన ద్రవత్వము ఉదక స్వభావము. ఉదకమునుండి పృథివి కలిగినదని శ్రుతి 2: కావున ఉదకకార్యమగు పృథివియందు ఉదకముయొక్క గుణమగు ద్రవత్వము ఉపలబ్ధమైనది: అందుచే సువర్ణము పార్థివమే, (తైజసముకాదు). సువర్ణముయొక్క వికారము సౌవర్ణము. సౌవరమగు స్తంభము సౌవర్ణస్తంభము. సౌవర్ణస్తంభము నవరత్నమండపభారమును వహింపుచు మండపముకంటె అభిన్నముగ నుండి, దానికి అలంకారభూతమై యుండును: అట్టి సాధర్మ్యమున హ్రీంకారము జగదాశ్రయమై జగత్తునకు కార

ణమై అందు అంతర్భూతమైయున్నను పరమానందజనకత్వము కలిగియుండుటచే హ్రీంకారమయమని, అభేదోపచారమున ప్రతీపాలంకార ద్యోతనార్థమై 3 చెప్ప బడినది: హ్రీంకారము ఉపమేయమగు చుండగ మయశబ్దముచే ఉపమానముకంటె అభిన్నమగు కల్పనము చేయబడినది విచిత్రమగు హ్రీంకారమయ సౌవర్ణస్తంభ ముతో సంబంధముకలిగి, దానియందు ఈమె విద్రుమపుత్రికవలె నున్నది. విద్రు మము - ప్రవాళము, ప్రవాళముతో చేయబడిన పుత్రిక - సాలభంజిక ఆటబొమ్మ) సౌవర్ణస్తంభశబ్దము భిత్తి (గోడ) మొదలైన వానికి ఉపలక్షణము. అనేక తావు లందు కనబడు పుత్రికలు (బొమ్మలు) ఈ స్తంభమందున్నవని చెప్పుటచే స్వతః మనోజ్ఞమగు స్తంభమునకు అతిశయదర్శనీయత్వము చెప్పబడినది. దుర్లభతరమగు ప్రవాళపుత్రిక స్తంభమండపమును తత్స్వామిని, ఆ ప్రదేశమును అధికముగ భాసింప చేయునట్లు శ్రీ పరదేవతకూడ రూఢిచే, హ్రీంకారబీజార్థత్వమున, హ్రీంకారబీజా విచ్ఛిన్నమై హ్రీంకారము ఆదియందుకలవాని నన్నిటిని అలంకరించును, అనగ సఫలీకరింపచేయును.

ఓం హ్రీంకారమయసౌవర్ణస్తంభవిద్రుమపుత్రికాయై నమః

(1) సువర్ణము తేజస్సంబంధి అని తార్కికుల మతము. కాని వేదాంతుల మతమందు సువర్ణము పార్థివమే (పృథివికి సంబంధించినది). ఇక్కడ తార్కికమతము ఖండింపబడుచున్నది.

(2) ఆత్మన ఆకాశ స్సంభూతః, ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః అద్భ్యః పృథివీః ఆత్మనుండి ఆకాశము, ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలము జలమునుండి పృథివి సృజింప బడినవని భూతసృష్టి (తైత్తిరీయ) శ్రుతియందున్నది.

(3) ఉపమానమును ఉపమేయముతో పోల్చుట ప్రతీపాలంకారము. లోచన ముతో పద్మమునుపమించుట ప్రతీపము. పద్మముతో లోచనమును పోల్చుట ఉపమానము.

హ్రీంకారవేదోపనిష ద్ధ్రీంకారధ్వరదక్షిణా
హ్రీంకార నందనారామ నవకల్పకవల్లరీ ॥ 58

(294) హ్రీంకారవేదోపనిషత్ :—

(హ్రీంకారమును వేదమునకు ఈమె ఉపనిషత్తువంటిది) దీనిచేత సర్వ

పదార్థములు విదితములగుచున్నవి కావున వేదము - వేదజాతిని తెలియజేయునట్టి ఏకవచనము 1. హ్రీంకారమే వేదము - హ్రీంకారవేదము. వేదసామాన్యధర్మమగు అజ్ఞాతజ్ఞాపకత్వము ఇందుకలదు కావున హ్రీంకారము వేదమని చెప్పబడినది. హ్రీంకారవేదముయొక్క ఉపనిషత్ — అనగ వేదాంతభాగము లేక లక్ష్యార్థము "తద్బ్రహ్మోపనిషత్ పరమ్" (శ్వే. ఉ, 1-16) బ్రహ్మము ఉపనిషత్పరము 2 అని శ్రుతి. వేదములు నాలుగైనను కర్మ, ఉపాసనా, జ్ఞానకాండలను భేదములచే త్రిప్రకారములు. "త మేవం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి" (బృహ. ఉ. 6-4—22) బ్రాహ్మణులు (బ్రహ్మవేత్తలు) వేదమననుసరించి (స్వాధ్యాయముచే) ఔపనిషదుడగు పురుషుని తెలియగోరుదురు: అను శ్రుతివాక్యములచే కర్మోపాసనలకు జ్ఞానసాధనములుగ వినియోగము చెప్పబడినది. "అంధం తమః ప్రవిశంతి యేఽ విద్యా ముపాసతే, తతో భూయ ఇవ తేతమో య ఉ విద్యాయాం రతాః" (ఈశ. ఉ. 9) అవిద్యను (కేవలకర్మములను) ఉపాసించువారు అంధమగు తమస్సునందు పడుదురు. (కర్మములను విడచి) కేవలము విద్యనుపాసించువారు అంతకంటెఎక్కువైన తమస్సునందు పడుదురు: అను శ్రుతిచే కర్మోపాసనలు రెండును సంసారమును కలిగించునట్టివే, కావున నింద్యములు. "ఆత్మానం చే ద్విజానీయాద్ అయ మస్మీతి పూరుషః కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్" (బృహ ఉ. 6-4-12) నేను శుద్ధబుద్ధముక్తస్వభావుడగు పురుషుడను అని ఆత్మనెరిగినవాడు ఎట్టి కోరికచే ఎవరి కామమునకై శరీరము ననుసరించి తాపమొందును? "ఆప్తకామః ఆత్మకామః" (బృహ ఉ. 6-4-6) కామములు లేకుండ ఆత్మకాముడై - ఆప్తకాముడైన వానియొక్క ప్రాణములు ఉత్క్రమింపవు: అతడు బ్రహ్మమై బ్రహ్మమునుచేరును. ఇత్యాది శ్రుతివాక్యములచే అద్వైతజ్ఞానమును కలుగించునట్టి వేదైకదేశమగు ఉపనిషత్తులకు మోక్షము ఫలమని ప్రతిపాదింపబడినది; కావున కర్మోపాసనలను ప్రతిపాదించు వేదభాగములకంటె జ్ఞానమును ప్రతిపాదించు వేద (ఉపనిషద్) భాగము శ్రేష్ఠము. లోకమునందు సాధనములకంటె ఫలమెక్కువ శ్రేష్ఠము. కావున దానికి ఉత్తమత్వప్రసిద్ధి యున్నది. కర్మోపాసనాకాండద్వయము జన్యము అప్రధానమగుటచే వీనిని ప్రతిపాదించు వేదభాగమునకు ఉపనిచ్ఛేషత్వము కలుగుచున్నది3 ఈ రీతిగనే ఇక్కడ హ్రీంకారము పరదేవతాప్రకాశసాధనము.

(1) వేదములు నాలుగైనను వేదమని ఏకవచనమున జాత్యైకవచనమున వ్యవహారము కలదు.

(2) బ్రహ్మము ఉపనిషదేకవేద్యము అని గాని బ్రహ్మమే ఉపనిషత్తు, పరమమైనది అనిగాని అర్థము చెప్పవచ్చును.

(3) ఉపనిషద్ భాగము ప్రధానమైనది. తదితర వేదభాగములువీని దృష్ట్యా అప్రధానములు, అనగ ఉపనిషచ్ఛేషత్వము (ఉపనిషత్తులకు అంగమన బడుట) తదితరభాగములకు కలుగుచున్నది. అనగ కర్మోపాసనలు చెప్పునట్టి వేదభాగమునకు ఉపనిషత్తులకు అంగాంగి భావమున్నది.

(హ్రీంకారోపాసనాఫలము పరదేవతా సాక్షాత్కారము.) కావున కర్మోపాసనాకాండ ద్వయప్రతిపాదక వేదభాగమువలె హ్రీంకారమున్నది, అట్టి హ్రీంకారమునకు ఈమె ఉపనిషత్తువంటిది. అనగ ఈమె ప్రధానమని తెలియుచున్నది. వేదాంతములందు ఉపనిషచ్ఛబ్దము, దానివలన కలుగుచున్న శక్యసంబంధమున (లక్షణచే) ప్రవర్తించుచున్నది: ముఖ్యవృత్తిచే బ్రహ్మవిద్యయందె ప్రవర్తించును. అదెట్లనగ :— ఉపశబ్దము సమీపదేశార్థనము: బ్రహ్మమునందు ఆరోపింపబడిన మాయకు సమీప దేశమున నుండునది, అనగ అందు ప్రతిబింబించిన అవిద్యోపాధిక చైతన్యరూపు డగు జీవుడు ఉపశబ్దమునకు లక్షణచే అర్థము ప్రతిపాదింపబడినది. "ని" శబ్దము "షద్" అను పదమునకు విశేషణము: "షద్" అనునది సదన, గతి, అవసాన ములు అర్థముగ కలిగియున్నది. "ఉప" అను శబ్దముచే చెప్పబడు జీవుడు అవిద్యను పోనాడి బ్రహ్మస్వరూపమున "నిషీదతి" వర్తించును - కావున ఉపని షద్ అను శబ్దము కలిగినది. లేక, ఉపశబ్దవాచ్యుడను జీవుడు బ్రహ్మాన్వయత్వ మున "నిగచ్ఛతి" తనను తెలుసుకొనుచున్నాడు. లేక జీవుడు బ్రహ్మస్వరూపమున "అవసీదతి" పరిసమాప్తి నొందుచున్నాడు: అని మూడవ అర్థము ఇట్లు ఉపనిషచ్ఛబ్దము బ్రహ్మవిద్యావాచకముగ ప్రసిద్ధము: అట్టి బ్రహ్మము తెలియజేయు నట్టి వేదభాగమునకు కూడ లక్షణవశ్యమున ఉపనిషత్పదప్రయోగము కలదు, హ్రీంకారవేదమునకు ఈమె ఉపనిషత్, అనగ ప్రధానభూతమైన బ్రహ్మవిద్య అని అర్థము.

ఓం హ్రీంకారవేదోపనిషదే నమః

(297) హ్రీంకారాధ్వరదక్షిణా :—

(హ్రీంకారమను అధ్వరమునందు ఈమె దక్షిణ వంటిది) హ్రీంకారమే అధ్వరము అనగ యజ్ఞము. హ్రీంకారాధ్వరముయొక్క దక్షిణ - అనగ సమాప్తి సాధనము. దక్షిణనిచ్చినపుడు యజ్ఞము సమాప్తమగుచున్నది. హ్రీంకారమును

జపించుబకూడ యజ్ఞమువంటిదే. అధ్వానం రాతి - గచ్ఛతి - అనగ దారిని చూపు నట్టిది అధ్వరము - అనగ మార్గసాధకమని అర్థము. ఋత్విక్కులకు దక్షిణ అను ఫలము కలుగును. కావున దక్షిణా" అను పదము ఫలవాచకము హ్రీంకారా ధ్వరమునందు అనగ హ్రీంకారయజ్ఞమునందు ఈమె దక్షిణ అనగ ఫలసాధనమగు పురుషార్థరూపమైనది అని అర్థము. లేక, దక్షిణ అనగ పత్ని అని అర్థము. హ్రీం కారాధ్వరమునకు పత్ని "మఖస్య దక్షిణా పత్నీ" యజ్ఞమునకు పత్ని దక్షిణఅగును అని వచనమున్నది. "జ్ఞానయజ్ఞేన తేనాఽహ మిష్టః స్యామితి మే పతిః" (భ గీ. 18-70) జ్ఞానయజ్ఞముతో గీతాధ్యయనము తుల్యమైనది అట్టి అధ్యయనముచే నేను పూజితుడను" అని భగవద్వాక్యము. హ్రీంకారముయొక్క లక్ష్యార్థము జ్ఞానమే; కావున హ్రీంకారధ్వరముగ హ్రీంకారజ్ఞానయజ్ఞము. "ప్రధానం దక్షిణా మఖే" యజ్ఞమందు ప్రధానమైనది దక్షిణ అను వచనమువలన దక్షిణవలె ఫలభూదిమగుటచే ఈమెయే ప్రధానమైనదనికూడ అర్థము చెప్పవచ్చును. దేవతనుద్దేశించి (యజ్ఞ) ద్రవ్యత్యాగ మొనరించుట యాగమనబడును. త్యక్తమగు ద్రవ్యము॥ అగ్నియం దుంచుట హోమము: ఋత్విక్కు నుద్దేశించి వేదికయందు ధనమిచ్చుట దక్షిణ: వేదిక వెలుపల అర్థులకు ధనమిచ్చుట దానము అని విభాగము.

ఓం హ్రీంకారాధ్వరదక్షిణాయై నమః

(1) సద్ అను ధాతువు పైనచెప్పినట్లు సదన గతి అవసానములు అను అర్థ ములు కలది. ఈ మూడు అర్థములు ఇక్కడ చెప్పబడినవి.

(296) హ్రీంకారనందనారామనవకల్పక వల్లరీ :—

(హ్రీంకారనందనవనమందు ఈమె నవకల్పక వల్లరి). నందింపజేయు నట్టిది అనగ ఆనందింపజేయునట్టిది కనుక నందనము. నందనమగు ఆరామము - నందనారామము. అనగ విచిత్రస్వరూపతచేతను విజాతీయార్థకతచేతను దేవేంద్రో ద్యానమని అర్థము. సుఖమును కలుగజేయునట్టి మిశ్రామభూమి అగుటవలన హ్రీం రమే నందనారామము. నవమనగ నూతనము, అతికోమలమని అర్థము. కల్పించు నట్టిది కల్పక: కల్పకమగువల్లరి (తీగె) కల్పవల్లరి. హ్రీంకారనందనారామ మందు ఈమె కల్పకవల్లరి. దేవోద్యానమందున్న వృక్షగుల్మలతాతృణాదులు ఈలో కము వానికంటె అధికమగు పుష్పఫలాదులను కలిగియున్నప్పటికి వానికి సర్వోత్కృ ష్టత్వ ప్రసిద్ధిలేదు. తదుపాసకులకు, వారివారి సేవనుబట్టి వారివారి కర్మమును

బట్టి. సర్వార్థములనిచ్చు శక్తి గలిగియుండుటచే కల్పవల్లికి మాత్రము సర్వోత్కృష్టత్వము చెప్పబడినది. బ్రహ్మవిష్ణు రుద్రాదుల వర్ణభేదములు [1] అన్యోన్య సంబంధముకల్గి ఒకచోట (హ్రీంకారమున) కనబడుచున్నందునను: చిరంజీవత్వఫలాది ప్రదానముచే జనులకు ఆనందము కలుగించుచున్నందునను, సంసారతాపమును ఉపశమింపచేయునట్టి ధగుటచేతను హ్రీంకారమునకు నందానారామముతో ఉపమానము చెప్పబడినది అందు ఈమె నవకల్పకవల్లరి. సర్వార్థములనిచ్చు నట్టిదగుటచేతను, కామేశ్వరాలిగింత కోమలతగమూర్తిని కలిగియుండుటచేతను, విశిష్టములగు పురుషార్థములను కలిగియున్నట్టిదగుటచేతను సగుణ నిర్గుణోపాసకులకు ఆయాదేవతా రూపములో ప్రకాశించుటచేతను, ప్రాధాన్యమున సమిష్టిరూపత్వము కలిగినదగుట చేతను ఈమెకు కల్పకవల్లరీ సాదృశ్యము చెప్పబడినది.

ఓం హ్రీంకారనందనారామ నవకల్పకవల్లర్యై నమః

హ్రీంకారహిమవద్గంగా హ్రీంకారార్ణవకౌస్తుభా
హ్రీంకారమంత్రసర్వస్వా హ్రీంకారపరసౌఖ్యదా ॥ 57

(297) హ్రీంకారహిమవద్గంగా ;—

(హ్రీంకారమను హిమవంతునియందు ఈమె గంగ) హిమములు కలవాడు హిమవంతుడు, అనగ శీతలపర్వతరాజు. అమృతాదులకు సాధకమగుట వలన హ్రీంకారమునకు శీతలత్వము చెప్పబడినదని తెలుసుకొనవలెను. హ్రీంకార హిమవంతునుండి గంగవలె పావనియగుచు సర్వపురుషార్థములనిచ్చుచు మంత్ర దేవతారూపమున ఈమె అభివ్యక్త అగునని అర్థము.

ఓం హ్రీంకారహిమవద్గంగాయై నమః

(1) శుక్లవర్ణము సత్త్వగుణమును, రక్తవర్ణము రజోగుణమును, కార్ష్ణ్యము తమోగుణమును, సూచించును, రుద్రునియొక్క మూర్తి కృష్ణము, బ్రహ్మయొక్కమూర్తి రక్తవర్ణము. రుద్రునకులోపల సత్త్వగుణము బయట తపస్సు: సంహారార్థము ఇతడు తమోగుణము నవలంబించెను విష్ణువునకు లోపల తమస్సు బయట సత్త్వము. ఇతడు పరిపాలనార్థము బాహ్యమున సత్త్వగుణము నవలంబించెను. బ్రహ్మకు లోపల వెలుపల కూడ రజోగుణమే-సత్త్వగుణముకలిగిన రుద్రవిష్ణువులను లోకపూజ్యత కలుగుచున్నది. బ్రహ్మకు సత్త్వగుణము లేనందున వారితోపాటు పూజ

నొందుటలేదు: అవిద్యచే జీవులలో భేద మేర్పడినట్లు మాయచే ఈశ్వ రులలో భేదమేర్పడుచున్నది ముక్తినపేక్షించువారు అంత స్సత్త్వ గుణోపేతుడగు రుద్రుని భజింపవలెను అని సూతసంహిత. "ఈశ్వాది కోరుద్రోమహర్షిః" అని శ్రుతి.

(298) హ్రీంకారార్ణవకౌస్తుభా —

(హ్రీంకారమను సముద్రమునందు ఈమె కౌస్తుభము). క్షీరాబ్ధియందు పుట్టిన చతుర్దశ రత్నములందు సర్వాధిక ప్రకాశము కలిగియుండుటచే కౌస్తుభము శ్రేష్ఠము: అట్లే పరదేవతకూడ అపారమహిమలు కలిగిన హ్రీంకారముచే తెలియ బడు , దానిచే నిష్పన్న అగుచు, స్వయంప్రకాశత్వమున ప్రకాశించుచున్నదని అర్థము. "అత్రాఽయం పురుషః స్వయంజ్యోతిః" (బృహ 6.3.9), ఆ సమయ మున, స్వప్నావస్థయందు, ఆ పురుషుడు స్వయంజ్యోతియై యుండును అని శ్రుతి. కౌస్తుభయను వక్షస్సునందుగల విష్ణువునకు లక్ష్మీపతిత్వ - సకలసుందరమత్వాది గుణయులన్నట్లు, హ్రీంకారార్ణవమందు ప్రకాశించు హ్రీంకారదేవత నుపాసించు వానికికూడ నారాయణాఽభేదమున శ్రీకాంతత్వాది ధర్మములు స్వతఃసిద్ధయ లగునని కౌస్తుభ పదప్రయోగయచే ధ్వనితమగుచున్నదని గమనింపవలెను.

ఓం హ్రీంకారార్ణవకౌస్తుభాయై నమః

(299) హ్రీంకారమంత్ర సర్వస్వా ;-

(ఈమె హ్రీంకార మంత్రముయొక్క సర్వస్వము సర్వములగు స్వములు -(అనగ ధనములు) సర్వస్వములు - అనగ అణిమాద్యై శ్వర్య జనక ములు. హ్రీంకార ఘటితమగు మంత్రముయొక్క సర్వస్వము - హ్రీంకారమంత్ర సర్వస్వము అనగ సకలసంపద, సకలాధకసాధకశక్తి అని అర్థము.

ఓం హ్రీంకారమంత్ర సర్వస్వాయై నమః

(300) హ్రీంకార పరసౌఖ్యదా -

(హ్రీంకార జపపరులకు ఈమె సౌఖ్యమునిచ్చునట్టిది) హ్రీంకారపరు లనగ హ్రీంకారజపపరులు: లేక, హ్రీంకారఘటితమగు శ్రీవిద్యా జపపరులు. వారికి సౌఖ్యయను అనగ చతుర్విధ పురుషార్థప్రాప్తి వలన కలుగున ఆనందమును ఇచ్చునట్టిది. లేక, హ్రీంకారములయొక్క అనగ వ్యష్టిరూపము వాచ్యములగు త్రిమూర్తులయొక్క పరమమగు సౌఖ్యమును అనగ సామరస్య సుఖమును, అనగ ఏకీభావరూపమను ఆనందము నిచ్చునట్టిది కనుక హ్రీంకార పరసౌఖ్యద యత్రనాన్య త్పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్య ద్విజానాతి స భూమా । యత్రాన్య త్పశ్య న్యన్య

చ్ఛృణో త్యన్య ద్విజానాతి తదల్పమ్' నాఽల్పే సుఖ మస్తి (ఛా. ఉ. 7.24 1) దేవియందున్నప్పుడు అన్య మగునది గోచరింపదా, వినబడదో, తెలియబడదో అట్టిది భూమపదార్థము: దేవియందున్నపుడు అన్యమగునది గోచరించునో, వినబడునో, తెలియునో అది అల్పమైనది దానియందు సుఖములేదు:' "ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన" (తై. 2.4 1) బ్రహ్మయ యొక్క ఆనందము నెరి గినవానికి దేనివలనను భయముండదు. "యదా హ్యేవైష ఏతస్మిన్న దృశ్యే ఽనా త్మ్యే ఽనిరుక్తే ఽనిలయనే ఽభయం ప్రతిష్ఠాం విందతే అథసోఽభయం గతో భవతి (తై. ఉ. 1.7) అదృశ్యుడు, లింగశరీరము లేనివాడు, శబ్దములచే నిర్వచింప బడనివాడు, మాయాధీనుడు, అభయమునగుస్థితిని పొందినవాడు అభయమొందును. విజ్ఞాన మానందం బ్రహ్మ" బ్రహ్మము విజ్ఞానస్వరూపము. ఆనందస్వరూపము రాతేర్దాతుః పరాయణామ్" (బృహ. ఉ. 5.9 8), బ్రహ్మమే ధనమునకు దాతకును. పరాయణము. బ్రహ్మనిష్ఠుడైయున్న బ్రహ్మవేత్తకు బ్రహ్మమే పరమప్రాప్యము. (అన్నిటికిని బ్రహ్మమే పరాయణము), ఇత్యాది శ్రుతులచే అఖండ సచ్చిదానంద స్వరూపయగు ఈమెమే ఫలమగుచున్నది. ఒక (విధమగు) జ్ఞానమువలన కలుగు నట్టి ఫలము అట్టి జ్ఞానమునకు విపరీతముగ నుండదు కదా: (పరదేవతాజ్ఞానమునకు ఫలము పరదేవతారూపమగు సచ్చిదానందమే) బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ముం. ఉ. 3. 2. 9) బ్రహ్మము నెరుగువాడు బ్రహ్మమగును. "తరతి శోక మాత్మవిత్" (ఛా. ఉ. 7.1.3) ఆత్మవేత్త శోకమును దాటును: "మాం ధ్యాయత ఉపాసతే తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్" (భగీ. 12.7) సర్వ కర్మసన్న్యాస మొనరించి అనన్యమనస్కులై నన్ను ధ్యానించుచు ఉపాసించువారిని మృత్యు సంసార సాగరమునుండి తరింపజేతును. అనిభగవద్వాక్యము. "బ్రహ్మైవ సన్ బ్రహ్మాఽప్యేతి" (బృహ. ఉ. 4.4.5) తాను బ్రహ్మమై బ్రహ్మము నొందును: ఇత్యాది శ్రుతి స్మృతి శతములచే పురుషార్థ ప్రదానమనగ స్వస్వరూపము నొందించు టయేనని సిద్ధముగుచున్నది.

ఓం హ్రీంకారపరసౌఖ్యదాయై నమః

ఇతి శ్రీ పరమహంస పరివ్రాకాచార్యస్య శ్రీగోవింద
భగవత్పూజ్య పాదశిష్యస్య శ్రీమచ్ఛంకర
భగవతః కృతౌ శ్రీ లలితా
త్రిశతీభాష్యమ్ సంపూర్ణమ్.

— )o( —

ఇత్యేవం తే మయాఽఽఖ్యాతం దేవ్యా నామశతత్రయమ్
రహస్యాతిరహస్యత్వాత్ గోపనీయం త్వయాముసే ॥ 1

ఓ మునీ పైనచెప్పినరీతిగ నీకు దేవియొక్క నామశతత్రయము చెప్పబడినది. ఇవి రహస్యాతిరహస్యములు కావున వీనిని గోప్యముగ నుంచవలెను.

శివవర్ణాని నామాని శ్రీదేవ్యా కథితాని హి
శక్త్యక్షరాణి నామాని కామేశకథితాని చ ॥ 2

వీనిలోని శివవర్ణములు శ్రీదేవిచే చెప్పబడినవి. శక్త్యక్షరములు కామేశ్వరునిచే చెప్పబడినవి

ఉభయాక్షరనామాని హ్యుభాభ్యాం కథితాని వై
తదన్యైర్గ్రథితం స్తోత్ర మేతస్య సదృశం కిము ॥ 3

శివశక్త్యాత్మకములైన అక్షరములు శివశక్తులచే చెప్పబడినవి: ఇతరులు చేసిన స్తోత్రమునకు సాటియగునా ?

నాఽనేన సదృశం స్తోత్రం శ్రీదేవీప్రీతిదాయకమ్ ।
లోకత్రయేఽపి కల్యాణం సంభవే న్నాఽత్ర సంశయః 4

కళ్యాణప్రదమును శ్రీ దేవీప్రీతిదాయకమునగు నట్టి ఈ స్తోత్రమునకు సదృశమైనది. ముల్లోకములందు లేదనుటకు సందియము లేదు.

ఇతి హయముఖగీతం స్తోత్రరాజం నిశమ్య
ప్రగళితకలుషోఽభూ చ్చిత్తపర్యాప్తి మేత్య ।
నిజగురు మథ నత్వా కుంభజన్మా తదుక్తం
పునరధిక రహస్యం జ్ఞాతు మేవం జగాద ॥ 5

ఈ విధముగ హయగ్రీవుడు చెప్పిన స్తోత్రరాజమును విని విగళితకల్మషుడై చిత్తమందు తృప్తినిపొంది నిజగురువునకు నమస్కరించి ఇంకను అధికముగ రహస్యమును తెలియగోరి అగస్త్యుడిట్లుపలికెను.

అగస్త్య ఉవాచ :

అశ్వానన మహాభాగ రహస్యమపి మే వద
శివవర్ణాని కాన్యత్ర శక్తివర్ణాని కాని హి ॥ 6

హే అశ్వానన మహాభాగ, ఈ రహస్యమునుకూడ చెప్పుము ఈ నామములో శివుడు చెప్పినవేవి ? శక్తి చెప్పినవేవి ?

ఉభయో రపి వర్ణాని కాని వా వద దేశిక ।
ఇతి పృష్టః కుంభజ న్మ హయగ్రీవోఽవదత్పునః ॥ 7

వీరివురు చెప్పినవేవి ? నాకు వీనిని చెప్పవలయును. అని కుంభజన్ముడడుగగ హయగ్రీవు డిట్లు చెప్పెను.

తవ గోప్యం కిము స్తీహ సాక్షాదంబాను శాసనాత్ ।
ఇదం త్వతిరహస్యం తే వక్ష్యామి శృణు కుంభజ ॥ 8

నీకు చెప్పకుండ దాచవలయునది లేదు. కావున ఓ కుంభజ, సాక్షాత్తు అంబయొక్క శాసనము ననుసరించి అతిరహస్యమగు వీనిని నీకు చెప్పెదను వినుము.

ఏతద్విజ్ఞానమాత్రేణ శ్రీవిద్యా సిద్ధిదా భవేత్
కత్రయం హద్వయం చైవ శైవోభాగః ప్రకీర్తితః ॥ 9

ఈ విషయము నెరిగినంతనే శ్రీవిద్య సిద్ధినిచ్చునట్టిదగును. మంత్రములోని కకారత్రయము, హకారద్వయము శివుడు చెప్పిన భాగములని చెప్పబడినవి.

శక్త్యక్షరాణి శేషాణి హ్రీంకార ఉభయాత్మకః ।
ఏవం చ విభాగ మజ్ఞాత్వా యే విద్యాజపశాలినః ॥ 10

హ్రీంకారములు శివశక్త్యాత్మకములు; మిగిలిన అక్షరములు శక్త్యక్షరములు. ఈ విభాగమును తెలుసుకొనకుండ మంత్రమును జపించువారికి కల్పకోటిశతములకైనను మంత్రసిద్ధి కలుగదు,

న తేషాం సిద్ధిదా విద్యా కల్పకోటిశతైరపి ।
చతుర్భిశ్శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పంచభిః 11
నవచక్రైశ్చ సంసిద్ధం శ్రీచక్రం శివయోర్వపుః ।
త్రికోణ మష్టకోణం దశకోణద్వయం తథా ॥ 12
చతుర్దశారం చైతాని శక్తిచక్రాణి పంచ చ ।
బిందుశ్చాష్టదళం పద్మం పద్మం షోడశపత్రకమ్ ॥ 13
చతురశ్రం చ చత్వారి శివచక్రాణ్యనుక్రమాత్ ।
త్రికోణేబైందవం శ్లిష్టం అష్టారేఽష్టదళాంబుజమ్ ॥ 14
దశారయోః షోడశారం భూగృహం భువనాశ్రకే ।
శైవానామపి శాక్తానాం చక్రాణాం చ పరస్పరమ్ ॥ 15
అవినాభావ సంబంధం యో జానాతి స చక్రవిత్
త్రికోణరూపిణీ శక్తిర్బిందురూపపరః శివః ॥ 16

శ్రీ చక్రము శివునియొక్కయు శరీరము: అందు శివచక్రములు నాలుగు, శక్తిచక్రములు అయిదును కలవు. త్రికోణము, అష్టకోణము, దశకోణములు కలవి రెండు: చతుర్దశారము ఈ అయిదును శక్తిచక్రములు; బిందువు, అష్టదళ పద్మము, చతురశ్రము, ఈ నాలుగును శివచక్రములు. శివశక్తిచక్రములకు అవినాభావ సంబంధమున్నది. త్రికోణమందు బిందువు సంశ్లిష్టమైయున్నది. అష్టకోణమందు ఆ దశపద్మము, దశకోణద్వయమునందు షోడశారము, భువనాశ్రకమునందు (చతుశారమునందు) భూగృహము (చతురశ్రము) సంశ్లిష్టములైయున్నవి. వశాక్త చక్రములయొక్క అవినాభావ సంబంధ మెరిగినవాడు చక్రసంకేతము నెరిగినవాడగుచున్నాడు. శక్తి త్రికోణరూపిణి, శివుడు బిందురూపుడు.

అవినాభావసంబంధం తస్మాద్బిందుత్రికోణయోః
ఏవం విభాగ మజ్ఞాత్వా శ్రీచక్రం య స్సమర్చయేత్॥ 17
న తత్ఫల మవాప్నోతి లలితాంబా న తుష్యతి
యే చ జానంతి లోకేఽస్మిన్ శ్రీవిద్యా చక్రవేదినః॥ 18

కావున బిందు త్రికోణములకు అవినాభావ సంబంధమున్నది. శివశక్త్యాత్మక విభాగము నెరుగకుండ శ్రీ చక్రమును అర్చించువానికి ఫలము కలుగదు. వానిపూజచే శ్రీలలితాదెవి సంతోషింపదు; ఈ విభాగము నెరిగినవారు శ్రీ విద్యా-చక్రవేత్తలగుచున్నారు.

సామాన్యవేదినః సర్వే విశేషజ్ఞోఽతిదుర్లభః
స్వయం విద్యా విశేషజ్ఞో విశేషజ్ఞం సమర్చయేత్॥ 19

లోకములో అందరు సాధారణముగ ఇట్టి విశేషజ్ఞానము లేనివారే స్వయముగ విద్యావిశేషము నెరిగివాడు విశేజ్ఞునే పూజింపవలెను.

తస్మై దేయం తతో గ్రాహ్య మశక్తస్తస్య దాపయేత్
అంధంతమః ప్రవిశంతయేఽవిద్యాం సముపాసతే॥ 20
ఇతి శ్రుతి రపాహైతానవిద్యోపాసకాన్ పునః
విద్యాన్యోపాసకా నేవ నిందత్యారుణికీ శ్రుతిః॥ 21

అట్టి విశిష్టునకీయవలెను ఇచ్చుటకు శక్తిలేకున్న ఇప్పించవలెను: అట్టివానినుండి విద్యను గ్రహింపవలెను. అంధమగు తమస్సును అవిద్య నుపాసించువారు ప్రవేశింతురని ఆరుణిక శ్రుతి (బృహ. ఉ. 6-4-10) చెప్పినది. ఈ శ్రుతి ఇతర విద్యల నుపాసించువారినే నిందించుచున్నది.

అశ్రుతాః సశ్రుతాస శ్చ యజ్వానో యేఽప్యయజ్వనః
స్వర్యంతో నాపేక్షంతే ఇంద్ర మగ్నిం చ యే విదుః॥ 22
సికతా ఇవ సంయంతి రశ్మిభిః సముదీరితాః
అస్మాల్లోకా దముష్మాచ్చేత్యాహ చారుణికీ శ్రుతిః॥ 23

అశ్రుతులు (చదువనివారు) సశ్రుతులు (చదివినవారు), యజ్వలు యజ్వలుకానివారు ఇంద్రుని అగ్నిని ఎరిగినవారు వీరందరు స్వర్గమునకు పోవుచు ఈ విద్యను గైకొనరు. రశ్మలచే ప్రేరితములైన ఇసుకరేణువులు పోవుచుండు నట్లు ఇట్టివారు ఒక లోకమునుండి మరియొక లోకమునకు పోవుచుందురు, అని అరుణిక శ్రుతి చెప్పినది.

యస్య నో పశ్చిమం జన్మ యది వా శంకరః స్వయం
తే నైవ లభ్యతే విద్యా శ్రీమత్పంచదశాక్షరీ ॥ 24

ఎవనికిక జన్మము లేదో, ఎవడు సాక్షాత్తుగ శంకరుడో వానిచేతనే శ్రీమత్పంచదశాక్షరీవిద్య పొందబడుచున్నది.

ఇతి మంత్రేషు బహుధా విద్యాయా మహిమోచ్యతే
మోక్షైక హేతువిద్యా తు శ్రీవిద్యా నాఽత్ర సంశయః ॥ 25

ఇట్లనేక విధములుగ మంత్రములందు ఈ విద్యయొక్క మహిమము చెప్పబడినది. మోక్షైక హేతువగు విద్య శ్రీ విద్యయే. ఇందు సంశయములేదు

న శిల్పాదిజ్ఞానయుక్తే విద్వచ్ఛబ్దః ప్రయుజ్యతే
మోక్షైకహేతువిద్యా సా శ్రీవిద్యైవ న సంశయః ॥ 26

శిల్పాదజ్ఞానము కలిగినవానియందు విద్వాంసుడు అను శబ్దమును ప్రయోగింపరు. మోక్షైక హేతువగు విద్య శ్రీవిద్యయే: సంశయములేదు:

తస్మాద్విద్యావిదేవాత్ర విద్వాన్ విద్వాన్ నిరీర్యతే ।
స్వయం విద్యావిదే దద్యాత్ ఖ్యాపయేత్
తద్గుణాన్ సుధీః 27

కావున ఈవిద్య నెరిగినవాడే విద్వాంసుడని చెప్పబడుచున్నాడు. బుద్ధిమంతుడైనవాడు అట్టివిద్య నెరిగినవాని కీయవలెను: వానిగుణములను అందరకు తెలియజేవలెను.

స్వయం విద్యారహస్యజ్ఞో విద్యామాహాత్మ్యవేద్యపి
విద్యావాదం నార్చయేత్ కో వా తం పూజయే జ్జనః 28

స్వయముగ విద్యారహస్యమెరిగినవాడు, ఈవిద్యయొక్క మాహాత్మ్య మెరిగినవాడు ఈ విద్యనెరిగినవానిని పూజింపకున్న ఇతరులు పూజింతురా ?

ప్రసంగా దిద ముక్తం తే ప్రకృతం శృణు కుంభజ
యః కీర్తయేత్ సకృద్ భక్త్యా దివ్యనామ శతత్రయమ్ ॥ 29
తస్య పుణ్య మహం వక్ష్యే శృణు త్వం కుంభసంభవ
రహస్యనామసాహస్ర ప్రాప్తే యత్ఫల మీరితమ్ ॥ 30
తత్ఫలం కోటిగుణిత మేకనామజపా ద్భవేత్
కామేశ్వరీ కామేశాభ్యాం కృతం నామశతత్రయమ్ ॥ 31

పైన చెప్పినదంతయు ప్రసంగవశమున చెప్పబడినది. కుంభజ ! ఇక ప్రకృతమగునది వినుము. ఈ దివ్యనామ శతత్రయమును కీర్తించినవారి పుణ్య మెట్టిదో చెప్పెదను. రహస్యమగు సహస్రనామముయొక్క పఠనమందు ఏ ఫలము చెప్పబడినదో అంతకంటె కోటిరెట్లుగ ఇందులోని ఒక్కొక్క నామమును జపించిన ఫలము కలుగుచు. ఈ నామ శతత్రయము కామేశ్వరిచే, కామేశ్వరునిచే చేయబడ నదిగదా !

నాఽన్యేన తులయేదేతత్ స్తోత్రేణాన్యకృతేన చ
శ్రియః పరంపరా యస్య భావి వా చోత్తరోత్తరమ్ ॥ 32

ఇతరులచే చేయబడిన స్తోత్రమును ఈ స్తోత్రముతో సాటియని చెప్పుటకు వీలులేదు. ఈ స్తోత్రము వలన శ్రియఃపరంపర కలుగును

తేనైవ లభ్యతే చైతత్ పశ్చాచ్ఛ్రేయః పరీక్షయేత్
అస్యా నామ్నాం త్రిశత్యాస్తు మహిమా కేన వర్ణ్యతే॥ 33

అందుచే ఈ విద్యనే పొంది తరువాత కలుగునట్టి శ్రేయస్సును చూడవలెను. త్రిశతీ నామముల మహిమను వర్ణింప నెవరికి శక్యమగును ?

యా స్వయం శివయో ర్వక్త్రపద్మాభ్యాం పరినిస్సృతా
నిత్యం షోడశసంఖ్యాకాన్ విప్రా నాదౌ తు భోజయేత్ 34

శివునియొక్కయు, శివయొక్కయు, ముఖపద్మములనుండి నిస్సృతమగు ఈ నామముల మహిమ చెప్పతరమగునా ? మొదట, నిత్యము 16 గురుబ్రాహ్మణులను భుజింపచేయవలెను.

అభ్యక్తాంస్తిలతైలేన స్నాతా నుష్ణేన వారిణా
అభ్యర్చ్య గంధపుష్పాద్యైః కామేశ్వర్యాదినామభిః ॥ 35

ముందుగ ఆ బ్రాహ్మణులను తిలతైలముచే ఉష్ణోదకముచే స్నానము చేయించి గంధ పుష్పాదులచేతను, కామేశ్వర్యాది నామములచేతను అర్చింపవలెను.

సూపాపూపైశ్శర్కరాద్యైః పాయసైః ఫలసంయుతైః
విద్యావిదో విశేషేణ భోజయేత్ షోడశ ద్విజాన్ ॥ 36

సూపము, శర్కర గల అపూపము, పాయసము, ఫలము ఇత్యాదులచే సమృద్ధమైన భోజనము 16 గురు బ్రాహ్మణులకు విద్యనెరిగినవాడు పెట్టవలెను.

ఏవం నిత్యార్చనం కుర్యాదాదౌ బ్రాహ్మణభోజనమ్
త్రిశతీనామభిః పశ్చాద్బ్రాహ్మణాన్ క్రమశోఽర్చయేత్ 37

మొదట ఈ విధముగ నిత్యార్చనము, బ్రాహ్మణ భోజనము చేయవలెను: పిమ్మట త్రిశతీ నామములతో బ్రాహ్మణులను అర్చింపవలెను.

తైలాభ్యంగాదికం దత్వా విభవే సతి భక్తితః
శుక్లప్రతిపదారభ్య పౌర్ణమాస్యవధిక్రమాత్ ॥ 38
దివసే దివసే విప్రాః భోజ్యా వింశతిసంఖ్యయా
దశభిః పంచభిర్వాఽపి త్రిభిరేకేన వా దినైః 39
త్రింశత్ షష్టిః శతం విప్రాః సంభోజ్యాః త్రిశతం క్రమాత్
ఏవం యః కురుతే భక్త్యా జన్మమధ్యే సకృన్నరః 40

ప్రతిదినము 20 మంది విప్రులకు భోజనము పెట్టవలెను. పదిరోజులకు గాని, ఐదురోజులకుగాని, మూడురోజులకుగాని, ఒక్కరోజునగాని ముప్పదిమందికి, అరువదిమందికి నూరుగురకు భోజనము పెట్టవలెను: ఇట్లు ఒక్కసారియైనను జన్మ మధ్యమున చేసినయెడల వానిజన్మము సఫలమగును, వానికి ముక్తి హస్తగతమై స్థిరముగ నుండును.

తస్యైవ సఫలం జన్మ ముక్తిస్తస్య కరే స్థిరా
రహస్యనామ సాహస్రభోజనేఽప్యేవమేవ హి 41

సహస్రనామ సాహస్రమునందుకూడ ఇట్లే భోజనముండవలెను. అనగ మొదట నిత్యబలి, తరువాత బ్రాహ్మణభోజనము.

అదౌ నిత్యబలిం కుర్యాత్ పశ్చాద్బ్రాహ్మణభోజనం
రహస్యనామ సాహస్రమహిమా యో మయోదితః 42
సశీకరాణు రత్రైకనామ్నో మహిమవారిధేః
వాగ్దేవీరచితే నామసాహస్రే యద్యదీరితం 43

త్రిశతీనామములోని ఒక్కనామములో గల మహిమవార్ధియందు నేనిది వరలో చెప్పిన రహస్యనామ సహస్రమహిమ ఒకతుంపురులోగల అణువువంటిది. వాగ్దేవీవిరచితమగు నామసహస్రపారాయణమునకు చెప్పినఫలము కంటె త్రిశతీనామములలోని ఒకనామము కీర్తించినందున కోటిరెట్లు ఫలము కలుగును.

తత్ఫలం కోటిగుణితం నామ్నోఽప్యేకస్య కీర్తనాత్
ఏతదన్యైర్జపైః స్తోత్రైరర్చనైర్యత్ఫలం భవేత్ 44
తత్ఫలం కోటిగుణితం భవేన్నామ శతత్రయాత్
వాగ్దేవీరచితా స్తోత్రే తాదృశో మహిమా యది 45
సాక్షాత్కామేశకామేశీకృతేఽస్మిన్ గృహ్యతా మితి
సకృత్ సంకీర్తనాదేవ నామ్నా మస్మిన్ శతత్రయే 46
భవేచ్చిత్తస్యపర్యాప్తి ర్న్యూనమన్యానపేక్షిణీ
న జ్ఞాతవ్య మితోఽప్యన్య న్న జప్తవ్యం చ కుంభజ 47

ఇతర జపములచే ఇతరస్తోత్రములచే కలిగిన ఫలముకంటె త్రిశతీ నామముల పారాయణము వలన కొటిరెట్లు ఎక్కువగు ఫలము కలుగును. వాగ్దేవీరచితమగు సహస్రనామములందు అంతటి మహిమ మున్నప్పుడు సాక్షాత్తుగ కామేశ్వరీ కామేశ్వరులచే రచింపబడిన త్రిశతియందెంత మహిమముండును? ఈ త్రిశతిని

ఒక్కసారి సంకీర్తన మొనరించిన చిత్తతృప్తి కలుగును. త్రిశతి జపించువానికి ఇతరమును తెలుసుకొనవలసిన ఆవశ్యకత, ఇతర జపముల ఆవశ్యకతలేదు.

యద్యత్సాధ్యతమంకార్యం తత్తదర్థమిద జపేత్
తత్తత్ఫలమవాప్నోతి పశ్చాత్కార్యంపరీక్షయేత్ 48

ఏ కార్యమునైన సాధింపదలచినవారు ఈ జపమునొనరించిన ఆ ఫలము కలుగును

యే యే ప్రయోగాస్తంత్రేషు తైస్తైర్యత్సాధ్యతే ఫలమ్
తత్సర్వం సిధ్యతి క్షిప్రం నామత్రిశతికీర్తనాత్ 49

ఏ ఫలము నుద్దేశించి ఏ ప్రయోగములు తంత్రములందు చెప్పబడినవో అవి యన్నియు నామత్రిశతీకీర్తనము వలన సిద్ధించును.

ఆయుష్కరం పుష్టికరం పుత్రదం వశ్యకారకమ్
విద్యాప్రదం కీర్తికరం సుకవిత్వప్రదాయకమ్ 50
సర్వసంపత్ప్రదం సర్వభోగదం సర్వసౌఖ్యదమ్
సర్వాభీష్టప్రద చైవ దేవ్యా నామశతత్రయమ్ 51

ఈ త్రిశతి ఆయుష్కరము, పుష్టికరము, పుత్రుల నిచ్చునట్టిది, ఇతరులను వశ్యులగ చేయునట్టిది. విద్యాప్రదము, కీర్తికరము, కవిత్వప్రదము, సంపత్ప్రదము, భోగప్రదము, సౌఖ్యప్రదము, సర్వాభీష్టప్రదమై యున్నది.

ఏతజ్జపపరో భూయా న్నాన్యదిచ్ఛేత్ కదాచన
ఏతత్కీర్తనసంతుష్టా శ్రీదేవీ లలితాంబికా 52
భక్తస్య యద్యదిష్టం స్యాత్ తత్ పూరయతే ధ్రువం
తస్మాత్ కుంభోద్భవ మునేకీర్తయ త్వ మిదం సదా 53

కావున త్రిశతీజపపరుడై యుండవలెను. ఇతరమును కోరనక్కరలేదు. ఈ కీర్తనముచే సంతుష్టయై లలితాంబిక భక్తున కేది యిష్టమో దాని నిచ్చును. కావున కుంభసంభవ! నీవు దీనినే కీర్తించుచుండుము.

అపరం కించిదపి తే బోద్ధవ్యం నాఽవశిష్యతే
ఇతి తే కథితం స్తోత్రం లలితాప్రీతిదాయకమ్ 54

నాకింక చెప్పవలయున దేదియు లేదు. లలితాప్రీతిదాయకమగు స్తోత్రము నీకు చెప్పియుంటిని.

నాఽవిద్యావేదినే బ్రూయా న్నాఽభక్తాయ కదాచన
న శఠాయ నదుష్టాయ నాఽవిశ్వాసాయకర్హిచిత్ 55

అవిద్యావంతునకు, ఆ భక్తునకు, శఠునకు, దుష్టునకు. విశ్వాసరహితునకు ఈ నామత్రిశతి చెప్పకూడదు.

యో బ్రూయా త్త్రిశతీం నామ్నాం తస్యాఽనర్థో మహాన్ భవేత్
ఇత్యాజ్ఞా శాంకరీ ప్రోక్తా తస్మాత్ గోప్య మిదం త్వయా 56

అట్టివారికి త్రిశతిని చెప్పినయెడల గొప్పదగు అనర్థము సంభవించును.: ఇది శంకరుని ఆజ్ఞ. కావున నీవు దీనిని గోప్యముగనుంచుము.

లలితాప్రేరితేనైవ మయోక్తం స్తోత్ర ముత్తమం
రహస్యనామసాహస్రా దపి గోప్య మిదం మునే 57

లలితాదేవి ప్రేరణముచే నీకు నేనీస్తోత్రమును చెప్పియుంటిని. దీనిని రహస్యనామసాహస్రము కంటె గోప్యముగనుంచవలెను.

ఏవ ముక్త్వా హయగ్రీవః కుంభజం తాపసో త్తమం
స్తోత్రేణాఽనేన లలితాం స్తుత్వా త్రిపురసుందరీమ్ 58
ఆనందలహరీ మగ్నమానసః సమవర్తత

ఇట్లు హయగ్రీవుడు కుంభజన్మునకు చెప్పి, ఈ స్తోత్రముతో లలితను త్రిపురసుందరిని స్తుతించి ఆనందప్రవాహ మగ్నమానసుడై యుండెను.

ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే ఉత్తరఖండే హయగ్రీవాఽగస్త్య సంవాదే
స్తోత్రఖండే ఉత్తరఖండే లలితాత్రిశతీ స్తోత్రం సంపూర్ణమ్.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

